రసరమ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 29 | సంచిక : 11
డిసెంబరు : 2006 | 347వ సంచిక

ఈ నెల నవల

పెళ్ళికీ, పిల్లాపాపలకూ నోచుకోకుండా, కుటుంబ జీవనానికి దూరమై నికృష్టంగా గడిపే జాతికి మూఢాచారాల నుండి, స్వార్థపరుల ఉక్కు పిడికిళ్ళ నుంచి విముక్తి కలిగించిన వైనాన్ని వర్ణించిన



వి.ఆర్. రాసాని నవల

## ముద్ర

10వ పేజీలో

బొమ్మలు: పినిశెట్టి

హెల్త్ బిట్స్: వెంకటేశ్వరరావు

# చిరునవ్వు

## కొత్త శీర్షిక ప్రారంభం

రికార్డో ఎలీజర్ నెఫ్టాలీ రెయెస్‌బై బసాల్టో గురించి తెలుసా? ఆయన కలం పేరు పాబ్లో నెరుడా (1904-1973). ఈ చలియన్ నోబెల్ గ్రహీత (1971)ను చదవని కవితాప్రియు లుండరు. 1927-35 మధ్య బర్మా, సిలోన్, జావా, సింగపూర్‌లలో తన దేశం తరఫున కాన్సుల్‌గా పనిచేశాడు నెరుడా.

మన స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రత్యక్షంగా చూశాడు. జాతీయ కాంగ్రెస్ సమావేశా లలో గాంధీ, నెహ్రూలను కలిశాడు.

తన 'జ్ఞాపకాల'లో ఇండియా గురించి ఇలా రాసుకున్నాడు నెరుడా.

"ప్రపంచ శాంతికి కృషిచేస్తున్న ఇండియ న్లతో చర్చించాలని 'పార్టిసన్స్ ఫర్ పీస్' (ఒక అంతర్జాతీయ సంస్థ) తరఫున 1950లో ఇండియా వెళ్లాను. ప్రైమ్మి నిస్టర్ నెహ్రూ కోసం మా ప్రెసిడెంట్ పంపిన లేఖ కూడా నా వద్ద వుంది. నెహ్రూకు 'శాంతి దూత'గా మంచి పేరుంది.

సుమారు ముప్ఫైఏళ్ల తరువాత తిరిగి ఇక్కడికి రావటం... గాంధీ కలలు నెరవే రాయి. స్వాతంత్ర్యం వచ్చింది.




బొంబాయిలో కస్టమ్స్ వాళ్లు నన్ను అను మానంగా చూశారు. దుస్తులున్న సూట్ కేస్, ఒక చిన్న లెదర్‌బ్యాగ్ మాత్రమే వెంట తెచ్చాను. అయినా ప్రతి వస్తువూ పరిశీలించారు. జేబులు వెదికారు. రెండు గంటలు ఆ 'సర్చ్' కొనసాగింది. నెహ్రూను కలవటానికే వచ్చానన్నాను. చివరికి ట్రావెల్ డాక్యుమెంట్స్, పాస్‌పోర్ట్



*జీవితంలో సుఖం లేదు*
*మృత్యువు కూడా పలకరించదు.*
*ఆకలి కేవలం ఆకలి కాదు*
*మన సంస్కారానికి కొలమానం అది*
*నెత్తుటి మరకల స్వర్గకిరీటం*
*అందరికీ శిరోధార్యం*

– పాబ్లో నెరుడా

తీసుకుని నన్ను వదిలారు. చిలీ దేశస్థుల సహనం ప్రపంచ ప్రసిద్ధం. అయినా దానికీ ఓ హద్దుంటుంది.

తెల్లారి నెహ్రూ సోదరి (పేరు గుర్తుకు రావటంలేదు)తో 'లంచ్' ఏర్పాటు చేశారు కొందరు. ఆమె గొప్ప అందగత్తె. ఆ చీర కట్టు, ఆ డ్రెస్ రంగుల కలయిక అద్భుతం. అంతటి సౌందర్యవతి కూడా వేళ్లతో భోజనం చెయ్యటం ఆశ్చర్యమే సింది. ప్రపంచ శాంతి ఉద్యమాన్ని గురించి నాకు తోచింది చెప్పాను.

ఆ సాయంత్రం నా పేపర్లు తిరిగి వచ్చాయి. ఢిల్లీలో అనేకమంది ఉద్యమ నాయకుల్ని కలిశాను. మరుసటిరోజు నెహ్రూతో అపాయింట్ మెంట్ దొరి కింది.

నన్ను ఆహ్వానించి, షేక్ హాండ్ చేశాడు గాని మొహంలో చిరునవ్వు లేదు. ముప్పై ఏళ్ల క్రితం అతణ్ణీ, అతడి తండ్రినీ కలిశాను. అప్పుడు వాళ్లెన్ని విష యాలు మాట్లాడారు! అవన్నీ గుర్తు చేశాను. అయినా అతనిలో మార్పు రాలేదు. లేఖ అందచేశాను. నేను చేస్తున్న శాంతి ప్రయత్నాలకు నెహ్రూ సహకారం అందించాలని ఉందందులో. చదివి మాట్లాడకుండా పక్కన పెట్టాడు. ఎందుకోగాని ఆ క్షణాన అతడంటే అయిష్టం ఏర్పడింది. బహుశా దేశ సమ స్యలు అతణ్ణి సతమతం చేస్తుండాలి. అధి కారంలో ఉన్నవాళ్ళకు ఆజ్ఞలివ్వటమే అల వాటు. ఆయన తండ్రి మోతీలాల్ ది జమీందార్ల వంశం. నెహ్రూలోనూ ఆ పోలికలు కనిపించాయి.

"ఉత్తరానికి ఏం సమాధానం చెప్తుమం టారు? "

"నేను రాస్తానులెండి"

"అణ్వస్త్రాల ప్రమాదం ముంచుకొస్తు న్నది. అందరూ నిగ్రహంతో వ్యవహరిం



పండిట్ జవహర్ లాల్ నెహ్రూ

చాలి".

"పరస్పర ఆరోపణలతోనే రోజులు గడి చిపోతున్నాయి" అన్నాడు నెహ్రూ.

నేను సెలవు తీసుకుని లేచాను. మాట్లాడటానికేమీ మిగల్లేదు.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ? "

బొంబాయి కస్టమ్స్‌లో జరిగిన గొడవ గురించి చెప్పాను. మనసు తేలికపడింది. "విశ్వశాంతి" కాముకుల ప్రవర్తన ఇలా ఉంటుంది!

ఐదేళ్ల తర్వాత మాస్కోలో లెనిన్ పీస్ ప్రైజ్ కమిటీ సమావేశమైంది. బహు మతి గ్రహీతల్ని ఎంపిక చెయ్యాలి. భారత ప్రతినిధి నెహ్రూ పేరు ప్రతిపా దించాడు. నేను చిరునవ్వు నవ్వకుండా ఉండలేకపోయాను. అక్కడున్న వాళ్ళె వరికీ నా నవ్వు అర్థం తెలిసుండదు. మొత్తంమీద అతణ్ణి సమర్థించాను.

– స్వప్న

ప్రపంచ ప్రసిద్ధ నవలల
పరిచయ వేదిక
కాలాతీతం
1866

# క్రైం అండ్ పనిష్‌మెంట్

దొస్తొయేవ్‌స్కీ కేవలం ధనార్జనే ధ్యేయంగా రాసిన నవల 'క్రైం అండ్ పనిష్‌మెంట్'. 1864లో ఆయన మొదటి భార్య, సోదరుడూ మరణించారు. కుటుంబ పోషణకు ఎంతో కొంత డబ్బు కావాలి. మరే పనీ చేతగాక, డబ్బు కోసం ఈ నవల రాశాడు. ఇంతకన్న 'ఎక్సైటింగ్' నవలా, ముక్కుకు ముకుతాడు వేసి ముందుకు పరుగెత్తించే 'మర్డర్ స్టోరీ'. ప్రపంచ సాహిత్యంలో మరొకటి లేదు. 'డిటెక్టివ్', 'థ్రిల్లర్'ల కుండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయిందులో. పాత్రల మానసిక సంఘర్షణను చిత్రించటంలో ప్రత్యేక ప్రతిభ కనపరుస్తాడు రచయిత. 'మనం చేస్తున్న చర్యల వెనుక దాగిన కారణాలేమిటి? ' అన్నది ఇతివృత్తం. 'పశ్చాత్తాపం, ఇచ్ఛికంగా శిక్షను అనుభవించటం ద్వారా మాత్రమే వ్యక్తి జీవితానికి నిష్కృతి' అని నమ్మాడు దొస్తొయేవ్‌స్కీ.




'నేరము - శిక్ష'లో ప్రధాన పాత్ర రాస్కోల్నికోవ్. విద్యార్థి, అంతర్ముఖుడు. వడ్డీ వ్యాపారం చేసి అందర్నీ జలగలా పీడిస్తున్న ఒక వృద్ధురాల్ని హత్య చేస్తాడు. ఇలాంటి వాళ్ళు చస్తేనే సమాజానికి శ్రేయస్సు అనుకుంటాడు. జీనియస్సులూ, మేధావులూ సాధారణ నీతి సూత్రాలకు అతీతులని ఒక వ్యాసం కూడా రాశాడు. తనూ అలాంటి వాణ్ణని అతడి నమ్మకం. తన చదువుకు డబ్బు కావాలి. ఆ తర్వాత సమాజానికెంతో ఉపయోగపడగలడు. వడ్డీ వ్యాపారులంటే దుష్ట శక్తులే. అలాంటి వాళ్ళ సంపదను తను సత్కార్యాల కోసం ఖర్చు చేస్తున్నానను కుంటాడు.

కుటుంబ పరిస్థితి కూడా ఆశాజనకంగా లేదు. నగరంలో ఉంటున్న తనను ఆర్థికంగా ఆదుకోవటం వాళ్లకు వీలు పడదు. హత్యను సమర్థించుకోవటానికి అనేక వాదనలు ప్రతిపాదించుకుంటాడు. కాని అన్నీ పరస్పర విరుద్ధంగా కనిపిస్తాయి. ఏది మంచి? ఏది చెడు? ఒక ఉన్మత్త దశలో హత్య చేశాడు గనక అదంతా కలలా జరిగింది. చేసింది తను కాదని నమ్మాలనుకుంటాడు. క్షణికోద్రేకంలో చేసిన నేరం నిజంగా మనం చేసినట్టా? అదొక స్వాప్నికావస్థ కాదా? ఆ క్షణాన మన వశంలో మనం లేము గదా! అనుకుంటాడు.

ఆ తర్వాత ప్రారంభమవుతుంది పోలీసులతో దాగుడు మూతలు. వాళ్ళకు దొరికినట్టే దొరికి తప్పించుకుంటాడు. వాళ్ళకేవో కొన్ని 'క్లూస్' దొరుకుతాయి. వాటిని నేరస్థుడే జార విడుస్తాడు. కానీ తీరా వెళ్లేసరికి మాయమవుతాడు. ఒకసారి జడ్జి పోర్ఫిరీ

పెట్రోలిచ్ తారసపడతాడు. అయితే అతడు హంతకుడి మనస్తత్వం ఏమిటో తెలుసుకోవాలని మాత్రమే ప్రయత్నిస్తాడు. సాక్ష్యాలు తెలిసినా వాటిని పట్టించుకోడు. నేరం చెయ్యటానికి గల కారణాలు రాబట్టగలిగితే, కోర్టులో స్వయంగా లొంగిపోయేలా అతణ్ణి ఒప్పించవచ్చు అనుకుంటాడు. నేరస్థుడి దృష్టి నుండి కథ చెప్పటం వల్ల, నవలలో సస్పెన్స్ పెరుగుతుంది. ఎప్పుడు ఏ క్షణాన రాస్కల్నికోవ్ పోలీసులకు చిక్కుతాడో తెలియదు. చివరి సీను దాకా ఈ ఉత్కంఠ ఇలాగే కొనసాగుతుంది. 'ప్రాణ సంకటం' పాఠకుల్లో కలిగించే ఆసక్తి 'చెలగాటం' కన్నా ఎన్నో రెట్లు ఎక్కువ.

రాస్కల్నికోవ్, మొదట సామాజిక ప్రయోజనాన్ని ఆశించి హత్య చేశాడు. చివర్న నేరాన్ని అంగీకరించటం కూడా ఒక నైతిక విజయంగానే భావిస్తాడు. రోజూ అబద్ధాలాడుతూ, అందరి కళ్ళు గప్పి తిరగటం ఆత్మ ద్రోహంగా తోస్తుంది. "నేను మామూలు మనిషిని కాను. లోకోద్ధరణకు అవతరించిన మహా పురుషుణ్ణి. ఈ సమాజ నియమాలు నాకు వర్తించవు" అనుకున్నాడొకప్పుడు. కాని, ఇప్పుడు అందరికన్న నీచంగా, రహస్య జీవితం గడపవలసి వచ్చింది. 'పవిత్ర హృదయం' గల ఒక వేశ్య సోన్యా మార్మెలాడోవ్‌తో పరిచయం వల్ల అతడిలో ఈ పరివర్తన కలుగుతుంది. బురదలో పెరిగిన కమలం ఆమె. ఈ లోకానికి సన్మార్గం చూపటానికి కొందరు ఆత్మార్పణ చెయ్యక తప్పదు. తనను తాను దగ్ధం చేసుకునే దివిటీ సోన్యా.

తొలుత రాస్కల్నికోవ్‌కు నేరం ఒప్పుకునే ఉద్దేశం లేదు. కాని సోన్యా వ్యక్తిత్వం, త్యాగం అతడి జీవిత దృక్పథాన్ని మారుస్తాయి. నలుగురికీ మంచి జరగాలంటే స్వార్థాన్ని వదులుకోక తప్పదు. వ్యక్తుల త్యాగఫలమే సమాజ కల్యాణం.

జీసస్ లాగ, పరుల పాపాలకు బాధ్యత తన మీద వేసుకుని, వాళ్ల తరఫున శిక్షను కూడా తను అనుభవించటమే మనిషికి ముక్తి మార్గమని క్రైస్తవుల విశ్వాసం. ఈ ఆధ్యాత్మిక జ్ఞానం మూర్తీభవించిన పాత్ర సోన్యా. "సాల్వేషన్ త్రూ సఫరింగ్" మాత్రమే నిజమని నమ్ముతుంది. హత్య చేసిన రాస్కల్నికోవ్‌లో మానసిక పరివర్తన తీసుకువచ్చి పోలీసులు వచ్చిందాకా ఎందుకు నిరీక్షిస్తావు! స్వచ్ఛందంగా నేరాన్ని అంగీకరించు" అంటూ

దొస్తొయేవ్‌స్కీ జూదరి. ఎప్పుడూ పోగొట్టుకోవడమే గాని గెల్చుకోలేదు. సహజంగానే ఈ నవల బాగానే అమ్ముడుపోయినా ఆర్థిక సమస్యలు తీరలేదు. పైగా మరింత పెరిగాయి. మరుసటి సంవత్సరం రాత్రింబగళ్ళు శ్రమించి 'గాంబ్లర్' (1867) రాశాడు. ఇతివృత్తానికి తగిన పేరే అది. అప్పుల వాళ్ళ నుండి తప్పించుకోవటానికి మరో నాలుగేళ్ళు యూరోపులో పర్యటించాడు. ఆ తర్వాత తన కష్టాలనూ, రచనా సమస్యల్నీ 'ఎ రైటర్స్ డైరీ'లో ప్రచురించాడు.

"మన సాహిత్యంలో రష్యన్ స్వభావాన్ని లోతుగా అర్థం చేసుకున్న ప్రజ్ఞాశాలి దొస్తొయేవ్‌స్కీ. అతని రచనల్లో గాలి, నేల, నీరు కూడా రష్యన్. అయితే అతని పాత్రలకు సార్వజనీనత ఉంది. ప్రపంచంలోని అన్ని దేశాల పాఠకులూ తమ ప్రతిబింబాలను చూసుకోగల అద్దాలు ఆయన నవలలు" అన్నాడు టాల్‌స్టాయ్.

'నా శాస్త్ర జ్ఞానం కన్నా గొప్పది దొస్తొయెవ్‌స్కీ సాహిత్యం" అన్నాడు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్.



## ఫ్యోదొర్ దొస్తొయేవ్‌స్కీ (1821-1881)

టాల్‌స్టాయ్, తుర్గెనీవ్‌లతో పోల్చదగిన మరొక గొప్ప రష్యన్ రచయిత ఫ్యోదొర్ మిహైలొవిచ్ దొస్తొయేవ్‌స్కీ. అయితే వాళ్లలాగ ఇతడు సంపన్నుడూ, భూస్వాముల వర్గానికి చెందిన వాడూ కాదు. తండ్రి మాస్కోలోని ఒక ప్రభుత్వ ఆసుపత్రిలో వైద్యుడు. ఫ్యోదొర్ అక్కడే జన్మించాడు. ఆ రోజుల్లో డాక్టర్ల ఆదాయం చాలా తక్కువ. చాలీ చాలని సంపాదనతో ఇల్లు గడవటం కష్టంగానే ఉండేది. పరిశీలనే కాదు. స్వానుభవం కూడా జోడించి రాసిన తొలి నవలిక "పేద జనం" (1845). ఆనాటి ప్రముఖ విమర్శకుడు బెలిన్‌స్కీ ప్రశంసలు పొందింది. దిగువ తరగతి ప్రజల దీన స్థితిని కళ్ళకు కట్టినట్టుగా చూపిన ఈ కథను చదివి పాఠకులు 'కన్నీరు మున్నీరుగా విలపించారు'- (ఆనాటి పత్రికలనేకం ఈ విషయం ప్రస్తావించాయి). ధీరోదాత్త పురుషులు మాత్రమే కథానాయకులుగా ఉండాలన్న సమకాలీన సాంప్రదాయానికి విరుద్ధంగా మకార్‌దేవుష్కిన్ పాత్రను సృష్టించాడు దొస్తొయేవ్‌స్కీ. ఇతడు అందగాడూ కాదు. యువకుడూ కాదు. బతుకు భారంగా మారిన ఒక పేద గుమాస్తా మాత్రమే. 'ఈ సమాజంలో ఒక వర్గం వారికి కష్టాలూ, మరొక వర్గం వారికి విలాసాలూ ఎందుకు? ' అని ప్రశ్నిస్తాడు. రష్యన్ సాహిత్యంలో ఇది "తొలి సామాజిక నవల" అంటారు.

తరువాతి దశలో దొస్తొయేవ్ స్కీ ప్రభుత్వ (జార్) వ్యతిరేక విప్లవ గ్రూపులతో సంబంధం పెట్టుకున్నాడు. ఇతనిది నిజంగా 'తిరుగుబాటు స్వభావమేనా? ' అని నిరంతరంగా చర్చ జరుగుతూనే ఉంది. కొన్నాళ్ళకే విప్లవ గ్రూపు సభ్యులతో పాటు దొస్తొయేవ్‌స్కీని పోలీసులు అరెస్టు చేశారు. విచారణ జరిపి మరణ శిక్ష విధించారు. ఫైరింగ్ స్క్వాడ్ కొందర్ని కాల్చేసింది. చివరి క్షణంలో జారు చక్రవర్తి 'ఒక ప్రాక్టికల్ జోక్'గా దొస్తొయేవ్‌స్కీకి క్షమాభిక్ష ప్రసాదించాడు. సహజంగానే ఈ సంఘటన అతడి జీవిత దృక్పథాన్ని మార్చింది. మృత్యువును పలకరించి వచ్చిన దొస్తొయేవ్‌స్కీ సైబీరియా మంచుటెడారిలో అయిదేళ్ళు కఠిన కారాగార శిక్ష అనుభవించాడు. మొత్తం మీద తొలి ప్రయత్నాల తర్వాత ఎనిమిది సంవత్సరాలు సాహిత్యానికి దూరమయ్యాడు. ఏమీ ప్రచురించకపోయినా, జీవితం నేర్పిన కొత్త సత్యాలతో కథలల్లుకుంటూనే ఉన్నాడు.

సైబీరియా అనుభవాల గురించి రాసిన తొలి పుస్తకం 'ది మేనర్ ఆఫ్ స్పిపాంచి

ఒక శిలువ బహుమతిగా ఇస్తుంది. (జీసస్ లాగే) రాస్కల్నికోవ్ దాన్ని మోసుకుని పయనిస్తాడు. (లోకంలో అందరూ ఒక అదృశ్య శిలువను మోస్తూనే ఉన్నారు!)

అతడికి శిక్షపడి, సైబీరియాకు తరలించినప్పుడు సోన్యా అతణ్ణి వెంబడిస్తుంది. ఆమె నమ్మిన 'వెలుగుబాట' అదే. నెత్తురోడుతున్న గొడ్డల్ని పట్టుకున్న రాస్కల్నికోవ్ చివరికి శిలువ మోయటం ద్వారా జీవిత పరమార్థాన్ని గ్రహిస్తాడు.

ఇందులో సెయింట్ పీటర్స్‌బర్గ్ నగరంలోని మురికివాడల వర్ణన కూడా ప్రధానాకర్షణ.

ఇది 'మర్డర్ స్టోరీ' అయినప్పటికీ, తత్కాలీన సామాజిక వాస్తవికతను చిత్రించటానికి ప్రాధాన్యమిచ్చాం దొస్తొయేవ్‌స్కీ. రాస్కల్నికోవ్ కుటుంబ పరిస్థితులు, అతని మిత్రుడు రజూమిహిన్ వ్యవహారాలు, సోన్యా, ఆమె బంధువుల దీన గాథ, పోలీస్ శాఖలో ఉన్న అవినీతి, వాళ్లు ప్రదర్శించే అధికార దర్పం-

కోనో' 1859లో, 'ది హౌజ్ ఆఫ్ ది డెడ్' 1862లో వెలువడ్డాయి. మళ్లీ పాఠకాదరణ లభించింది. ఆర్థికంగా కూడా పరిస్థితి కొంత మెరుగు పడింది. పశ్చిమ యూరోపులో పర్య టించి రష్యా వెలుపలి ప్రపంచాన్ని అర్థం చేసుకోవటానికి కృషి చేశాడు. అక్కడి జీవిత పద్ధతులూ, 'దిగజారిన' నైతిక విలువలు, తక్షణ సుఖాల కోసం అన్వేషణ దొస్తొయేవ్ స్కీకి వెగటు పుట్టించింది. అయితే ఆ సాహి త్యాన్ని మాత్రం కూలంకషంగా అధ్యయనం చేశాడు. సాంప్రదాయిక (ఆర్థొడాక్స్) క్రైస్తవం మాత్రమే రష్యాను పునరుజ్జీవింప చెయ్యగల దన్న నిర్ధారణకు వచ్చాడు.

పాశ్చాత్య రచయితలందర్లోకీ, దొస్తొయేవ్ స్కీని బాగా ప్రభావితం చేసిన వాడు డికెన్స్. ఈయన సృష్టించిన పాత్రల్ని ఆధారంగా చేసుకుని దొస్తొయేవ్స్కీ రష్యన్ సాహి త్యంలో అజరామరమైన అనేక పాత్రలకు రూపకల్పన చేశాడు. ఉదాహరణకు క్రైం అండ్ పనిష్ మెంట్ (నేరము- శిక్ష)లోని మార్మెలాడోవ్‌కు మూలం మికాబర్ (డేవిడ్ కాపర్ ఫీల్డ్ నవలలోని పాత్ర). నిరంతరం అప్పుల్లో ఉండే మికాబర్‌లో దొస్తొయేవ్స్కీ తనను తాను చూసుకున్నాడు. ఆయన భార్య అన్నా గ్రిగొరెన్నా కూడా తనను "మిసెస్ మికాబర్" అంటూ ఉత్తరాల్లో రాసుకుంది.

ముఖ్యంగా అక్కడ పని చేస్తున్న చీఫ్ క్లర్క్ అలెగ్జాండర్ జెమెటోవ్, చీఫ్ ఆఫ్ పోలీస్ ఫోమిచ్ నికోడిమ్, అతడి అసిస్టెంట్ ఇల్యా పెట్రోవిచ్‌ల గురించిన కథనాలు- రాస్కల్నికోవ్ సోదరి మీద కన్నేసిన మరో యువకుడు వగైరా అనేక పాత్రల ద్వారా పందొమ్మిదవ శతాబ్ది రష్యన్ సమాజంలోని మధ్య తరగతి, దిగువ వర్గాల జీవితాన్ని కళ్ళకుకట్టినట్టు చిత్రించాడు దొస్తొయేవ్స్కీ.

రాస్కల్నికోవ్ హత్య చేసినమాట నిజమే. కాని ఈ సంక్లిష్ట సామాజిక సంబంధాలలో అతని పాత్ర ఏమిటి? ఒకరి చర్యల ప్రభావం మరొకరి మీద ఎలా పడుతుంది? పరిణామాలేమిటి? హత్య తర్వాత ఆయా వ్యక్తుల జీవితాల్లో వచ్చిన మార్పులేమిటి? ముఖ్యంగా పరిస్థితుల ప్రోద్బలం లాంటి విషయాలను గురించి దొస్తొయేవ్స్కీ ఇందులో విస్తృతంగా చర్చించారు.

'నేర ప్రవృత్తి' గురించి పాఠకుల్ని ఇంతగా ఆలోచింపచేసే నవల మరొకటి లేదు. మంచి చెడుల మధ్య సరిహద్దు గీత చెరిగిన సందర్భాలనేకం ఇందులో ఉంటాయి.

అత్యంత హేయమైన వృత్తిలో ఉన్న సోన్యా అత్యంత ఉదాత్తమైన పాత్ర. సమాజంలోని గౌరవప్రదమైన వ్యక్తిగా చెలామణీ అవుతున్న వ్యక్తి రాస్కల్నికోవ్ సోదరిని వంచిస్తాడు. అది నీచపాత్ర. ముసుగులు కప్పుకున్న వ్యక్తుల నిజ స్వరూపాన్ని బహిర్గతం చేస్తాడు రచయిత.

ఆత్మ పరిశుద్ధికి 'కన్ ఫెషన్' తప్ప గత్యంతరం లేదని దొస్తొయేవ్స్కీ విశ్వసించాడు. ఇదే ఇతివృత్తంతో అనేక సంవత్సరాలుగా అనేక రచనలు ప్లాను చేసుకున్నాడు. సైబీరియా శిక్షకు ముందే 'ది డబుల్', 'నెటోచ్కా నెజ్వానోవా' అనే కథలు కూడా రాశాడు. నగరాల్లోని పతితులు, భ్రష్టుల గురించి 'ది డ్రంక్స్' నవల రాయాలనుకున్నాడు. చివరకు అదే రూపు మార్చుకుని 'క్రైం అండ్ పనిష్‌మెంట్'గా వెలుగు చూసింది.

జైల్లో, హత్యానేరానికి శిక్ష అనుభవిస్తున్న మరొక నేరస్థుడితో దొస్తొయేవ్స్కీకి పరిచయం ఏర్పడుతుంది. అతడి పశ్చాత్తాప భావన ప్రభావితం చేస్తుంది. ఇలాంటి నవల ఒకటి రాయాలనుకున్నాడప్పుడే.

–ఎం. వసంత ✦



"ఎందుకమ్మా మీ బతుకులు!
ఏ చలనం లేకుండా, ఏ చైతన్యమూ
లేకుండా అడవిలో మానుల్లా నికృష్టంగా
బతుకుతున్నారు. తిరగబడండి. మనం ఒక్కటైతే
ఈ దగుల్బాజీలేమీ చేయలేరు. ఈ దురాచారాన్ని
మట్టుబెట్టండి" అంటూ ప్రోత్సహించిన ఆమె,
తనకు పట్టిన దుస్థితి తన కూతురికి పట్టకుండా
జాగ్రత్తపడింది. పెళ్ళికీ, పిల్లాపాపలకూ నోచుకోకుండా,
కుటుంబ జీవనానికి దూరమై నికృష్టంగా గడిపే జాతికి
మూఢాచారాల నుండి, స్వార్థపరుల ఉక్కు పిడికిళ్ళ
నుంచి విముక్తి కలిగించిన వైనాన్ని వర్ణించిన
వి.ఆర్. రాసాని నవల **ముద్ర**
ఈ నెల 'చతుర' సమర్పణ.

అది ధనుర్మాసం!

ఆకాశం... భూమిపైకి, ధనుర్మాసపు ధనుస్సుతో మంచు శరాలను నిర్విరామంగా సంధిస్తున్నట్లు, అది కప్పుకున్న తెల్లటి పట్టు పరదా ఏదో జారిపోయి భూమి పైకి వేలాడు తున్నట్లు...

ఒకటే మంచు!

కప్పుకున్న తెల్ల దుప్పటిని కాస్త తొలగించి, తొంగి చూస్తున్నట్లు... అరకొరగా కనిపిస్తున్న చెట్లు చేమలు... అక్కడి నేల, రైల్వే పట్టాలు, పల్లెలకు వెళ్ళేదార్లు అన్నీ ఆ మంచుకు ముద్ద గా తడిసి చెమ్మగా ఉన్నాయి.

పులిచెర్ల నుంచీ మంగళంపేట వైపుకు వెళు తున్న రైలు రోడ్డు, దాన్ని క్రాస్ చేసి కమ్మపల్లె వైపు వెళుతున్న మట్టిరోడ్డు, రైల్వేగేటు, గరం డాలు, వాటికవతలున్న రెక్కమాను, దానికి కూతవేటు దూరంలో ఉన్న వంకమద్దివారి పల్లె, దానికి దక్షిణంగా ఉన్న బచ్చునకుంట. ఆ కుంటకవతల కమ్మపల్లె, జాంద్రపేట, తురక బండ, రైలుపట్టాలకు ఉత్తరం వైపున్న చిచ్చు లవారి పల్లె, దానికి తూర్పుగా ఉన్న ముస లయ్య పొలాలు. ఆ పొలాల మధ్య నున్న బాగిమాను, కానగచెట్లు, వాటికి కనుచూపు మేరలో కనిపించే చిన్నగుట్ట, పెద్దగుట్ట... అన్నీ ముద్దగా మంచులో తడుస్తున్నాయి.

అర్ధరాత్రి మీరిన తర్వాత పాకాల నుంచీ ధర్మవరం వెళ్ళే దొంగల బండి ప్యాసింజర్ ముఖానికి డూమ్ లైటు తగిలించుకుని, మంచు గుండెల్ని చీల్చుకుంటూ వేగంగా మంగళంపేట నుంచీ పీలేరు వైపుకు కూత వేసుకుంటూ దూసుకుపోతోంది.

పులిచెర్ల స్టేషన్ నుంచి బయలుదేరే కాలి బాట ఉత్తర దక్షిణంగా వ్యాపించి ఉన్న ఆ ఊరి ప్రధాన వీధిలో కలుస్తోంది. ఆ వీధి కిరువైపులా ఉన్న అగ్రవర్ణీకుల ఇండ్లు, ఆ వీధికి దిగువన బలిజ, కంసాలి, మంగలి వాళ్ళున్న ఎగవీధి, దానికి ఇంకా దిగువున విసిరేసినట్లున్న దళితవాడగా పిలువబడే పల్లె అన్నీ మంచు స్నానం చేస్తున్నాయి.

ఆ పల్లెకు చేరుతున్న కాలిబాట పక్కన జనావాసాలకు కాస్త దూరంగా ఏ ఆలనా పాలనా లేని అనాథ పిల్లలా ఒంటరిగా ఉన్న బసిలి దాని గుడిసెనూ మంచు ముంచెత్తు తోంది.

అక్కడ... మంచుతో పోటీ పడుతూ దిగం తాల వరకూ వ్యాపించి ఉన్న చీకటి.

ఆ చీకటితో సయ్యాటలాడుతూ కురుస్తున్న మంచు. బారెడు దూరంలో ఏముందో కూడా కనిపించనంత మంచు.

ఎక్కడ 'ఏ అలికిడీ లేదు!'

అలాంటి నీరవనిశీధిలో, నిశ్శబ్ద వాతావర ణంలో...

బసివిదాని గుడిసె తలుపు చప్పుడయింది.

గుడిసెలో తుంగ చాపపైన నిదురిస్తున్న ముసలి ఓబులవ్వ బద్ధకంగా వళ్ళు విరుచు కుంది. కళ్ళు తెరచింది. కాటుక కొండలు మొలిచినట్లు ఒకటే చీకటి...

తలుపు చప్పుడవుతూనే వుంది.

'ఈ తలుపు కొట్టేవాళ్ళు కూడా ఉంటారా? అందులో ఈ అపరాతిరి' అనుకుంటూ వణు కుతున్న కంఠంతో "ఎవరదీ? " అంది.

సమాధానం లేదు!

కానీ ఎవరో అవిరామంగా తలుపు తడు తూనే వున్నారు.

"ఎవ్వరైవుంటారబ్బా? దొంగలా? "

ఒక్కక్షణం అనుమానపడ్డది.

ఆ వెంటనే "అయినా ఈ అడక్కుతినే దాని దెగ్గిర ఏమి ఉంటుందని వస్తార్లే... ముందే కాటికి కాళ్ళు చాచుకొని ఉండేదాన్ని..." అను కుంటూ నిస్సత్తువతో లేవలేక లేవలేక లేచి కూచుంది. పక్కనే ఉన్న ఊత కర్రను చేతబ ట్టుకుంది. వెతుకుతూ వెళ్ళి, అడ్డుగోడపైన ఉన్న అగ్గిపెట్టెను వెతికి చేతిలోకి తీసుకుని అగ్గిపుల్ల గీసింది. అటూఇటూ చూసి పొయ్యి గడ్డపైనున్న కిరసనాయలు బుడ్డీ వెలిగిం చింది. అగ్గిలో కాల్చి మెరుగుపెట్టిన నగలా ఆ వెలుగులో మిలామిలామెరిసి పోసాగింది గుడిసె.

ఇంకా చప్పుడవుతూనే ఉంది.

ఊతకర్రను ఊత పొడుచుకుంటూ, దగ్గుకుంటూ మెల్లగా వెళ్ళి తలుపుకు, అడ్డుగోడకు ఆనించి ఉన్న బడరోకల్ని తీసింది. అడ్డుతొలగగానే తలుపు కిర్రున తెరుచుకుంది.

ఓ చల్లటి మంచు తెమ్మెర రివ్వున గుడిసెలోకి దూరి, ముసలిదాని శరీరం జివ్వుమంది. ఆ గాలికి బుడ్డీదీపం రెపరెపలాడింది. ఆ పిల్ల తెమ్మరతో బాటు ఎర్రటి చీరలో ఉన్న ఓ స్త్రీ లోపలికి అడుగు పెట్టింది. ఆ పెట్నావే... ఏం గావాల తల్లీ" మళ్ళీ అడిగింది.

అయినా సమాధానం లేదు.

పైటను తలనిండా కప్పుకొని వచ్చి ఉండడం వల్లా, ఆమె చీరతోబాటు పైటా మంచు లో తడిసి తేమ వోడుతోంది. ఆమె చలికి వణుకుతోంది. ఆమె పరిస్థితిని చూసి, మెల్లగా తలుపు తోసి బడరోకలి అడ్డుపెట్టి వచ్చింది ఓబులవ్వ. గుడిసెలో కాస్త వెచ్చగా ఉండడంతో ఆగంతకురాలు ముసుగు తీసి

## రచయిత పరిచయం

వి.ఆర్. రాసాని చిత్తూరు జిల్లాలోని ఓ కుగ్రామంలో జన్మించారు. ఎం.ఎ. పిహెచ్.డి. చేసిన ఆయన తిరుపతిలోని ఎస్వీ ఆర్ట్స్ డిగ్రీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. నాటికలు, నాటకాలు, పరిశోధనా గ్రంథాలు తొమ్మిదిదాకా ప్రచురించారు. వందకు పైగా కథలు వివిధ పత్రికలలో ప్రచురితమయ్యాయి. నాలుగు నవలలు, ఒక కథా సంపుటి ప్రచురితం కాగా మరికొన్ని అముద్రిత రచనలూ ఉన్నాయి. ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి తదితర పత్రికలలో కాలమ్స్ రాశారు. ఆయన నాటికలు, కథలు కొన్ని కడప, తిరుపతి ఆకాశవాణి కేంద్రాల నుంచి ప్రసారమయ్యాయి. రచయితగానే కాక రంగస్థల నటుడిగా కూడా మంచి గుర్తింపు పొందిన రాసాని ఉత్తమ నటుడు, ఉత్తమ విలన్, ఉత్తమ హాస్యనటుడిగా పలుమార్లు అవార్డులు అందుకున్నారు. వివిధ పత్రికలు నిర్వహించిన కథల పోటీల్లో ఎనిమిదిసార్లు బహుమతులు గెలుచుకున్నారు. 'చతుర' 1994లో నిర్వహించిన నవలల పోటీలో 'మట్టి బతుకులు' నవలకు ప్రోత్సాహక బహుమతి లభించింది. బతుకాట నవలకు తానా బహుమతి పొందారు. కేంద్ర సాహిత్య అకాడెమీ అరుదుగా ఇచ్చే 'ఆథర్స్ టూర్ గ్రాంట్'కు 2003లో ఎంపికయ్యారు. 2004లో రాష్ట్ర అధికార భాషా పురస్కారం లభించింది. 1996లో 'చీకటి రాజ్యం' నవలకు కుప్పం రెడ్డమ్మ సాహితీ పురస్కారం, 'మెరవణి' కథల సంపుటికి 2006లో విమలా శాంతి ప్రతిష్ఠాత్మక పురస్కారం లభించాయి.

చిరునామా:
డా॥ వి.ఆర్. రాసాని
5th, బి. బాలాజీ రెసిడెన్సీ,
మునిరెడ్డినగర్,
తిరుపతి-వెస్ట్-517 502.

ముఖాన్నెప్పుడూ అవ్వ చూసి ఎరుగదు. ఆశ్చర్యంగా ఆమెవైపు చూసింది.

"ఎవరమ్మా నువ్వా? " అంటూ ముగ్గుబుట్టలాంటి తల వెంట్రుకల్ని ఒక చేత్తో వెనక్కి తోసుకుంటూ, తన ముసలి కళ్ళతో చికిలించి చూస్తూ అడిగింది ఓబులవ్వ.

ఆ ఆగంతకురాలు ఏ సమాధానమూ చెప్పలేదు.

"ఈ అపరాత్రి ఈ గుడిసెలోకి అడుగు ఒక్కసారి గుడిసెను పరిశీలనగా చూసింది. గుడిసెలో పెద్దగా ఏ వస్తువులూ లేవు.

ఉన్న వాటిని చూసి ఆ స్త్రీ ఓ నిట్టూర్పు విడిచి ఓబులవ్వ వైపు చూసింది. చిరిగిపోయి ఉన్న పాత చీరలో ముడతలు పడ్డ నల్లటి శరీరం, రాగిదుద్దుల బరువుతో సాగిపోయి వేలాడుతున్న చెవులు, తలనిండా చింపిరి చింపిరిగా గచ్చపొదలా ఉన్న తెల్లటి వెంట్రుకలు, కాస్తా వంగి, ఎముకల గూడులా



కనిపిస్తున్న శరీరం, చేతిలో ఊతకర్ర.

తనవైపే చూస్తున్న ఆ స్త్రీని పరిశీలనగా చూస్తూ, నేలపైనున్న తన తుంగ చాపపైన కూర్చుని, ఆమెనూ కూర్చోమంది ఓబులవ్వ.

ఆమె మౌనంగా అవ్వకెదురుగా కూర్చుంది.

ఏపుగా పెరిగి రింగు రింగులుగా కనిపిస్తున్న జుట్టు, బొట్టు లేకుండానే ఎంతో ఆకర్షణీయంగా కనిపిస్తున్న ముఖం, ముక్కున ఎర్రటి రాతితో మెరుస్తున్న ముక్కు పుడక, చెవులకు రాళ్ళ జుమికీలు, మెడలో ఖరీదయిన రెండు బంగారు గొలుసులు, కుడిచేతి వేళ్ళకు రెండు ఉంగరాలు, ఆ చేతినిండా పచ్చటి మట్టి గాజులు, వాటికి చివరా రెండు బంగారు గాజులు, ఎడమచేతికి ఓ వాచీ, చిటికెన వేలికి ఓ వంకీ ఉంగరం, అద్దాల రవికె, తెల్లటి శరీరం, నడివయసు దాటుతున్న వయసు, చేతిలో ఖరీదయిన ఓ తోలు సంచీ... ఎంతో అందంగా, నునుపుగా కనిపిస్తున్న విగ్రహం. కానీ ఆమె ముఖంలో ఏదో ఆతురత, దిగులు, నిర్వేదం, నిస్పృహ ఒక్కసారి తళుక్కున మెరిసి మాయమైపోయిన భావన...

"చూస్తే చదువుకున్న దానిలాగాను, స్థితిమంతురాలిగాను అనిపిస్తుంది. అలాంటిది ఈ సంకురేతిరి చలిలో ఈ గుడిసెలో కెందు కొచ్చినట్టు? " తీవ్రంగా ఆలోచించసాగింది ఓబులవ్వ. ఈ సంఘటనను ఆమె నమ్మలేక పోతోంది. ఏదో కలలో జరుగుతున్నట్లనిపిస్తోంది.

వచ్చిన స్త్రీ ఒక్కసారి పైకి చూసింది.

బాగా పాతబడిపోయి నల్లగా దూదర గూళ్ళతో, కప్పు అక్కడక్కడా జారిపోయినట్లు కనిపిస్తోంది. గోడలనిండా కర్దవ.

చూరు సందులో నుంచి చల్లగాలి సన్నగా గుడిసెలోకి వస్తోంది. ఆ స్త్రీ పైట తీసి భుజాల నిండా బిగదీసుకుంది.

ఇక మౌనాన్ని భరించలేకపోయింది ఓబులవ్వ.

"ఏం. తల్లీ, ఇంకనైనా చెప్పు.ఎవరు నువ్వు? ఈ గుడిసెకు ఎవ్వరూ రారే. అసలు నీలాంటి ఆడోళ్ళు రాకూడదే. మరి ఎందుకొచ్చినట్లు? " అడిగింది.

"అవ్వా. ఆ వివరాలేవీ నన్ను అడగొద్దు" అంది ఆ స్త్రీ.

"సరే అడగనులే, నీ పేరన్నా చెప్పు? "

"హసీనా" నిర్లిప్తంగానే చెప్పింది.

"ఓహో సాయిబులమ్మివా. ఇంతకీ ఏం పని మీదొచ్చినావు? "

అడగనులే అంటూనే మళ్ళీ అడిగింది అవ్వ.

"అవ్వా నేనొక మాట చెబుతా వింటావా? " అవ్వ ప్రశ్నల్ని పట్టించుకోకుండానే అడిగింది.

"చెప్పమ్మా" ఆసక్తిగా ముఖం పెట్టింది అవ్వ.

"నేను కొన్ని రోజులు రాత్రిపూట వచ్చి ఇక్కడ తలదాచుకుంటాను. నీకేమీ యిబ్బంది లేకుండానే తెల్లారి లేచి పోతుంటాను. ఈ విషయం ఎవరికీ చెప్పకూడదు" అర్థింపుగా అంది హసీనా.

ఒక్కక్షణం అనుమానంగా చూసింది ఓబులవ్వ

"నీకేం భయంలేదు. నేనేమీ కానిపని చేసి ఇక్కడికి రాలేదు. చాలా ముఖ్యమైన పనిమీదనే వచ్చాను. ఆ విషయం నీకు నిదానంగా చెప్తాను. నీ రుణం ఉంచుకోనులే" అని చేతిలో వున్న బ్యాగు జిప్పు తీసి ఓ కరెన్సీ నోటు తీసి ఆమె చేతిలో పెట్టింది.

ఓబులవ్వ మరోసారి ఆశ్చర్యపోయింది.

అంత పెద్ద నోటును తన జీవితంలో ఎప్పుడూ చూడలేదు. అదే మొదటిసారిగా చూడడం. అది ఎంతయింది కూడా ఓబులవ్వకు తెలీడంలేదు.

"ఎంతమ్మా యిదీ? " నోటును రెండు చేతులతో అపురూపంగా పట్టుకొని చూస్తూ అడిగింది ఓబులవ్వ.

"వంద" అంది హసీనా.

"అడక్క తినేదాన్ని. ఇది నాకెందుకమ్మా? "

"ఉంచవ్వా. ఎప్పుడైనా పనికి వస్తుంది"

ఆ నోటుని నాలుగు మడతలు వేసి, పైట కొంగు కొసలో ముడివేసుకుంది ఓబులవ్వ. అది చూసి హసీనా మెల్లగా నవ్వుకుంది.

"పండుకుంటావా తల్లీ. అయినా ఈ గుడిసెలో ఏముంది తల్లీ పడుకోవడానికి"

"ఫరవాలేదు లేవ్వా. కావాల్సినవి రేపు తీసుకొస్తాను. నీళ్ళున్నాయా? " అడిగింది హసీనా.

"ఆ పొయ్యి గడ్డపైన కుండలో వుండాయి సూడు" అంది అవ్వ.

బ్యాగులో నుంచీ ఒక మాత్రను తీసి, చేతిలో పెట్టుకొని వెళ్ళి, అక్కడే ఉన్న గ్లాసుతో కడవలో నీళ్ళు ముంచుకొని నోట్లో పోసుకుని మాత్రను మింగి వచ్చి మళ్ళీ కూర్చుంది హసీనా.

అవ్వ బుడ్డీ ఆర్పింది.

మళ్ళీ ఆ గుడిసె చీకటి సముద్రంలో కలిసిపోయింది.

* * *

ఆ మరునాటి పగలు ఊరంతా తిరిగి అడుక్కున్న అన్నంతో కడుపు నింపుకుని వచ్చి గుడిసెలో పడుకుంది ఓబులవ్వ. రాత్రి పది కొండు దాటింది. చలిపులి శబ్దం చేయకుండానే శరీరాలను నమిలేస్తోంది. క్రమంగా మంచు ప్రారంభమైంది.

దూరంగా ఒక గుడ్లగూబ ఉండుండి గూక్ గూక్ అంటోంది. ఒక తీతువుపిట్ట ఆకాశంలో ఎగురుతూ ఉత్తీత ఉత్తీత అంటూ గుడిసె మీదుగా అరచుకుంటూ వెళుతోంది. చూరులో నుంచి ఇంట్లోకి జొరబడ్డ ఒక గబ్బిలం ఇల్లంతా గిరికీలు కొడుతూ తిరుగుతోంది.

ఓబులవ్వ యింకా నిద్ర పోవడం లేదు. నిన్నటి రాత్రి హసీనా యిచ్చిన వంద రూపాయల నోటుని చేత బట్టుకుని దాన్నే చూసుకుంటూ, మురిసిపోతూ నిద్రపోవడం కూడా మరచిపోయింది. మాటిమాటికీ దాన్ని ముద్దు పెట్టుకుంటోంది. గుండెలకు హత్తుకుంటోంది. కళ్ళకేసి అద్దుకుంటుంది. రెండు చేతుల మధ్య పెట్టుకుని రుద్దుకుంటోంది. ఇలా ఒకసారి కాదు,రెండుసార్లు కాదు, ఎన్నోసార్లు చేసింది. యింకా అలాగే చేస్తోంది.

తన జీవితంలో ఎన్నడూ చూసి ఎరుగని నోటు, తనకు దక్కిన ఆనందంలో లోకాన్నే మరచిపోయి కూర్చొని వుంది. అలా కూర్చుని కూర్చొని అలసిపోయిన ఓబులవ్వ పడుకుందామని అనుకుంటున్న

సమయంలో తలుపు మీద శబ్దమైంది.

"హసీనాయే అయి ఉంటుంది. నన్ను నూర్రూపాయల భాగ్యశాలినిగా చేసిన హసీనా. నా బంగారు హసీనా. నా పాలి దేవత. ఆ హసీనానే అయి ఉంటుంది. రోజూ వస్తానంది కదా" అని మనసులోనే అనుకుని, నోటుని మడచి పైట కొంగులో బిగించింది.

మెల్లగా లేచి వెళ్ళి తలుపు తీసింది.

ఈసారి మంకీ క్యాప్, స్వెటర్‌తో ఇంట్లోకి అడుగు పెట్టిన హసీనా నవ్వుతూ లోపలికి వచ్చింది. ఓబులవ్వ తలుపు తీసి గెడ పెట్టింది. హసీనా ఈసారి వట్టి చేతుల్తో రాలేదు. ఒక చేతిలో ప్లాస్టిక్ చాప, మరో చేతిలో బ్యాగు...

ఈ రెండింటినీ నట్టింట్లో పెట్టి, "ఏమవ్వా! నా కోసమే చూస్తున్నావా? "అని అడిగి తనూ అక్కడే కూర్చుని బ్యాగు జిప్పు తీసింది.

"లేదమ్మా నీ కోసం కాదు. నిద్ర రాలేదు. అంతే" అని ఆమెవైపే చూస్తూ తన తుంగ చాప పైన కూర్చుంది అవ్వ.

హసీనా బ్యాగులో నుంచీ ఓ పాత జంప ఖానా తీసి అవ్వకిచ్చింది. అవ్వకిది రెండో వరంగా మురిసిపోయింది. ఆరాధనగా హసీనా కళ్ళలోకి చూసింది.

"నీ జంపఖానా చినిగిపోయింది కదా. కప్పుకో..." అని మరో బెడ్‌షీట్ తీసి తన భుజాన వేసుకుంది. జిప్ మూసి, బ్యాగును పక్కన పెట్టి, చాప పరచుకుని దానిపైన కూర్చుని గోడ కానుకుంది హసీనా.

బుడ్డీ దీపం నిశ్చలంగా వెలుగుతూనే ఉంది.

"ఇంత రేత్తిరి దాకా బుడ్డీ పెట్టుకుంటే కిరస నాయిలైపోదా" అంది హసీనా.

"అయిపోతుంది. ఏం చెయ్యను? నిద్దర రాలేదే..." అంది అవ్వ.

"అడుక్కు తింటున్నానంటావు కదా. కిరసనా యలకు డబ్బు లెట్లొస్తాయి? "

"ఎవరింట్లోనన్నా అడిగి తిరిపెం తీసు కుంటా. అప్పుడప్పుడూ ఆ సెట్టిగాడి అంగడి కాడికి బుడ్డీ ఎత్తకపోతే ఆయప్ప దాని నిండా గబ్బునూనె పోసిస్తాడు... వాడప్పుడూ గబ్బుగా తిడతాడు. రేపట్నుంచి లేదంటాడు. అయినా నేనొదిలి పెట్టనుగదా"

బోసి నోటితో నవ్వుతూ చెప్పింది ఓబు లవ్వ.

"రేపట్నుంచి నీకు నేను డబ్బులిస్తాలే. డబ్బులకే పోయించుకో" అంది హసీనా...



## ఆదిభట్ల వారి చతుర వ్యాఖ్యలు

సంగీత సాహిత్యాలలో మేరుశిఖర సమానుడు, హరికథా పితామహుడైన ఆదిభట్ల నారాయణదాసు సరస సంభాషణా చతురుడు. సమయస్ఫూర్తిగా మాట్లాడి ప్రత్యర్థుల ఆటకట్టించడంలో మహాఘటికుడు.. ఆయన సాగించిన స'రస'వంతమైన వ్యాఖ్యలలో మచ్చుకు కొన్ని ఈ నెల 'చతుర' పాఠకులకు ప్రత్యేకం..

### ఉరుములేని పిడుగు

నెరజాణలకు ప్రసిద్ధి చెందిన నెల్లూరి పట్టణ వీధుల్లో ఓ పర్యాయం ఆదిభట్ల వారు నడుస్తున్నారు. అంతలో హఠాత్తుగా పక్కనే మిద్దెపైనున్న ఓ గడుసుపడుచు ఆయనపై చెంబెడు నీళ్లు గుమ్మరించింది. ఆయన తెల్లబోయి పైకి చూస్తే-

'మబ్బులేని వాన' అంటూ కిలకిలా నవ్వింది.

వెంటనే దాసుగారు మిద్దెపైకి వెళ్లి ఆమె వీపుపై ఓ పిడి గుద్దు గుద్ది, 'ఇది ఉరుములేని పిడుగు' అని నవ్వుతూ మిద్దె దిగొచ్చారు.



ఆవేళ హసీనా నుంచి అవ్వకు దక్కిన మూడో వరం అది.

ఓబులవ్వ కళ్ళు సంతోషంతో వెలిగిపోయాయి.

"ఇది ఏనాటి రుణం తల్లీ. ఇంతకీ నీకూ నాకూ ఏమి సంబంధం? " నిలువెల్లా కృతజ్ఞతా భావంలో కరిగిపోతూ అడిగింది అవ్వ.

"ఏదో సంబంధం ఉండే ఉంటుందిలే అవ్వా. యింక పడుకుందామా"

తనే లేచి వెళ్ళి బుడ్డీ ఆర్పి వచ్చి పడుకుంది హసీనా.

కట్ట తెగిన చెరువులో నీళ్లలా చీకటి గుడిసెను ముంచెత్తేసింది.

కొన్ని క్షణాలు మౌనంగా గడచిపోయాయి.

గుడిసె వెలుపల చింతల తోపులో గుడ్లగూబ అరుస్తూనే ఉంది... గుడిసె పక్కగా ఓ పైడిగంట కీచు కీచు మంటోంది.

"అవ్వా. నిన్నో మాటడగనా? " అంది హసీనా.

"అడుగు తల్లీ" అంది అవ్వ.

"ఈ ఊళ్లో గుండెకాయ లాయన మనవరాలొకటుండాల్నే... అదెట్లా వుంది? " ఆ మాట వినగానే ఓబులవ్వ బుర్రలో ఆలోచనలు జొరబడ్డాయి.

'ఈ గుండెకాయలాయన హసీనాకు యెట్లతెలుసు. ఆయప్పకు వొగ మనవరాలున్నట్టుగా మొన్న మొన్న వరకూ నాకే తెలీదే... మరి ఈయమ్మకెట్ల తెలుసు. అసలు వాళ్ళకూ ఈయమ్మకూ ఏమి సంబంధం? "

అవ్వనుంచి వెంటనే సమాధానం రాకపోవడంతో "అవ్వా నిన్నే..." అంది.

"ఆc... ఆc... అదే ఆదెమ్మ మనవరాలు గదా..." ఆలోచనలలో నుంచీ తేరుకుంటూ అంది ఓబులవ్వ.

"ఆc ... అవును... అసలు ఆ ఆదెమ్మ యెట్లా ఉంది? "

హసీనా మాటల్లో ఆతృత ధ్వనించింది.

"బాగానే ఉందమ్మా"

"ఆమె మనవరాలంటినే. అదెట్లుంది? " మళ్లీ అడిగింది హసీనా.

"ఆయమ్మకేం తల్లీ. బంగారుబొమ్మ. తెల్లగా, అందంగా, తీర్చిన బొమ్మ మాదిరుంటుంది. నిజంగా చెప్పాలంటే అలాంటి బిడ్డె ఏ బ్యామ్మలిండ్లల్లోనో పుట్టాల్సింది. తప్పొయ్యి యీ మాదిగ కులంలో పుట్టేసింది. నేను దినొమ్మ అన్నానికి బోతాగదా... ఆయమ్మే నవ్వతా అంత కబళం యేస్తుంది తల్లీ. మంచి బిడ్డ"

అవ్వ చెబుతుంటే హసీనా ఆలోచనలు ఎక్కడికో పరిగెత్తాయి.

"ఇంతకీ వాళ్లు నీకెట్ల తెలుసమ్మా? " తిరిగి అడిగింది అవ్వ.

"ఆc ... తెలుసంటే... తెలీదు... ఊరికే అడిగినానంతే..." అంటూ సర్దుకుని తిరిగి ఆలోచన్లలో పడి పోయింది హసీనా.

## 2

కమ్మపల్లె ఎలిమెంటరీ స్కూలు ప్రశాంతంగా ఉంది. ముచ్చటగా ముగ్గురు ఉపాధ్యాయులు పని చేస్తున్న ముచ్చటయిన స్కూలది. బడి ముందరున్న మునగ చెట్టు కొమ్మకు వేలాడదీసిన 'బెల్' గాలికి మెల్లగా ఊగుతోంది. దానికవతల మూడు గదులున్న పెంకుటిల్లే పాఠశాల. ఆ పాఠశాలలో ఓ మూలన చిన్న గదిలో ప్రధానోపాధ్యాయుడు పాపిరెడ్డి బూటు కాళ్ళు టేబుల్ పైన పెట్టి, కుర్చీలోనే చతికిలబడి నిద్ర పోతున్నాడు. రాత్రంతా ఫ్రెండ్స్‌తో పేకాటాడి వచ్చి పగలు అలా కుర్చీలో నిద్ర పోవడం అతని దిన చర్యలో ఒక భాగం.

దానికింకో వైపునున్న హాలులో సీనియర్ ఉపాధ్యాయుడు అప్పాస్వామి పిళ్ళె బెత్తం చేతబట్టుకుని, నాలుగు అయిదు క్లాసు పిల్లలకు సిన్సియర్‌గా పాఠం చెబుతున్నాడు. దానికవతలున్న మరో గదిలో ఒకటి రెండు మూడు క్లాసు పిల్లల్ని కూర్చోబెట్టి ఏదో పాఠం చెబుతున్నాడు జూనియర్ ఉపాధ్యాయుడు ఉదయకుమార్. కొందరి చేత అక్షరాలు దిద్దిస్తున్నాడు. కొందరితో పాఠాలు రాయిస్తున్నాడు. మరి కొందరికి పాఠాలు వివరిస్తున్నాడు.

కొందరికి లెక్కలు, మరి కొందరికి సైన్సు, ఇంకొందరికి సోషల్, మరికొందరికి ఇంగ్లిష్ బోధిస్తూ ఒకేచోట ఒకేసారి అన్ని బాధ్యతలు ఒక్కడే నిర్వర్తిస్తూ బహు పాత్రాభినయం చేస్తూ బిజీగా ఉన్నాడు.

ఆ చుట్టుపక్కల అయిదారు పల్లెలకదే ఏకైక స్కూలు కావడంతో పిల్లల హాజరు బాగానే ఉంది. ఆ పిల్లల్లో చాలామంది చింపిరి తలలతో, మాసిన బట్టలు, చినిగిన చొక్కాలు వేసుకుని కనిపిస్తున్నారు. వాళ్లందరు రైతుల, రైతు కూలీల బిడ్డలు. కష్టజీవులు కన్న ఫలాలు. మరికొందరు చీమిడి కార్చుకుంటూ, ఆ చీమిడికి వాలుతున్న ఈగల్ని తోలుకుంటూ అసహ్యంగా కనిపిస్తున్నారు. వాళ్లంతా కూటికి లేనివాళ్ళ బిడ్డలు. కూలీ నాలీ చేసుకునే వాళ్ల కన్నబిడ్డలు.

ఆ స్కూలుని, పిల్లల్ని పరిశీలిస్తూ వెళ్లి ఆ గది ముందర నిలబడ్డాడు సూర్యప్రకాష్.

అతణ్ణి చూడగానే "సైలెంటుగా ఉండండ్రా" అంటూ పిల్లల్ని హెచ్చరించి, లీడర్ని లేపి "అరచిన వాళ్లను నిలబెట్టరా నేనొచ్చి వాళ్ళ సంగతి చూస్తాను" అని చెప్పి గది బయటకొచ్చాడు ఉదయకుమార్.

"ఏంరా ప్రకాష్. ఎలా ఉన్నావ్? వాటే సర్ప్రైజ్..." అంటూ పలకరించాడు.

"పట్నంలో కలిసి చదువుకున్న వాళ్లం. నువ్వు ఇక్కడ చేరి రెండేండ్లయినా నీ స్కూలుకు రాలేదంటే బాగుండదు కదా అని వస్తిని" అన్నాడు ప్రకాష్.

"ఇన్ని దినాలకైనా వచ్చినావ్. సంతోషం... పులిచెర్ల బజార్లో అప్పుడప్పుడు కనిపిస్తావు. స్కూలుకు రారా మాట్లాడుకుందాం అంటే రావు. సరే ఉండు. హెడ్మాష్టర్నడిగి పర్మిషన్ తీసుకొస్తాను. అలా వెళ్లి మాట్లాడుకుందాం" అంటూ హెడ్మాష్టర్‌కు నిద్రా భంగం కలిగించి పర్మిషన్ తీసుకొచ్చాడు ఉదయ్‌కుమార్.

ఇద్దరూ మాట్లాడుకుంటూ స్కూలు ఆవరణలోనే మరో మూల ఉన్న చింత చెట్టు కింద పరచి ఉన్న రాళ్ల తిన్నెపైన కూర్చున్నారు.

"ఆ! ... ఇంక చెప్పరా ప్రకాష్. ఇప్పుడేం చేస్తున్నావ్...? " అడిగాడు ఉదయకుమార్.

"మా నాయన చచ్చిపోయిన సంగతి తెలుసుకదా. ఆ బాధతోనే నిన్ను యిన్ని దినాలు కలవలా..."

ప్రకాష్ ముఖంలో కాస్తా విషాదం తొంగి చూసింది.

"సారీరా... కంట్రోల్ యువర్ సెల్ఫ్..." అని భుజం తట్టి "సరే నీ భవిష్యత్ కార్యాలేమిటి, ఏం చేయాలనుకుంటున్నావ్? " అడిగాడు కుమార్.

"మా నాయన పైన నాకేమీ సదభిప్రాయం లేదు. అంత మంచోడు కాదు"

"అయినా తండ్రి తండ్రే కదా"

"నాకేమో ఏ ఉద్యోగమూ రాలా. వస్తుందని ఆశ కూడా లేదు. ఇద్దరు చెల్లెండ్లు, వొక తమ్ముడు, అమ్మ. బాధ్యతలన్నీ నా నెత్తినే పడ్డాయి. బతికున్న రోజుల్లో మా నాయన నలుగురికి సాయం చేసుంటే ఇప్పుడు కనీసం మమ్మల్ని అయ్యో అనే వాళ్ళన్నా ఉండేవాళ్ళు. అందుకే ఏమీ దిక్కు తోచడం లేదు" బాధగా అన్నాడు ప్రకాష్.

"సరే. ఇప్పుడేం చేయాలనుకుంటున్నావ్? " మళ్లీ అడిగాడు.

"అదే అర్థం కాలేదు"

"పోనీ నేనో సలహా యివ్వనా? "

"చెప్పు"

"మీ నాన్న చేస్తున్న పనే నువ్వూ చెయ్యి"

"అదా. నావల్ల గాదురా"

"కాందేమిట్రా. నాలుగు మంత్రాలొస్తే చాలు. బ్రాహ్మలు ఎక్కడైనా బతికిపోగల్రు" అతని తొడపై చేయి చరచి మరీ అన్నాడు ఉదయకుమార్.

"మంత్రాలకేముంది. వస్తాయి గానీ నాకే యిచ్ఛగించడం లేదు"

"ఎందుకు? "

"ఎందుకేమిట్రా. మనం చదువుకునే రోజుల్లో అభ్యుదయమనీ, కమ్యూనిజమనీ

తెగ తిరిగితిమి గదా. ఇప్పుడు దానికి విరుద్ధంగా చేయటం యెట్లా!"

తటపటాయిస్తూ అన్నాడు ప్రకాష్.

"మా గురువు వొకాయన చెప్పేవాడు. వయసులో కమ్యూనిజం వైపు మొగ్గనివాడు, వృద్ధాప్యంలో భక్తుడు కానివాడు ఈ ఇండియాలో ఉండరట. అయినా నువ్వు గుడిలో పూజలు నిర్వహించినంత మాత్రాన నీ అభ్యుదయానికి వచ్చిన లోటేమీ లేదు... అర్చకత్వంలో చేరిపో..." హితబోధ చేశాడు కుమార్.

"ఆలోచించగా ఆలోచించగా అదే మేలనిపిస్తా ఉంది. వేరే దారి గూడా లేదు"

"కూడు పెట్టని ఆదర్శాల వల్ల ఏం ప్రయోజనం? సంపాదించుకోవడానికి వచ్చిన ప్రతి అవకాశాన్ని అందిపుచ్చుకోవడం తెలివైనవాడు చేసే పని. అట్లని నువ్వేమీ తప్పుడు పని చేయబోవటం లేదు కదా"

"సరే. నాతోబాటు నువ్వూ ఆ రోజుల్లో ఆదర్శాలు పలికినావు గదా"

"పలికాను. కానీ అవకాశమున్నప్పుడు ఆదర్శాల్ని వదులుకోవడం కూడా వివేకమే"

"నేను వేరే కులంలో పెండ్లి చేసుకుంటాను. చివరికి దళితులైనా ఫరవాలేదు అంటూ తెగ ఉపన్యాసాలిచ్చేస్తావుంటివి గదా. ఇప్పుడు నీ జీవితం స్థిరపడిందని వాటిని గాలి కొదిలేస్తావా? "

"ఎందుకొదిలేస్తాను.? తప్పకుండా ఆచరిస్తాను. అయినా నాకు నచ్చిన అమ్మాయి తగలాలి గదా"

"ప్రయత్నించకుండా తగలమంటే ఎలా తగుల్తుంది. ప్రయత్నించు"

"ప్రయత్నిస్తూనే ఉన్నానులే..."

"అసాధ్యుడవే... ప్రయత్నం ఫలించిందా...? "

"ఫలిస్తే నేనే చెప్తా కదా"

"సరే. నేనింక బయలు దేరనా..." అంటూ పైకి లేచాడు ప్రకాష్.

"నేను చెప్పింది గుర్తు పెట్టుకోరా"

"ఏదీ. పూజారి కొలువా..."

"అవును"

"రేపే సర్పంచి శంకరయ్యతో మాట్లాడి గుడి తెరిపిస్తాను"

"నేనింక పది రోజులు ఓ.డి. తీసుకొని హైదరాబాదు పోతున్నా. నీకు కనిపించను"

"ఎందుకు? "

"గవర్నమెంటు ఎయిడ్స్ గురించి టీచర్లకు అవగాహనా సదస్సు ఒకటి పెడతావుండారు. దాని కోసరం పోతావుండా"

సరేలే అన్నట్లు తలూపి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు ప్రకాష్.

క్లాసు వైపుకు కదిలాడు కుమార్.

వయసులో కమ్యూనిజం వైపు మొగ్గనివాడు, వృద్ధాప్యంలో భక్తుడు కానివాడు ఈ ఇండియాలో ఉండరట. అయినా నువ్వు గుడిలో పూజలు నిర్వహించినంత మాత్రాన నీ అభ్యుదయానికి వచ్చిన లోటేమీ లేదు...

ఆనాటి మధ్యాహ్నం...

చింతల తోపులో కాకులు గోల చేస్తున్నాయి. చెట్లపైన వాలుతూ కొన్ని, చెట్ల చుట్టూ గిరికీలు కొడుతూ కొన్ని, ఆకాశంలో ఎగురుతూ మరికొన్ని వందల సంఖ్యలో కావు కావుమంటూ అదేపనిగా అరుస్తున్నాయి.

పడమట ఆకాశం కావురేగింది.

ఆ చింత తోపు మధ్యలో ఓ పెద్దచింత చెట్టు తల విరబోసుకొని నిలబడ్డ బ్రహ్మరాకాసిలా కనిపిస్తోంది. దాని మొదల్లో రెండు వేర్లు భూమిలో నుంచీ పైకి లేచి పెద్ద కొండ చిలువల్లా కనిపిస్తున్నాయి. ఆ చింత వేర్లపైన ఎదురు బొదురుగా కూర్చొని వున్నారు ఉదయకుమార్, అరుణ.

"అరుణా! నేను ఉద్యోగంలో చేరిన కొత్తలో మొట్టమొదట ఇక్కడే కలుసుకున్నాం. గుర్తుందా? " ఆమె ముఖంలోకి చూస్తూ

అన్నాడు కుమార్.

ఆ మాటలో గతాన్ని తవ్వుకుంటూ కూర్చుంది అరుణ.

"సదూకున్నోళ్ళు ఊర్లోకొచ్చి ఏదో ఉపన్యాసం యిస్తారంట. అందరూ రచ్చబండ దగ్గరికి రండహో" అంటూ ఆరోజు దండోరా కొట్టించినారు.

రచ్చబండ మధ్యనున్న రావి చెట్టుకి పక్కింటిలో నుంచి కరెంటు వైరును లాగి లైటు వేశారు.

అన్నాలు తినేసి అందరూ అక్కడికి చేరుకున్నారు.

రచ్చబండపైన ఒక స్వచ్ఛంద సంస్థ నడుపుతున్న రెడ్డి మరో ఇద్దరు పట్నవాసులు కూర్చొని వున్నారు. ఆ యిద్దర్లో ఒకతను కాలేజీ లెక్చరర్ ఆ సంస్థలో పనిచేస్తున్న పాతికేళ్ళ ఉదయకుమార్.

కుమార్ ముందుగా పైకి లేచి ఆ సంస్థ ఆశయాలను, చేసే పనులను ఏకరువు పెట్టాడు.

"మా సంస్థ... సమాజంలోని దురాచారాలకు వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యవంతం చేస్తుంది. అంతే గాకుండా ఎయిడ్స్ వంటి మహమ్మారుల నుంచీ ప్రజలు ఎలా అప్రమత్తంగా ఉండాలో చెప్పి పల్లె ప్రజల్లో సెక్స్‌పరంగా అవగాహన కలిగిస్తుంది. కొత్తగా పరిచయమైన స్త్రీ పురుషులు కలిసేటప్పుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలు గురించి బోధిస్తుంది. ఇవి ఆ ఆశయాలు. ఈ పల్లెకే ఎందుకొచ్చామంటే ఈ దళితవాడలో మాతమ్మ ఆచారం ఉందని తెలిసింది. దానివల్ల ఆడవాళ్ళ జీవితాలు ఎలా నాశనమైపోతాయో తెలియజేసి, ఎయిడ్స్ వ్యాధి వ్యాప్తి గురించీ, దానివల్ల వాటిల్లే ప్రమాదాల గురించీ చెప్పి, మీరు మూఢ విశ్వాసాలను, దురాచారాలను మానుకునే విధంగా మిమ్మల్ని విజ్ఞానవంతుల్ని చేయడానికే మేం వచ్చాం" ఒక మోస్తరు ఉపన్యాసమే ఇచ్చాడు.

అలా ఆ రోజు మీటింగ్ అయిపోయిన తర్వాత కుమార్ ఆ సంస్థ తరఫున అప్పుడప్పుడూ ఊర్లోకి రావడం ప్రజల్లో ఉండే మూఢత్వం గురించీ, చదువుల ఆవశ్యకత గురించీ చెప్పిపోతూ అందరితోను కలివిడిగా వుంటూ, అందరికీ ఆత్మీయుడిగా మారిపోయాడు.

అలా వస్తూపోతున్న అతనికి అరుణతో పరిచయమైంది. చూపులు చూపులు కలిశాయి. మనసు మనసు కలిసింది. అదే ప్రణయంగా మారింది. అప్పుడప్పుడూ రహస్యంగా ఆ తోపులో కలుసుకుని ఒకరి బాధలు మరొకరు చెప్పుకోవడం అలవాటైపోయింది. ఆ తర్వాత చాలా రోజులకు కుమార్‌కు టీచరు ఉద్యోగం రావడం, ఆ ఊరూ ఈ ఊరూ తిరుగుతూ కమ్మపల్లె స్కూల్లోనే ఉపాధ్యాయుడిగా చేయడం వంటి కారణాలు వాళ్ళ ప్రేమకు యింకా దోహదం చేశాయి.

"అరుణా! ఏమిటి, ఆలోచన్లో పడిపోతివే" అన్నాడు కుమార్

"ఆఁ ఏంలేదు మన పరిచయం నుంచి జరిగిన విషయాలు గుర్తొస్తేనూ"... అంది ఇహంలోకొస్తూ అరుణ.

"సరే ఏమిటి విశేషాలు? " అడిగాడతడు.

"ఈరోజు మా ఊర్లో జాతర వారంగా ఆ ప్రయత్నంలో వున్నారు జనం. ఐతమ్మ గుడి దగ్గర దున్నపోతును నరకతారు. తరతరాల నుంచీ సంకురేతిరి మాసంలో జరిగే జాతర ఇది. సంకురేతిరి దినాల్లో మా ఊర్లో తప్ప యింకెక్కడా జాతర్లు జరగవు.

రేపు పల్లెపల్లే నీసు వాసనతోను, కల్లు ముంతలతోను గుమ్మెత్తిపోతుంది. ఇంక వారందాకా పల్లెలో మొగోళ్ళు బెల్లం చుట్టూ ఈగల మాదిరి మాతమ్మల చుట్టూ తిరగతారు. ఎందుకంటే ఈ రోజే మాకులంలో యాడుం డే మాతమ్మలూ ఊళ్లోకి దిగేస్తారు. కల్లు దాగి కన్నూ మిన్నూ గానకుండా చిందులేస్తారు. ఆ మాతమ్మల చిందు నువ్వు గనక జూసినావా యింక అంతే..." అంది అరుణ.

"నీకా భయమేమీ అక్కర్లేదు గానీ, ఒక

## జ్ఞాపకశక్తిని పెంచే 'జింకు'



"ఏమిటో... వీడికి బొత్తిగా జ్ఞాపకశక్తి ఉండటం లేదు" అనేది తరచూ అందరి ఇళ్ళలో విన్పించే మాట. ఎంత చదివినా మార్కులు తెచ్చుకోలేని సంతానాన్ని చూసి ఇలా అనుకుంటూ నిట్టూరుస్తుంటారు తల్లిదండ్రులు. సాధారణంగా పిల్లల్లో జ్ఞాపకశక్తి ఎక్కువగా, వృద్ధులలో తక్కువగా ఉంటుంది. కానీ పిల్లల్లోనే జ్ఞాపకశక్తి మందగిస్తే... 'జింకు' ఉపకరిస్తుందంటున్నారు అమెరికన్ శాస్త్రవేత్తలు. ఇన్నాళ్లూ 'జింకు'పై ఉన్న ఊహాగానాలు ఈ పరిశోధనలతో తేటతెల్లమయ్యాయి. 209 మంది ఏడో తరగతి విద్యార్థులకు శాస్త్రవేత్తలు జ్ఞాపకశక్తికి సంబంధించిన పరీక్షలు నిర్వహించారు. అందులో భాగంగా ఎప్పుడో చూసిన వస్తువుల్ని, దృశ్యాల్ని, సంఘటనల్ని గుర్తుకు తెచ్చుకోవటం వంటివి జత పరిచారు. అంతేకాక వారానికోసారి 20, 10, 0 మిల్లీగ్రాములు జింకు కలిపిన పళ్ల రసాలు వాళ్లతో 10 వారాల పాటు తాగించారు. వాళ్ళ జ్ఞాపకశక్తిని మళ్లీ పరీక్షించారు. 20 మి.గ్రా.ల జింకు తీసుకున్న వాళ్లు 12% జ్ఞాపక శక్తికి సంబంధించిన పరీక్షల్లో నెగ్గితే, '0' మి.గ్రా.ల జింకు తీసుకున్న వాళ్లు 6% మాత్రమే జ్ఞాపకశక్తి పరీక్షలో నెగ్గారు. దీనికి కారణం, శరీరంలో జింకు ప్రవేశించగానే మెదడుకి చేరి జ్ఞాపకశక్తికి సంబంధించిన ప్రదేశాన్ని ప్రేరణ కల్గించి జ్ఞాపకాన్ని వేగంగా అందిస్తుందని శాస్త్రవేత్త జేమ్స్ పెన్‌లాండ్ వివరించారు.

తొమ్మిదేళ్లు ఆ పైబడిన వాళ్లకి 8-11 మి.గ్రా. జింకు ఉండే పదార్థాలు అంటే మల్టీ విటమిన్లు, గింజ ధాన్యాలు, బీన్స్, చేపలు మొదలయినవి ఆహారంలో చేరిస్తే వాటిలో ఉండే జింకు జ్ఞాపకశక్తిని పెంచుతుంది.

జీవాన్ని నిట్టనిలువునా నరికేసి, అట్ట చిందులెయ్యకపోతే ఏం?" అన్నాడు కుమార్.

"అట్లంటే యెట్లా? ఏనాటి నుంచో వచ్చే జాతర గదా. ఇప్పుడు ఆపేస్తే గంగమ్మకు కోపం రాదా?" అమాయకంగా అంది.

"ప్రాణం లేని రాళ్ళకు కోపం కూడానా?"

"అట్లనొద్దు లేవయ్యా. అమ్మోరికి కోపం వస్తుంది"

"అది సరే. ఈ కాలంలో కూడా ఆ మాతమ్మాచారం ఏమిటీ? అన్యాయంగా ఆడోళ్ళ జీవితాలు నాశనమైపోతా వుండయి గదా. ఊరి పెద్దలకు ఆ మాత్రం తెలీదా!"

"ఏమో! అంతంత పెద్ద విషయాలు నాకేం తెలుసు?" అంటూ పైట చెరగును వేళ్ళతో నలుపుతూ బుంగమూతి పెట్టి మరీ అంది.

ఇంతలో రెండు కాకులు ఒకదాని మీద ఒకటి వచ్చి వాళ్ళ పక్కనుంచీ అరుచుకుంటూ వెళ్ళిపోయాయి. దాంతో వాళ్ళిద్దరి మధ్య కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

"ఇంక పోదామా?" మౌనాన్ని భగ్నం చేస్తూ అన్నాడతను.

"పొయ్యేముందు నాదొక చిన్నమాట"

"చెప్పు"

"నిజంగా నువ్వు నన్ను పెండ్లి చేసుకుంటావా?"

"నీకు డవుటా?"

"డౌటని కాదు. ఆడపిల్లని కదా"

"ఆరు నూరు గానీ, నూరు ఆరు గానీ... తప్పకుండా పెండ్లి చేసుకుంటాను" దృఢంగా అన్నాడు.

"మరి మీరు రైతులు... మేము"

"నాకలాంటివి లేవంటున్నాను గదా?" ఆమె మాట పూర్తి కాకుండానే అన్నాడు. అతని మాటల్లో చిరాకు కనిపించింది.

"మాయమ్మ సంగతి కూడా నీకు తెలుసు కదా" మెత్తగా అంది

ఆమె వాలకం చూసి అతని చిరాకు గాలి కెగిరిపోయింది.

వాళ్ళ మధ్యన మౌనం మరోసారి దూరిపోయింది.

ఆకాశంలో కాకుల గోల పలుచబడింది.

"నాకు మాత్రం ఎవరుండారనీ, నేను చిన్నప్పటి నుంచీ అనాథగానే పెరిగినాను. నా జీవితం నా ఇష్టం. నా సొంతం. నా పెళ్ళి కూడా నా ఇష్టమే. నిన్ను ఇష్టపడుతున్నాను. కులం పేరుతో, మీ అమ్మ పేరుతో నా ఇష్టాన్ని కాదనుకునే అంత మూర్ఖుణ్ణి కాదు" అనునయిస్తూ అన్నాడు ఉదయ్‌కుమార్.

"ఇప్పుడు నాకు సంతోషంగా వుండాది"

అతని భుజంపైన తల వాల్చింది.

"రేపు సాయంత్రం నేను హైదరాబాదు పోతున్నాను. పదిరోజుల వరకు రాను" ఆమె శిరస్సును స్పృశిస్తూ అన్నాడు.

"ఎందుకూ?" సాగదీస్తూ అడిగింది.

"ఎయిడ్స్ నిరోధక ప్రచారం మీద టీచర్లకు ట్రైనింగ్ ఉంది"

"ఇంతకీ నువ్వు నన్నిక్కడికి ఎందుకు రమ్మన్నట్టు?"

"రేపు పీలేరుకు మ్యాట్నీకి పోదామని"

"అయ్యో సినిమాకా? మా ఇంట్లో వప్పుకోరు. మా యవ్వ ఊరికే వుండదు"

"అవ్వాలే గువ్వాలే. రేపు నువ్వు ఏమి సాకు బెట్టి వస్తావో నాకు తెలీదు. మనిద్దరం సినిమాకు పోతున్నాం... పదకొండు గంటల కిక్కడ బస్సు, వచ్చెయ్!"

"సరే యింక పోదామా? మా యవ్వకు అనుమానం వస్తుంది" పైకి లేస్తూ అంది.

ఆ మాటతో అతనూ పైకి లేచాడు. ఇద్దరూ భుజం భుజం రాసుకుంటూ చింతలతోపు కడదాకా వచ్చి అక్కడి నుంచీ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

అంతవరకూ గోల చేసిన ఆకాశంలోని కాకులు యిప్పుడు లేవు.




మూడవ రోజు రాత్రి...

ధనుర్మాసపు చలి ఇంకా విజృంభిస్తోంది.

బసివిదాని గుడిసెలో ఓబులవ్వ వంద రూపాయల నోటుని కళ్ళకద్దుకొని, మళ్ళీ కొంగుకు ముడివేసుకుంది.

అడ్డుగోడపైన బుడ్డీ సన్నగా వెలుగుతోంది. చలిదెబ్బకు ముక్కులు మూసుకుపోయి ఆయాస పడుతోందామె. అయినా ఆమె మనసు మాత్రం కల్లుదాగిన కోతిలా తయారయింది. ఏవేవో ఆలోచనలు.

"అసలు ఈ హసీనా ఎవరు? ఈ గుడిసెలోకే ఎందుకొచ్చినట్టు? అందునా రేత్తిరిపూటే ఎందుకు వచ్చిపోతుంది? ఆదెమ్మ మనవరాలి గురించి అడిగింది. అసలు ఆదెమ్మ హసీనాకు యెట్లా తెలుసు? నాగరీకం తెలిసిన బిడ్డ మాదిరుండాది. నగలూ, నాణ్యాలూ బాగానే వున్నిట్టుండాయి. మంచి స్థితిమంతురాలిగానే వున్నిట్టుండాలి. యేందీయమ్మ కత. అంతు చిక్కకుండా వుందే?"

ఒకటే ఆలోచనలు!

యెడ తెరిపిలేని ఆలోచనలు!!

అదంతా అవ్వకు ఓ మిస్టరీలా అనిపిస్తుంది. అర్థంకాని చిక్కు ప్రశ్నలా తోచింది. తాను చిన్నప్పుడు విన్న భట్టివిక్రమార్క కథలు, కాశీ మజిలీ కథలు, ఇంకా ఎన్నో కథలు ఆమెకు గుర్తుకొచ్చాయి. ఆ కథల్లో సస్పెన్సు

లా అనిపిస్తోంది. ఆవేళ... అపూర్వ చింతామ ణిలో చింతామణిలా అనిపించింది హసీనా...

ఇంతలో తలుపు చప్పుడయింది. ఆమె ఆలోచనల శ్వాస ఆగిపోయింది.

తలుపుకు అడ్డుపెట్టి ఉన్న గెడ తీసింది. తలుపు దానిచ్చగా అదే వెనక్కి వచ్చింది. నవ్వుతూ లోపలికి అడుగు పెట్టింది హసీనా. అప్పటికే చెత్త ఊడ్చి ఇంటిని శుభ్రం చేసి పెట్టింది అవ్వ.

అవ్వ మళ్ళీ తలుపేసి గెడ అడ్డుపెట్టింది.

ఎక్కడా ఏ అలికిడీ లేదు. అప్పటికే పరచి వున్న తన ప్లాస్టిక్ చాపపైన కూర్చొని తలపై నున్న మంకీ టోపీని కాస్త చెవులపైకి సర్దు కుంది హసీనా.

అవ్వ దగ్గుతూ వచ్చి తుంగ చాపపైన కూర్చుంది. ఆ మాత్రానికే అవ్వకు ఆయాసం తన్నుకొచ్చింది. దగ్గు తెర ముంచుకు వచ్చి దగ్గలేక దగ్గలేక దగ్గుతోంది. ఆమె వాలకం చూసి అయ్యో అవ్వా చలి తగిలినట్టుందే..." అంటూ తన బ్యాగులో నుంచీ ఓ మాత్ర తీసి ఆమె చేతికిచ్చి లేచి వచ్చి నీళ్ళు అందించి అవ్వతో మాత్ర మింగించింది. ఆ మాత్ర మింగిన కొంతసేపటికి అవ్వకు ఉపశమనం కలిగింది. అవ్వ కృతజ్ఞతగా ఒక్కసారి హసీ నా కళ్ళలోకి చూసింది. ఆవేళ హసీనా కళ్ళు ఎంతో ప్రసన్నంగా కనిపించాయి. హసీనా ఎంతో కరుణామూర్తిగా అనిపించింది.

ఇద్దరి మధ్య భరించరాని నిశ్శబ్దం!

చూర్లో కీచురాళ్ళు కర్ణకఠోరంగా గీ పెడుతు న్నాయి. గుడిసె వెనక ఓ కృష్ణపక్షి ఉండుండి అరుస్తోంది. అవ్వ హసీనా ముఖాన్నే పరిశీ లిస్తోంది. పరిశీలించగా పరిశీలించగా ఎంతో గంభీరంగా, నిర్మలంగా కనిపిస్తున్న ఆమె ముఖంలో ఏదో విషాదఛాయ, ఆమె కళ్ళలో ఏదో జీర తోచీతోచనట్లు గోచరిస్తోంది.

"ఏం తల్లీ వూరికే కూసుంటివి. ఏదన్నా చెప్పు తల్లీ" అంది అవ్వ. ఆ మాటతో నిశ్శ బ్దం బద్ధలయింది.

"ఏం చెప్పేదవ్వా." నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తూ అంది హసీనా.

"వస్తావు. మౌనంగా కూసుంటావు... తెల్లారే లేసిపోతావు. ఏందో నీ కత చెప్పు తల్లీ" బలవంతం చేసింది అవ్వ.

"నువ్వే ఏదయినా చెప్పవ్వా... నేనింటా" అంది హసీనా.

"కాటికి కాళ్ళు సాపుకోనుండేదాన్ని. ఏం చెప్పమంటావు తల్లీ"

"నీ విషయమే చెప్పవ్వా"

"భలేదానివే... నీ విషయం చెప్పమ్మా అంటే నా గురించి అడుగుతావా? "

"ఫరవాలేదులే చెప్పవ్వా. నీ పేరేమిటి? "

"ఇంతవరకూ నా గురించి అడిగినోళ్ళే లేదు తల్లీ... నా పేరు ఓబులమ్మ. అందరూ ఓబు లవ్వ అంటారు"

"ఈ గుడిసెలోకి ఎట్లా వచ్చినావు? ఈ గుడిసెలోనే ఎందుకుండావు? అసలు ఈ గుడిసెకూ నీకూ ఏమిటి సంబంధం? "

ఆమె మాటల్లో కాస్త ఆసక్తి కనిపించింది.

"ఈ గుడిసెకీ నాకూ శ్యానా సంబంధం వుండాది. ఒగప్పుడు ఈ గుడిసె నాదని అనుకున్నా, ఆ మాటకొస్తే చాలామంది ఆడో ళ్ళకిది కొంతకాలం సొంతమవుతుంది. మళ్ళీ పరాయిదైపోతుంది" అంది అవ్వ.

అవ్వ మాటలు వింటుంటే చాలా ఆసక్తిగా అనిపించింది హసీనాకు.

"నా కత, ఈ గుడిసె కతా రెండూ వొక టే..." అంది గతాన్ని నెమరు వేసుకుంటూ.

"అదెట్లా? " ఉత్సాహంగా ప్రశ్నించింది హసీనా.

"దీన్ని బసివిదాని గుడిసె అంటారమ్మ. ఈ వూర్లో ఎన్నో తరాల నుంచీ ఆడబిడ్డల్ని మాతమ్మలుగా మార్చే ఆశారం వొగటుం డాది. ఆ చింతలతోపు కవతల ఐతమ్మ దేవ తుండాది గదా. ఆయమ్మ పేరుతో అప్పుడ ప్పుడూ వొగ కన్నెపిల్లను ముద్దరేసి వదిలే స్తారు. అట్లా వదిలేసిన ఆడబిడ్డకు ఈ గుడి సెలోనే ఈవూరి సర్పంచి కన్నెరికం చేస్తాడు. ఆ తర్వాత ఈ గుడిసెలోనే ఆ బిడ్డ కొన్ని

దినాలు బతుకుతుంది.

ఆ మాటలు వింటుంటే హసీనా మెద డులో ఏదో సంచలనం!

హృదయాన్ని పిండేసే ఆవేదన!

అవ్వ చెప్పుకుపోతూనే ఉంది.

"ఎప్పుడో అరవై ఏండ్లకు ముందుమాట... నేను ఈ వూర్లో పుట్టి పెరిగిందాన్నే. ఇప్పటి బద్దె గురువయ్య నాయనకు తోడ బుట్టిం దాన్ని.

నీకిచ్చి పెండ్లి చేస్తానని మొక్కుకొని మీరుదీసి కట్టినాడంట. అట్ల మొక్కుకున్న సంవత్సరా నికి నేను పుట్నానంట. నా ఎనక గురివిగాని నాయన బుట్టె. మొక్కు ప్రకారం... నాకు పదమూడు యేండ్లు వచ్చీ రాగానే అయితమ్మ కిచ్చి పెండ్లిచేసి ముద్దరేసి, యిద్దో ఈ గుడి సెలో వదిలి పెట్నారు. ఆ



వాడికి మేన త్తని. అందరి మాదిరిగానే నేనూ ఆ యింట్లో అల్లారుముద్దుగా పెరిగినా. నన్ను కన్నోళ్ళు ముద్దూ మురిపాలు మూట గట్టు కున్నె. మా నాయనకు పెండ్లయ్యి అయిదేండ్ల యినా బిడ్డెలు పుట్టలేదంట. అప్పుడు ఆ అయితమ్మగుడిలో దీపం పెట్టి, నాకు బిడ్డెలు పుడితే తొలి ఆడబిడ్డను మాతమ్మగా మార్చి

తంతు ఆ కాలంలో భలే అట్టహాసంగా, పటాటోపంగా జరిగిం దిలే. ఇప్పుడు సర్పంచిగా ఉండే శంకరయ్య తాత నాకు కన్నెరికం ఈ గుడిసెలోనే జేశ. మాతమ్మలకు తొలి కన్నెరికం జేసే ఆచారం వాళ్ళ వంశానికొస్తావుండేది. ఆయప్ప నాకు

కొన్ని దినాలు కూడా, గుడ్డాయేసె. ఆ తర్వాత వదిలేసె - ఇంక అప్పట్నుంచీ నా బతుకు కుక్కలు చింపిన అరిటాకైపాయ. నాలో వయసున్నన్ని దినాలు ఏడో గడస్తా వుండె. వయసు పెరిగే గుందికీ, నాకు బత



కడం కష్టమైపాయ. వయసులో నా పొందుతో ఆనందించిన వాళ్లు నన్ను చూస్తానే తప్పుకొని తిరగబట్రి. దాంతో కన్నవాళ్ళను, కన్న ఊరిని వదిలేసి ఎక్కడెక్కడో తిరిగితి. కొన్ని దినాలు పట్నంలో సాయిత్రమ్మ కంపినీలో వుంటి. అది నా వంటితో యాపారం చేసి సొమ్ము జేసుకుంటావుండె. నాకు మాత్రం అన్ని గంజినీళ్ళు పోస్తావచ్చె. రానురాను నాకు వయసుమీద బడె. దాంతో దీనికెందుకు తిండి దండగ అంటా అది నన్ను మెడబట్టి గెంటేశ. ఆ తర్వాత కొన్ని దినాలు ఆడా యీడా కూలిపనిచేసి బతికితి. కొందరిండ్లల్లో పాచిపనులు జేస్తి. ముసిలితనం వచ్చేశ. పనులు చేసే శక్తి లేక పస్తుంటా వస్తి. ఇంక యిట్ల కాదని ఇల్లిల్లు తిరిగి అడక్క తింటా వస్తి. అది సాలక నేను బతికిన బతుక్కి రోగాలూ వచ్చె. ఇంక సచ్చే ముందు కనీసం పుట్టినూర్లోనే చద్దామని ఈ ఊరికొస్తి. ఈడ సస్తే కనీసం యెత్తేసే వోళ్ళ న్నా ఉంటారని ఆశ. అట్ల ముప్పయేండ్ల తర్వాత వచ్చిన నన్ను అక్కున చేర్చుకోవాల్సిన వాళ్ళే పురుగును చూసినట్టు చూసి, కన్నెగా ఉన్నప్పుడు బసివిని చేసేదానికి తెగ ఆరాట పడిపోయిన ఈ జనాలే వయసుడిగినాక ఇండ్లల్లోకి కూడా రానియ్యాలా. పుట్టినూరిపైన బెమత వదలలేక, సావలేక, బతకలేక అడుక్కున్న దాంతో కడుపు నింపుకుంటా, ఈ గుడిసెలోనే తల దాచుకుంటా ఉండా తల్లీ..."

అవ్వకు మళ్లీ ఆయాసం వచ్చింది. కొంతసేపు దగ్గి దగ్గి మౌనం వహించింది.

అవ్వ మాటలు విన్నంతసేపూ హసీనా కళ్ళు చెమ్మగిల్లాయి. నునుపైన ఆమె చెక్కిళ్ళ మీదుగా రెండు కన్నీటి బొట్లు జారి వడిలో పడ్డాయి. హసీనాలో ఏదో ఉద్వేగం... గుండెలు పిండేసే బాధ...

ఇంతలో అక్కడి ప్రశాంత వాతావరణాన్ని కాలుష్యం చేస్తూ పెద్ద కోలాహలం. డప్పుల శబ్దం, కొమ్ముల ఉరుములు, పంబళ్ళ అట్టహాసం మిన్ను ముట్టింది.

ఆ అర్ధరాత్రి ఉన్నట్టుండి మిన్ను విరిగి మీద బడినట్లు వినిపించిన ఆ కోలాహలానికి ఒక్కసారి ఉలిక్కి పడింది హసీనా.

"అవ్వా ఏమిటిది?" కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ అడిగింది.

"ఈ నెలలో ఇక్కడ ఐతమ్మ జాతర చేస్తారమ్మా. ఆ జాతర ఈ రోజే. ఊరు ఊరంతా

ఆనందంగా ఉండాది. ఈ గుడిసెలోనే ఏ సందడీ లేదు. ఇది ఎవరికీ పట్టని గుడిసె తల్లీ"

ఆ మాట విన్న హసీనా ముఖంలో రంగులు మారాయి. అవ్వ చెప్పుకుపోతూనే ఉన్నది.

"ఈ దినం తెల్లారి చింతలతోపు కివత లుండే ఐతమ్మకు దున్నపోతుని నరకతారు. ఆ దున్నపోతును మెరవణి తీసకపోతావున్ని ట్టుండాది. అట్ల రేత్తిరంతా మెరవణి తీసి, తెల్లారి జామున దాన్ని పూజించి గంగమ్మ ముందర నిలబెడతారు. మావోళ్ళు దాన్ని కద లకుండా తాళ్ళేసి బిగబట్టుకుంటారు. మాది గోళ్ళు దాని తలను మూడే మూడేట్లకు నరికే స్తారు. అట్ల నరికేసిన తలను దేవత ముం దర బెట్టి, దాని ముందరి కాలి గిట్ట కోసి, దాని నోటికి కరిపిస్తారు. యాప మండల్తో దాని నెత్తిన నీళ్ళు పోసి, పిల్లా జల్లా గొడ్డు గోదా సక్రమంగా ఉండాలని పలికిస్తారు. ఆ తర్వాత దాని నెత్తిన దీపం పెడతారు. దాని పొట్ట కోసి, కసరు దీసి చేటలకెత్తి ఆకాశానికి ఎగజల్లుతారు. ఈ తంతంతా అయింతర్వాత ఊర్లో వాళ్ల పొట్టేండ్లు, మేకలు, యింకా లెక్క లేనన్ని కోళ్ళు గంగమ్మకు బలిస్తారు. దున్నపో తుని అంటరానోళ్లు కోసి పంచుకుంటే, మిగిలి నోళ్ళు వాళ్ల వాళ్ళ యాటల్ని ఎత్తకపోయి కోసుకోని పండగ చేసుకుంటారు. ఇంక ఈ రేతిరంతా ఆసాదోళ్ళు పంబల కొడతా పచ్చి బూతుల్తో గంగమ్మను తిడతా, గంగమ్మకు దున్నపోతుని బలిచ్చే కతను ఆగాలుగా పాడతా అడుగులేస్తా ఎంత యేడిక జూపిస్తా రోలే..."

ఓబులవ్వ జాతర సంబరాన్ని వివరిస్తుంటే హసీనాకు ఆ జాతరను చూసినట్టే అనిపిం చింది. వీధిలో కోలాహలం క్రమంగా దూర మైంది.

మళ్లీ నిశ్శబ్దం... గుండెల్ని చీల్చే నిశ్శబ్దం!

ఏ గుడ్లగూబో కాకుల గూళ్లలోకి జొరబడి నట్టుంది. ఆ అపరాత్రి కాకులు ఉన్నట్టుండి ప్రాణాలు పోతున్నట్టు కావ్ కావ్ మంటూ రొద చేయసాగాయి. ఆ రొదను వింటూ హసీనా బాధగా అలాగే కళ్ళు మూసుకుంది.

"అమ్మా హసీనా. యింతసేపూ నేనే మాట్లాడినాను. గానీ నువ్వు మాట్లాడిందేమీ లేదు. నా కూతురు లాంటిదానివి. నీ విషయం కూడా కొంత చెప్పు తల్లీ. తెలుసు కుంటాను. నీ విషయం తెలుసుకోకుండానే చచ్చిపోతే అది కోరిక కోరికగానే మిగిలిపో తుంది తల్లీ" అంది అవ్వ.

ఆ మాటతో హసీనా లేచి కూచుంది. అన్ని రోజులూ ఆమె గుండెలో గడ్డ కట్టి ఉన్న మౌనంతో బాటు ఏదో బాధ పగులు తున్న అనుభూతి. ఏదో చెప్పాలనీ, దాన్ని హృదయపూర్వకంగా ఎవరైనా వినేవాళ్లుండా లనీ, అలా చెప్పుకుని గుండెలో బరువు దిగి పోయేంత వరకూ, తనివి తీరా ఏడవాలనీ ఎన్నెన్నో అనుకుంటూనే ఉంది. ఇన్నినాళ్లు వినే మనిషే దొరక్క పోవడంతో ఆ బాధ నంతా గుండెలో మోస్తూనే ఉంది. ఆ వేళ అవ్వ చాలా ఆత్మీయురాలిగా అనిపించింది.

"చెప్తాను వింటావా అవ్వా" అంది.

"అయ్యో చెప్పు బిడ్డా" ఉత్సాహంగా అంది ఓబులవ్వ.

హసీనా ఒక్కసారి కళ్ళు మూసుకొని గాఢంగా ఒక్క నిట్టూర్పు విడిచి కథ చెప్పడం ప్రారంభించింది.




అదీ చలి కాలమే.

ఆకాశంలో పొద్దు బారెడు పైకి పాకింది. తూర్పు కొండ అందంగా ధరించిన కిరీటంలా

సూర్యుడు కోటి ప్రభలతో వెలిగి పోతు న్నాడు.

ప్రధాన వీధిలో మధ్యన అగ్ర వర్ణీకులు కొందరు చలి మంట వేసుకుని చలి కాచుకుం టున్నారు. దిగువ వీధిలోను కొందరు చలి మంటల ముందర కూర్చొని ఉంటే మరికొం దరు ఇండ్ల ముందర నీరెండకు నిలబడి చలి పులిని దరి చేరనీయకుండా చూసుకుంటు న్నారు.

దానికి దిగువన దళితవాడ ప్రజలు దుప్ప ట్లు కప్పుకొని నీరెండకు యిండ్ల ముందర కూర్చుని కునికిపాట్లు పడుతున్నారు.

ఆ ఊరినీ, పల్లెనీ వేరుచేస్తూ మధ్యలో ఉన్న రచ్చ బండ మధ్యన పెరిగి ఉన్న రావి చెట్టు తూర్పు నుంచీ వీస్తున్న సన్న గాలికి ఆకుల్ని కదిలిస్తూ ముదిగారంగా శబ్దం చేస్తోంది.

కొరముట్ల తోలు సంచీ సంకకు తగిలించు కుని, నోటి నిండా వేసుకున్న వక్కాకు నము లుకుంటూ కురవపల్లె వైపుకు బయలుదేరాడు గుండెకాయలోడు.

కాస్త ముందుకు వెళ్లాడో లేదో వడినిండా ఏదో పోసుకుని మంచులో ముద్దగా తడిసి పోయి వణుకుతూ ఎదురుపడింది గుండె కాయలోని కూతురు కోటమ్మ.

"పొద్దున్నే యాడ బొయ్యొంటివమ్మణ్ణీ? " ప్రశ్నించాడతను.

"పులగూరకు అంత గురుగాకు కోసకొద్దా మని... దా కంసలోళ్ళ సేన్లోకి పొయ్యొంటి నాయనా" అంది చలికి పైటను భుజాలపైన బిగించుకుంటూ.

"ఇంత పొద్దున్నే పొయ్యిండకపోతే ఏమమ్మా? " అన్నాడతను.

"రైతులు చేన్లకాడికి వచ్చే లోపల పెరుక్కో వాల గదా. వోళ్ళు గనక చూస్తే యింకే మన్నా వుండాదా? " అంది కోటమ్మ.

"సరే పదా. మీ యమ్మ నీ కోసరం కాసు కోనుండాది" అని ముందుకు నడిచి వెళ్ళిపో యాడు గుండెకాయలోడు. అక్కణ్ణించీ నేరుగా ఇంటికి వెళ్ళిపోయింది కోటమ్మ.

కొట్టం దాటుకొని గుడిసెలోకి వెళ్ళి, పొయ్యి ముందర కూర్చుని వడిలోని గురుగాకు నేలపైన పోసి శుభ్రంగా వలవసాగింది.

పొయ్యి మీద ఒక చట్టిలో ఎసురు కాగు తోంది. అప్పటికింకా దుప్పటి కప్పుకొని పడు కునే ఉన్న ఆమె తల్లి ఆదెమ్మ "ఎసురు కాగి నట్టుండాది. ఆకు మల్లి వల్చుకుందువుగానీ, ముందు కాగులో ఉండే అన్ని సద్దల రోట్లో పోసి దంచి ఎసిట్లో పొయ్యి తల్లీ" అంది.

ఆ మాటతో పైకి లేచి, చేట తీసుకుని కాగులో వున్న పొట్టాదదంచిన సజ్జల్ని కొన్ని చేటలోకి తోడుకుంది. కాగులో అడుగున యింకొన్ని సజ్జలే ఉన్నాయి.

"అమ్మా. సద్దలప్పుడే అయిపోయినాయే. యింకొగ దినానికవతాయంతే" అంది కోటమ్మ.

"ఏం జేసేది తల్లీ. ఎప్పుడూ కానా కష్టమే. ఏం బతుకులో ఏమో. రోజూ అంబలి కాసు కొని తాగతా వున్నా. అప్పుడే అయిపోయి నాయి"

నిష్ఠూరంగా అంది ఆదెమ్మ.

చేటలోకి తీసుకున్న సజ్జల్ని ఒక్కసారి పరి శీలించి, గోడ కొమ్ముకు తగిలించి ఉన్న కుదురు తీసి రోటికి అమర్చి ఆ సజ్జల్ని రోట్లో పోసి, అందులో అన్ని నీళ్ళు పోసి పదును చేసింది. ఆ తర్వాత తలుపు సందున గోడకు ఆనించి ఉన్న రోకల్ని తీసుకుని గబగబా రెండు గుముకులు గుప్పి వక్కలు ముక్కలు గా దంచి, ఆ నూకల్ని ఎసట్లో పోసింది కోట మ్మ. ఆదెమ్మ లేచి వచ్చి పొయ్యి ముందర కూర్చి అబకతో అంబలిని కలియబెట్ట సాగింది.

కోటమ్మ తమ్ముడు సుబ్బయ్య, చెల్లెలు చిన పాప దుప్పట్లు కప్పుకొని ఒక మూల అలాగే పడుకుని ఉన్నారు.

సజ్జ కుట్ర కళాపెళా శబ్దం చేస్తూ ఉడుకు తోంది. ఆదెమ్మ లేచి వెళ్ళి మరో పక్కన చట్టిలో వున్న ఉప్పు తీసి కాస్తా అంబలిలో

## ఏదీ మరోసారి?

ఆనంద గజపతులవారి సభ. సంగీత సాగరాన్ని మథించిన ఆదిభట్లవారి కచేరీ సాగుతోంది. రాజావారితోపాటు సభాసదులూ తన్మయులైపోతున్నారు. ఆ సమయంలో ఓ చక్కని కీర్తన నడుమ ఓ సొగసైన సంగతి వేశారు దాసుగారు. రాజావారు ముగ్ధులై 'ఏదీ మరోసారి అనండి' అని కోరారు.

దాసుగారు అనలేదు. విననట్లే ఉన్నారు. ఆయన తీరుకు ఆనంద గజపతి ఆశ్చర్యపోయారు. రాజధిక్కారమేంటి అని సభాసదులు గుసగుసలాడారు. అంతలో అనూహ్యంగా ఓ చల్లని పిల్లతెమ్మెర వీచింది. వెంటనే దాసుగారు 'ఏదీ మరియొకసారి?' అని అన్నారు అంతకుముందు తనను అచ్చం రాజావారన్నట్లే.

రాజావారికి అర్థమైంది.. పిల్లతెమ్మెర అడిగినప్పుడల్లా ఎలావీచదో తన సంగీతమూ అంతేనంటూ దాసుగారు అన్యాపదేశంగా తనకు తెలియ చెబుతున్నాడని. అందుకే చిరునవ్వు నవ్వారు.




వేసి, కలియబెట్టి, మరికొంత సేపటికి, మసిగుడ్డతో చట్టిని పట్టుకొని తీసి పక్క పొయ్యి మీద పెట్టింది.

ఇంతలో చిన్న పిల్లలు లేచి పెరట్లోకి వెళ్ళి ముగ్గుపిండితో పళ్ళు తోముకుని, ముఖం కడుక్కుని వచ్చారు.

రెండు కంచాలు తీసుకుని ఒక్కోదాంట్లో ఒక్కో అబక అంబలి పోసి వాళ్ళకిచ్చింది ఆదెమ్మ. ఆ అంబల్ని చల్లార్చుకొని ఆవురావురుమంటూ తాగసాగారు వాళ్ళు. మరో కంచం తీసుకుని అందులో రెండు అబకల అంబలి తోడి కోటమ్మకిచ్చింది. కోటమ్మ అంబల్ని మింగి అన్ని మంచి నీళ్ళు తాగింది.

అప్పటికి గంట పదయింది.

మంచు పూర్తిగా కరిగిపోయింది. వీధుల్లో చల్లారిపోయిన చలిమంటల బూడిదలో కుక్కలు పడుకుని పొర్లాడుతున్నాయి.

తలారా స్నానం చేసి కురులు ఆరబెట్టుకుంటున్న ముత్తయిదువులా మెరిసిపోతూ కనిపిస్తోంది ప్రకృతి.

కోటమ్మ బోకులు కడిగి వచ్చేసరికి ఎండ చురుగ్గా కాస్తోంది. పది రోజుల ముందు, చుట్టుపక్కల చేల గనాలలో కోసుకు వచ్చి, ఎండేసి ఉన్న ఊస పుల్లలు పెరట్లో ఎండుతున్నాయి. వాటన్నింటినీ కట్టగట్టి గజం పొడవుతో, వేలిలా ఉన్న రెండు వెదురు కట్టెల్ని చేతబట్టుకొని, చెల్లెల్ని తీసుకుని ఊరి ముందర బయలుదేరింది కోటమ్మ.

అక్కడ చేన్లో ఒకచోట కోటమ్మ ఊసల్ని దించి నేలపైన వేసింది.

పిడికెడు పుల్లల్ని ఎడమ చేతిలోకి తీసుకొని, వాటిని సాపుచేసి పట్టుకొని, కుడిచేతిలోని వెదురు కఱ్ఱతో ఊసల వెన్నుల్ని సుతారంగా కొట్టి చూపించి, మరో కఱ్ఱ తీసుకుని, అదే విధంగా చేయమని చెల్లెలికి పురమాయించింది కోటమ్మ.

ఇద్దరూ ఎత్తుకుపోయిన ఊసల్ని శుభ్రం చేసేటప్పటికే గంటపైనే పట్టింది. రాలిన ఊసలు చిన్న ఇసకమేటలా కనిపిస్తున్నాయి. కడాన తమ బట్టల కంటుకున్న పూచిక ముండ్లను తీసిపారేసి, విడిపించిన ఊసల్ని చెరో సందెడు సంకల బెట్టుకొని

యింటికి బయలుదేరారు. ఇంట్లో కొట్టం ముందరున్న అరుగుపైన వాటిని కుప్పగా పెట్టి, పిడికెడు పిడికెడు ఈసల్ని ఒకటిగా చేర్చి కట్టలు కట్టి పొరకలు తయారుచేశారు. ఆ పొరక కట్టలన్నింటినీ తిరిగి ఒక కట్టగా కట్టి, మధ్యాహ్నం మళ్లీ అంత అంబలి తాగి, ఆ పొరకల కట్టను నెత్తిన పెట్టుకొని, పల్లె లంటా వాటిని అమ్ముకురావడానికి బయలుదే రారు.

"అమ్మా! అమ్మా. హసీనా. కొంచెం ఆపు తల్లీ" అంతవరకూ మౌనంగా వింటున్న ఓబు లవ్వ అంది.

హసీనా చెప్పడం ఆపింది. ఎందుకాపమ న్నదో ఆమె కర్థం కాలేదు.

"ఏమవ్వా, కత బాగలేదా?" అడిగింది హసీన.

"కతేమో బాగనే చెప్తానుండావు తల్లీ. ఇవి ఈ ఊళ్లో వాళ్ళకతే కదమ్మా"

"నేను ముందే చెప్పినాను కదవ్వా... అన గనగా ఒక ఊరికి బదులుగా ఈ ఊరే అను కోమని"

"నిజమేమ్మా... కానీ నీ కతలో మనుషులు ఇప్పుడూ ఈ ఊర్లోనే వుండారు కదమ్మా?"

"ఉండచ్చు"

"నాదొక చిన్న అనుమానం!"

"చెప్పవ్వా"

"మొన్నేమో ఆదెమ్మ మనవరాలి గురించి అడిగితివి. ఈ దినం, వాళ్ళ కుటుంబం గురించే కత చెప్తావుంటివి.. వాళ్ళు నీకెట్ల తెలుసు... వాళ్లకూ నీకూ సంబంధమేమి తల్లీ" ప్రశ్న మీద ప్రశ్న సంధించింది.

"అవ్వా... కతంతా పూర్తిగా వినకనే అట్లడి గితే యెట్లా?" అంది హసీనా.

"మొన్నట్నుంచీ ఇదే మనోయాతనయిపో యింది. అసలు ఈ ఊరికీ నీకూ ఏమి సంబంధం. ఆ ఆదెమ్మ కతకూ నీకూ ఏమి సంబంధం..."

"అవ్వా. నిదానంగా నీకే తెలుస్తుందిలే... కత విను ముందు" అంది హసీనా.

"ఇంతలో "హొరేయ్. నరుకు కొడుకుని. చంపు" ఏవో కేకలు వినిపించాయి.

"నరుకురా చూస్తాం కొడకా"

"ముందు నన్నెందుకు తిట్నావో అది చెప్పరా, ఆ తర్వాత నరుకుతా"

"ముందు నన్నెందుకు కొట్టావో అది సెప్పరా"

"నువ్వు తిడితే నేను కొట్నా. అంతే"

"తిడితే... అందుకు కొడతావా... ఇప్పుడు నిన్ను కొడితే ఏం చేస్తావురా"

"కొట్రా చూద్దాం. నీ నెత్తురు కళ్ల జూస్తా"

ఒకటే అరుపులు, ఛాలెంజ్‌లు.

వాళ్ల మాటలు వింటుంటే వాళ్ళు పోట్లాడు కుంటూ ఎక్కడ గుడిసెలోకి జొరబడతారో అన్నట్లుంది.

"ఏమిటవ్వా ఆ గలాటా?" అడిగింది హసీన.

"జాతర గదా. వీళ్ళు పులిచెర్లకు పొయ్యి సారాయి, కల్లు తాగేసొస్తామన్నట్లుండాది. దార్లో కొట్టుకుంటా తిట్టుకుంటా పోతాంటారు. పండగలకు పబ్బాలకు అట్ల తాగేసి కొట్టు కోవడం మామూలే. మత్తు దిగిపోయినాకా తెల్లారి మళ్లా మామూలుగానే మాట్లాడుకుం టారు. అంతా మందు మగతనం... అంతకు మించి ఏమీ లేదు" అంది అవ్వ.

"కత చెప్పే ఉత్సాహం చచ్చిపాయే గానీ... ఇంక పడుకుందామవ్వా నిద్దరొస్తావుంది" మౌనంగా పడుకుని దుప్పటి కప్పుకుంది హసీనా.

బుడ్డీ ఆర్పేసి వచ్చి అవ్వా పడుకుంది. కానీ ఆమెకు నిద్ర పట్టలేదు.

హసీనా గురించే ఆలోచిస్తూ పడుకుని ఉండిపోయింది. ఆలోచనలు ఆమె నిద్రను మింగేశాయి.

* * *

ఆ మరునాటి మధ్యాహ్నం...

కలికిరిలో పనిచూసుకుని బస్సెక్కి పీలేరు బస్టాండులో దిగింది హసీనా.

బస్టాండు వచ్చేపోయే వాళ్లతో రద్దీగా

వుంది.

బెంచీలపైనా, నేలపైనా కూర్చొని, తమ వస్తువుల్ని, పిల్లల్ని జాగ్రత్తగా కనిపెట్టుకొని తాము వెళ్లబోయే బస్సుల కోసం నిరీక్షిస్తున్నారు కొందరు. నిలబడుకొని కొందరు, అటూ ఇటూ తిరుగుతూ కొందరు, వస్తూ కొందరు, పోతూ ఇంకొందరు, వచ్చిన బస్సుల్లో నుంచీ దిగుతూ కొందరు, ఎక్కుతూ మరికొందరు... అక్కడున్న ఆడవాళ్లను చూస్తున్న కుర్రకారు, అణువణువును అనుమానపు చూపుల్తో శోధిస్తూ అటూ, ఇటూ తిరుగుతూ ఇద్దరు కానిస్టేబుళ్ళు... బస్టాండంతా గందరగోళంగా ఉంది.

వాచీ చూసుకుంది హసీనా. సరిగ్గా అప్పటికి ఒకటి ముక్కాలయింది.

"ఇప్పుడేం చేయాలి? పొద్దుకల్లా ఊర్లోకి పోలేను. ఇలా యింకా ఎన్ని రోజులు... ఈ అజ్ఞాతవాసానికి వీలయినంత త్వరగా స్వస్తి చెప్పేయాలి. ఇంకా చేయాల్సిన పనులు చాలా ఉన్నాయి. వాటిని ముగించుకొని ఈ అజ్ఞాతవాసమూ ముగించాలి" అనుకుంటూ అక్కడే ఉన్న బెంచీమీద కూర్చుంది.

అలా కూర్చున్న హసీనాను, అప్పుడే వచ్చి ఆగిన బస్సులో నుంచీ దిగిన ముగ్గురు వ్యక్తులు బాగా ఆకర్షించారు. ముగ్గురూ మంచి యవ్వనంలో వున్న వ్యక్తులే. ఇద్దరు అబ్బాయిలు, ఒక అందమైన అమ్మాయి. ఆ అమ్మాయి ముక్కూ ముఖం చక్కగా ఉంది. ఆ అమ్మాయిని చూడగానే ఈ అమ్మాయి నా కూతురయితే ఎంత బాగుండు అనుకుంది హసీనా. ఆ యిద్దరబ్బాయిలూ ఆమెకెదురుగా నిలబడి మాట్లాడుకుంటూవుంటే ఆ అమ్మాయి దూరంగా నిలబడి ఏమీ ఎరగనట్లే వాళ్ళని గమనిస్తోంది.

"కుమార్, నాకు పాత బస్టాండ్ కాడ పనుంది. పోయొస్తా. నువ్వు పదా" అన్నాడు ఇద్దరిలో ఒకడు.

"సరేరా. నా మాటను గౌరవించి నువ్వు గుళ్ళో పూజారిగా చేరినందుకు చాలా సంతోషం" అన్నాడు కుమార్.

"నువ్వు చెప్పినావని కాదుగానీ, నాకు వేరే మార్గం లేదు. అందుకే చేరిపోయినా... సరే. వస్తారా" అని చేయి ఊపి అక్కడినుంచీ గబగబా వెళ్ళిపోయాడతను.

అతనలా వెళ్ళగానే అంతవరకూ వాళ్ళనే గమనిస్తున్న అమ్మాయి ఒక్క అంగలో ఆతణ్ణి సమీపించింది.

"మనిద్దరం కలిసొచ్చినట్టు నీ మిత్రుడికి తెలుసునా? " అంది.

"అదేం లేదులే. బస్సులో కలిశాడు అంతే... అయినా అంత ఈజీగా మన విషయం తెలియనిస్తానా. సరే. యిప్పుడు మనం క్రాస్ రోడ్లో ఒక మంచి హోటల్‌కు పోదాం. అక్కడ బిరియానీ బాగుంటుంది. అది తిని అక్కన్నుంచీ ఆటోలో మిట్టన సినిమాహాలుకు పోదాం. అదీ యిదీ మాట్లాడుకుని సాయంత్రం మళ్ళా బస్సెక్కేద్దాం" అంటూ సుతారంగా ఆమెచేతిని పట్టుకొని ఒక్కసారి నొక్కాడు.

"సరే మీ యింట్లో ఏమని చెప్పొచ్చినావు? " అడిగాడతను.

"ఏదో ఒకటి చెప్పొచ్చినాలే" అంటూ తన రెండు చేతులతో అతని చేతిని గట్టిగా పట్టుకొని అతన్ని అతుక్కుపోయినట్టు నిలబడింది. ఇద్దరూ అలాగే ముందుకు నడచి వెళ్ళిపోయారు.

వాళ్ళనే చూస్తున్న హసీనా... "ఆ వయసులో ఏమీ తెలీదు. ఆవేశం తప్ప ఆలోచన లేని వయసు. ఏది మంచో ఏది చెడో తెలుసుకోలేరు. ఆ వయస్సులో కన్నెపిల్ల ఎన్ని ఊహల్లో తేలిపోతుందో. తనను ప్రేమించే వ్యక్తి లభించాలనీ, అతడు తనంటే పడి చచ్చే వాడిగా ఉండాలనీ అతనితోనే జీవితం సుఖంగా సాగిపోయి, అతనితోనే బతుకుని పండించుకొని, చివరికి అతని వడిలోనే కన్ను మూయాలనీ ఆశపడుతుంది. కలలు కంటుంది. ఆ కలల కనుగుణంగా మగవాడు దొరికిన ఆడపిల్లకదా అదృష్టవంతురాలు. ఆ అదృష్టం తనకే కలగలేదు. అలాంటి కలలు

కనే అవకాశం కూడా తనకు లేకుండా అయిపోయింది. జీవనపరంగా పాతాళంలోకి పడిపోయిన వాళ్ళకి అలాంటి కలలు కనడం అంటే ఆకాశంలో పూచిన పూల కోసం ఆశపడడమే" తనకు తెలీకుండానే ఆలోచించసాగింది.

ఆవేళ ఆమె మనసు ఎటో వెళ్ళిపోయింది. కొంతసేపటికి కడుపులో ఆత్మారాముడు గోల పెట్టడంతో పైకి లేచి ఎదురుగా ఉన్న హోటల్లో భోంచేసి, ఆటో ఎక్కి తనూ ఒక సినిమా థియేటర్లో దూరింది. ఏదో సినిమా. అర్థం పర్థం లేని ప్రేమ... అర్థం పర్థం లేని అపార్థాలు, ఆటంకాలు, అర్థం పర్థం లేని త్యాగాలు, మళ్ళీ కలుసుకోవడాలు... ఒకటే గోల. సినిమా వదిలేటప్పటికి సాయంత్రం అయిదున్నరయింది. మళ్ళీ బస్టాండు కొచ్చింది. పులిచెర్లకు వెళ్ళే బస్సు సిద్ధంగా వుంది.

ఎక్కి కూర్చుంది.

ముందుసీట్లో... మళ్ళీ అదే జంట. పెళ్ళి కాని ప్రేమ జంట. ఆసక్తిగా వాళ్ళనే గమనిస్తూ ఉండిపోయింది హసీనా.

ఆ బస్సు కదిలేటప్పటికి పొద్దు గుంకింది. పులిచెర్ల చేరేటప్పటికి రాత్రి ఎనిమిదయింది. బస్సు దిగిన ఆ జంట గబగబా వెళ్ళిపోయింది. మాత్రం పక్కనేవున్న హోటల్లో కాస్త గతికి ఊరి వైపు నడక ప్రారంభించింది హసీనా. ఆ చీకట్లోనే రైల్వేస్టేషన్ దాటుకొని అరగంటలో ఊరు చేరుకుంది.

తాను గుడిసెలో అడుగు పెట్టేసరికి ఆమె కోసమే ఎదురుచూస్తోంది ఓబులవ్వ. పొయ్యి గడ్డపైన బుడ్డీ వెలుగుతోంది. హసీనా తన చాపపైన కూలబడి గోడకానుకొని కూర్చుంది. పీలేర్లో ఆ జంటను చూసినప్పటినుంచీ ఆమె మనసులో ఏవేవో ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి.

"ఆ అమ్మాయే నా కూతురయితే ఎంత బాగుండు!" మరోసారి అనుకుంది...

అప్పటికే ఓబులవ్వ గాఢ నిద్రలోకి జారుకుంది.

రేయి వేగంగా గడచిపోతోంది.




ఆ రాత్రీ మామూలుగానే తెల్లవారింది.

ఓబులవ్వ లేచి నోరు కడుక్కుని, గుడిసె ముందరి కొచ్చింది.

చలి వణికిస్తోంది. పొద్దుయింకా పొడవలేదు. కప్పుకున్న దుప్పటిని తల మీదకు లాక్కొంది. ఊతకట్టే పొడుచుకుంటూ వీధి వైపుకు నడిచింది.

వీధిలో చలిమంట వెలుగుతోంది... దానికి చుట్టూ కొందరు కూర్చొని అరచేతుల్ని మంట వైపుకు చాచి మరీ చలి కాచుకుంటున్నారు. మెల్లగా అక్కడికి వెళ్ళింది. ఒకచోట సందు చేసుకుని వాళ్ళ మధ్యన కూర్చోబోయింది.

"యేయ్. ముసల్దానా... మా పక్కకే వస్తివా... దరిద్రకంపూ నువ్వూను. పో... పో..." అంటూ ఓ కుర్రాడు కసురుకున్నాడు.

"ఏమిరా నీ మిడిమేళం... నువ్వు దరిద్రుడివి గాదా. ఎక్కడ్రా నీకు మిద్దెలు, మేడలు యెలిగిపోతావుండేది... జమీందారు కొడకా. నీవు పడుకునేది కప్పు కూడా సరిగా లేని సుట్టింట్లో గదా... జరుగు జరుగు... ముసిల్దాన్ని సచ్చిపోతావుండా సలికి" గదమాయించింది.

ఆ మాటతో ఆ కుర్రాడి నోటికి తాళం పడిపోయింది. మెల్లగా తూర్పున చీకట్లు తొలిగాయి. పొద్దు పొటమరిచింది. చలి తగ్గుముఖం పట్టింది. చలిమంట చల్లారుతోంది. ఒకరొకరే చలిమంటలు వదిలి వెళుతున్నారు... చల్లారిన చలిమంట బూడిద కుప్పగా



మిగిలింది. ఆ బూడిదలో నుంచీ సన్నగా పొగ పైకి లేచి గాలిలోనే కరిగిపోతోంది. చూస్తూవుండగానే పొద్దు బారెడెక్కింది. చేద బావి దగ్గరినుంచీ కొందరాడవాళ్ళు నీళ్ళ కడ వలు మోసుకొస్తున్నారు. అప్పటికే కొందరు మగవాళ్ళు తమ ఇళ్ళ ముందరున్న అరుగుల పైన కూర్చొని బీడీలు కాల్చుకుంటున్నారు.

ఓబులవ్వ చలిబాధ తగ్గింతర్వాత కాళ్ళీడ్చు కుంటూ తనుంటున్న గుడిసె ముందరికొచ్చి, అక్కడి దృశ్యం చూసి అవాక్కై పోయింది.

ముగ్గురు వ్యక్తులు ఆ గుడిసెమీదకెక్కి పాత కప్పును తోయడాని కుపక్రమిస్తున్నారు.

"అయ్యో...అయ్యో... యింకెట్ల సామీ..." అని గొణుక్కుంటూ "వొరే. మిమ్మల్ని తగ లెయ్య. ఈ గుడిసెకు మళ్ళా కొత్త కప్పు యేస్తారా? మళ్ళా దేనికి మూడిందిరా..." గొంతు చించుకుని అరవసాగింది.

"వొసే ముసిలిదానా నోరుమూసుకో నుండు. అన్న సెప్పినాడు. వోళ్ళు సద్దగూడు కోసేసినారంట. ఆ సద్దచాప్ప యింటికి చేర్చ కనే ఈ గుడిసెకు కప్పేసేయమన్నాడు. ఆ..." కప్పుకు ఉన్న పాత కట్లను వెదు కుతూ అన్నాడు కప్పు పైనున్న ఎర్రన్న.

"ఏ అన్నరా సెప్పింది, వోడి తాడుదెగా. వోన్నెత్తకపొయ్యి బచ్చన్నకుంట్లో పూడ్సా" తెల్ల జుట్టు జారిపోకుండా ముడి వేసుకుంటూ అశ్లీ లంగా తిట్టసాగింది ఓబులవ్వ.

"వసే ముసిలీ. అడక్కతినేదానా. అన్నను తిట్టొద్దు. యిక్కడ వుండేదానికి గుడిసే, కుడిసే దానికి కూడూ వుండదు మల్ల" పైక

ప్పునున్న తాడు కట్టును కొడవలితో కోస్తూ అన్నాడు మరో వ్యక్తి నాగన్న.

మూడో వ్యక్తి వింతగా చూస్తున్నట్లు కప్పు పైనే మౌనంగా కూర్చోనున్నాడు. ఓబులవ్వ ఇంకా విజృంభించింది.

"ఈ ఊరు గాకపోతే యింకో వూరుకు పోతారా. అడక్కతినేదానికి ఏ వూరయితే నేమి. వోడికి బుద్ధి లేకపోతే మీకన్నా బుద్ధి లేదంట్రా" చేతిలోని ఊతకర్రను పైకెత్తి మరీ అంది.

"సరేలే. సాలుగానీ, ఇంక మూసుకో" అన్నాడు ఎర్రన్న.

"ఏం కూస్తుండావురా..." మనిషి ఊగి పోతూ తిట్లవర్షం కురిపించింది. ఆమెనోటి ధాటికి కాస్త వెనక్కి తగ్గాడు ఎర్రన్న.

"నువ్వు పోతల్లీ... నీతో ఎందుకు గొడవ. పో... పో" అంటూ తన పనిలో నిమగ్నమై పోయాడు నాగన్న.

ఓబులవ్వ తిట్టుకుంటూ గొణుక్కుంటూ వీధివైపు నడిచింది.

"ఈ ముసిల్దానికి ఏమీ పనిలా, ఎప్పుడూ ఎవురినో వొగర్ని తిడతా వుంటుంది" అన్నాడు నాగన్న.

"జీవితమంతా తోడూనీడా లేకుండా వొంటి గా బతికింది గదా. దానికెంత బాదుందో" అంతవరకూ మౌనంగా ఉన్న మూడో వ్యక్తి అన్నాడు.

నాగన్న నడికొప్పునున్న తాడు కట్టును అలా కోశాడో లేదో, వెదుర్లు పటపటమని శబ్దం చేశాయి.

"ఒరే... ఈ వెదుర్లు నుసిబట్టిపోయినట్టుం డాయి. కింద బడేట్టుండాము దిగండ్రోయ్" అంటూ కేక పెట్టాడు నాగన్న.

ఆ మాటతో మిగిలిన యిద్దరి గుండెలు జల్లుమన్నాయి... అప్పటికే వాళ్ళు కాస్త కప్పు తోసేసి ఉన్నారు.

"ఒరే నాగ్గా. నువ్వు కదలొద్దు. అట్టే వుండు. మేము దిగిపోతాము. బరువెక్కువైన ట్టుండాది. నువ్వు మెల్లగా దిగు..." అన్నాడు ఆందోళనగా ఎర్రన్న.

"అలాగే..." అంటూ కదలకుండా నడిక ప్పున అట్లే కూర్చొని ఉండిపోయాడు నాగన్న. మిగిలిన యిద్దరూ మెల్లగా దిగి కిందికొ చ్చారు. వాళ్ళు తోసిన ప్రదేశం బారెడు వెడ ల్పుతో కప్పుకు, చిరిగిన బట్టలా కనిపిస్తోంది.

నాగన్న జాగ్రత్తగా నడికప్పునుంచీ కిందికి దిగేశాడు.

"సరే. రేపో మాపో వచ్చి జాగ్రత్తగా కప్పు తోసేద్దాం. ఆ తర్వాత విరిగిన లోపలి వెదు ర్లకు బదులుగా కొత్త వెదుర్లు బిగించి కొత్త కప్పు వేద్దాం" అన్నాడు నాగన్న.

"సరే" అన్నారు మిగిలిన ఇద్దరూ.

"మన సర్పంచోళ్ళ మామిడి తోటలో వెదురు పొదలుండాయి కదా. అన్నకు జెప్పి రెండు కొట్టకొచ్చుకుంటే సరిపాయే" అనుకుం టూ అక్కడి నుంచీ వెళ్ళిపోయారు వాళ్ళు.

* * *

ఆనాటి రాత్రి యధావిధిగా హసీనా గుడి సెలోకి అడుగుపెట్టింది. బుడ్డి వెలుతురులో యిల్లు కాస్త అస్తవ్యస్తంగా కనిపిస్తోంది. అక్క డక్కడా చెత్త పడి ఉంది. లోపల కొంచెం చలిగా కూడా ఉంది.

ఆమెను చూస్తూనే ఓబులవ్వ "అమ్మా నీ కోసమే చూస్తావుండా తల్లీ రేపట్నుంచీ మన కిక్కడ స్థానం లేదు" అంది.

"ఎందుకవ్వా?" తన చాపను విదిలించిప రచి, దానిపైన కూర్చుంటూ అడిగింది హసీనా.

"ఈ యింటి కప్పు తోసేస్తారమ్మా. పొద్దన... అద్దో, ఆ మూల కొంత తోసేసి పోయినారు చూడు" అంది.

ఆ మాట విన్న హసీనాకు గుండె కలుక్కు మంది. చాటడు నిప్పులు కడుపులో పోసి నట్లు... బాధ వేసింది. ఇంతసేపూ ఆమె గమనించనే లేదుగానీ, ఆగ్నేయ మూలన బారెడు వెడల్పు కప్పు లేకుండా కనిపించింది గుడిసె. పైకప్పున నల్లగా కనిపిస్తున్న రెండు వెదుర్లు విరిగి లోపలికి వేలాడుతున్నాయి. ఆ

ప్రదేశం నుంచే చల్లగాలి గుడిసెలోకి వస్తోంది.

"ఈ పాత కప్పు పోయిండాది కదా. దాన్ని మొత్తంగా తోసేసి మళ్ళా కప్పుతారంటమ్మా. మనకింక ఇక్కడ స్థానం లేదు. నేనంటే అడక్కతినేదాన్ని. ఏ తల్లో అంత పెడితే తిని, ఎవురి అరుగు మీదనన్నా తల దాచుకోని ముడుక్కుంటా. బంగారు తల్లివి. నీ సంగతెట్లా? " దిగాలుగా అంది అవ్వ.

ఆ మాటకు ఏం చెప్పాలో హసీనాకు అర్థం కాలేదు. మౌనంగా ఉండిపోయింది. ఆమె ఆలోచనలు మెదడును తొలచసాగాయి. అవ్వ ఏదో చెబుతోంది. కానీ హసీనాకు అవేవీ వినబడనట్లే ఉండిపోయింది.

'ఆ గుడిసె కప్పు ఎందుకు తోసి, కొత్తగా మళ్ళా కప్పుతారో తనకు బాగా తెలుసు. ఆ గుడిసెకు కప్పుతోసి కప్పడం తను మొట్టమొదట ఎప్పుడు చూసిందో!' ఆలోచిస్తూనే మనసు పొరల్ని కెలకసాగింది.




"ఇంటికొగ మడిసి రచ్చబండ కాడికి రండబ్బా. మద్దిస్తముండాది" అంటూ యింటింటికీ తిరిగి ఆ రోజు సంధ్యవేళ చెప్పొచ్చాడు కులపెద్ద చిన్నకొడుకు రంగడు.

ఆ పిలుపందుకొని ఒక్కొక్కరే రచ్చబండను చేరుకోసాగారు. ఆకాశంలో వెన్నెల యిష్టం వుండీ లేనట్లు గుడ్డిగా కాస్తోంది. వీస్తున్న సన్నగాలికి రచ్చబండ మధ్యనున్న రావిచెట్టు ఆకులు 'మీ మద్దిస్తం మేమూ వింటాంలే' అన్నట్లు కదులుతూ సన్నగా శబ్దం చేస్తున్నాయి. అందరూ వచ్చి రచ్చబండ కింద నేలపైన కూర్చున్నారు. కులపెద్ద ఉత్తన్నతోబాటు మరికొందరు రచ్చబండ పైన కూర్చున్నారు.

"అబ్బోడా రంగా. యింకెవురన్నా రావాల్నా!" అడిగాడు ఉలవకాయల ఉత్తన్న.

"అందరూ వచ్చేసినారు నాయనా" చెప్పాడు అతని కొడుకు రంగడు.

"యింగేమబ్బా. అందర్నీ యీడ చేర్చిన అగత్తెమేమబ్బా? " అన్నాడు మద్దిస్తాన్ని ప్రారంభిస్తూ బానతోళ్ళ బాలయ్య.

"ఏం లేదు. మన కులంలో శ్యానామంది మొక్కుబళ్ళు వుండేవోళ్ళు మన కులదేవత అయితమ్మకు ఆడబిడ్డెనిచ్చి పెండ్లి జేసి, ముద్దరేసి వదిలేది ఆశారం గాదా. అయిదేండ్లబ్బుడెబ్బుడో ఈ బాలయ్య సెల్లెలు లచ్చిమిని ముద్దరేసి వొదిలేస్తిమి. అంతకు ముందెప్పుడో కొమ్ములోళ్ల సిద్ధప్ప కూతుర్ని వదిల్తిమి" ఉపోద్ఘాతం చెప్పసాగాడు ఉత్తన్న.

"అయితే ఇప్పుడు ఎవుర్నన్నా బసివిని చెయ్యాల్నా" ప్రశ్నించాడు సిద్ధప్ప.

"ముందు అది సెప్పబ్బా" గట్టిగా అరిచినట్లన్నాడు గుండెకాయలోడు.

"ఏం లేదబ్బా. మన బద్దె గురవయ్య కూతురికి మొన్న గాలి సోకిందంట. అందునా ముందే మొక్కుబడి అంట. అందుకనీ, ఆయమ్మిని అయితమ్మ కొదలాలని అనుకుంటావుండారు"

అసలు విషయం చెప్పాడు ఉత్తన్న.

"సరే. అందుకు గురవయ్య ఒప్పుకున్నాడా? " ప్రశ్నించాడొక వ్యక్తి.

"ఏమబ్బా. ఆయప్ప వొప్పుకోకంటే ఈ మద్దిస్తం యెట్ల జరగతాది? " తిరుగు ప్రశ్న వేశాడు ఉత్తన్న.

"ఆ మాట పంచాయతీలో అందరి ముందర చెప్పాల గదా!" గుండెకాయలోడన్నాడు.

"యిప్పుడేమైపోయిండాది. ఈడనే వుండాడు గదా, ఆయప్పనూ వొగ మాట అడగండీ? " మరొకతనన్నాడు.

"మీరే అడగండబ్బా!" అన్నాడు గుండెకాయ

లోడు.

"ఏమి గురవయ్యా. ఇది నిజమేనా?" ఉత్తన్న అడిగాడు.

"అవునన్నా. మాకు మొక్కుబడి వుండాది. ఊర్లో ఉండే పెద్దోళ్లు మొక్కు చెల్లించకపోతే ఊరికి అరిష్టంరా. మీకు మంచిది గాదు. బిడ్డెను ముద్దరేసి వదలాల్సిందే అంట్రి. ఇంక ఆ కార్యం జరిపించాల. అందుకని మద్దిస్తం పెట్టించిరి పెద్దమడుసులు" చెప్పడం ముగించాడు గురవయ్యా.

"అట్లయితే యింక వెనుకాడగూడదు గదా. అమ్మోరి మొక్కు తీర్చకుంటే కలరా వచ్చినా రావచ్చు పెద్దమ్మోరన్నా రావచ్చు దూము తగిల్నా తగలచ్చు ఊరు ఊరే ఊడ్చకపోవచ్చు" మరో పెద్దమనిషి అన్నాడు.

"ఉగాది పోయిన మూడో దినం ఈ కార్యం జరిపించేద్దామబ్బా" ముహూర్తం చెప్పాడు ఉత్తన్న.

"అట్లేగానీ. ఆ మేరకు... కప్పుదిగదోసిండే బసివిదాని గుడిసెను కప్పించి సుభ్రం చేయాలగదా"

చేయాల్సిన పనిని గుర్తుచేశాడు గుండెకాయలోడు.

"ముందు ఆ పని చేయిద్దాంలే! ఏమబ్బా పలకలోళ్ళు, కొమ్ములోళ్ళు ఆ దినం యాడికీ పోకండి. అందరూ యిండ్లకాన్నే వుండండి"

ఆర్డరేశాడు ఉత్తన్న.

దానికి అందరూ ఏకకంఠంతో అంగీకరించారు. వాళ్ళ అంగీకార శబ్దాలతో ఆ ప్రాంతం ప్రతిధ్వనించింది.

* * *

అది ఉగాది పోయిన మరునాడు...

ఆ ముందురోజు గుమ్మాలకు కట్టిన మామిడి ఆకుల తోరణాలు వాడిపోయి కనిపిస్తున్నాయి.

అయిదేళ్ళ క్రితం బసివిగా మార్చబడిన వేముల వెంకటస్వామి కూతురు లచ్చిమి ఊర్లో దిగింది. ఆమెతోబాటు మరికొందరు మాతమ్మలూ వచ్చారు. కులపెద్ద ఉత్తన్న లచ్చిమికి ఆమె చేయాల్సిన పనులను చెప్పేశాడు. ఉత్తన్న చెప్పిన ప్రకారం లచ్చిమి పల్లె చివరన కొత్తగా చొప్పతో కప్పు వేసిన బసివిదాని గుడిసెను శుభ్రం చేసింది. మరికొందరు మాతమ్మలు పశువుల పేడ తెచ్చి గుడిసెలోను, గుడిసె ముందర అలికి ముగ్గులు పెట్టారు. గుమ్మానికి మామిడాకుల తోరణాలు కట్టారు. కొందరు యువకులు వెళ్ళి ఐతమ్మ గుడిచుట్టూ కంపచెట్లు కొట్టి, రాయిరప్పలు తీసివేసి శుభ్రం చేశారు.

ఒక పెద్ద బిగరచెట్టు మొదలు కానుకొని గజమెత్తులో, కట్రాళ్ళ గోడల పైన రెండు గజాల వెడల్పు, పొడవు ఉన్న బండ పరచబడి వుంది. చూడ్డానికి అదొక చిన్న ఇల్లులా కనిపిస్తోంది. దాంట్లో ఎడమవైపునున్న గోడ మధ్యలో ఒక చిన్న దీగూడు. అందులో ఒక చిన్న మట్టి దీపాంతి. దానికవతల తూర్పును చూస్తున్న రీతిలో జానెడు పొడవున్న ఒక నున్నటి నల్లరాయి నిలబెట్టబడి వుంది. అదే అయితమ్మగుడి. ఆ నల్లరాయే అయితమ్మ దేవత. దానికెదురుగా మరో చిన్న ఎదురురాయి నిలబెట్టబడివుంది. పోతలయ్యా అనే బడే ఆ ఎదుర్రాతి కిరువైపులా మూరెడు పొడవున్న రెండు ఇనుపశూలాలు గుచ్చబడి వున్నాయి.

పోయిన యువకులు గుడిలో వున్న సాలెగూళ్ళను తొలగించారు. దీగూడిని, దిగూట్లో వున్న దీపాంతిని శుభ్రం చేశారు. ఐతమ్మ శిలను, ఎదురు రాయి పోతలయ్యాను నీళ్ళతో కడిగారు. వాటికి పసుపుకుంకాలు పెట్టారు. శూలాలను కడిగి వాటికీ పసుపు కుంకాలు బొట్లుపెట్టి, వాటి చివరన నిమ్మకాయలు గుచ్చారు. పక్కనే వున్న వేపచెట్టెక్కి వేపమండలు కోసి గుడి పక్కనే కుప్పపెట్టారు. వాటిలో కొన్ని వేపమండలు తీసుకుని చిన్న తోరణం కట్టి దాన్ని గుడి ముంగిట అడ్డంగా కట్టారు. ఆ తర్వాత వచ్చేశారు.

వాళ్ళు వచ్చేసిన కొంతసేపటికి పల్లెలో డప్పులు మ్రోగడం ప్రారంభమైంది. గుండెకా

యలోడు, బాలయ్యా మరికొందరు పీకల్దాకా కల్లుదాగి అదేపనిగా పలకలు వాయిస్తున్నారు. మరో యిద్దరు సాగదీసిన `S' ఆకారంలో వున్న కొమ్ముల్ని ఊదుతున్నారు.

ఆ పలకల శబ్దంతో, కొమ్ముల అరుపుల్తో చెవులు చిల్లులు పడిపోతున్నాయి.

బద్దెగురవయ్య యింట్లో సందడి ప్రారంభమైంది. ఒకవైపు బద్దె గురవయ్య భార్య ఏడుస్తోంది. గురవయ్యకు దుఃఖం ముంచుకొస్తున్నా ఆపుకుంటున్నాడు.

"కన్న కష్టంబడి పద్దైదేండ్లు సాగి సంతరించిన బిడ్డెను కన్నోనిపాలు జెయ్యాల. సేతులారా బిడ్డెను పల్లోళ్ళపరం జేయాల. సర్వనాశనం జెయ్యాల..." తీవ్రంగా ఆలోచిస్తూ కన్నీరు పెట్టుకుంటోంది యింట్లో ఒక మూల కూర్చొని ఉన్న గురవయ్య భార్య.

"ఆచారం కాదనే దానికిలే. పెద్దోళ్ళు నిర్ణయించినారు. అసలు కాదనేదానికే లేదే. ఎప్పుడో మా తాత ముత్తాతల కాలం నుంచీ మా వంశంలో తరానికొకర్ని బసివిని చేస్తా వచ్చినారంట. అది అయితమ్మకు మొక్కుబడి అంట. నాకు సంతుగలిగి, పిల్లోళ్ళు పెద్దోళ్ళయితావున్నా నాకు ఆ మొక్కుబడే గుర్తుకు రాలే. పూరా మర్చిపోయింటి. కానీ ఆర్నెల్లకు ముందు వొగదినం బిడ్డె వున్నిట్లుండి తెలివి తప్పొయ్యి పడిపాయ. వళ్ళు సోదీనంలో లేకుండా అయిపాయ. బానలోళ్ళ బాలయ్యను పిల్చికొచ్చి మంతరిస్తిమి. ఆహా గుణం కనిపిచ్చలా... కాడాకు శాస్త్రిరి దెగ్గిరికి బొయ్యి శాస్తరం జూపిస్తే, అమ్మోరికి మొక్కుండాదనె. ఆ మొక్కు తీర్చెయ్ బాగయితాదనె. ఊర్లో పెద్దోళ్ళు అట్టే అంట్రి. కాబట్టి అయితమ్మకు మొక్కుకుంటిమి. బిడ్డె పైకి లేశ. సూస్తివా అయితమ్మ సత్తెమ్మంట్రి పెద్దోళ్ళు. నాలుగు దినాలుగా యింట్లో తిండి గింజల్లేక, సరయిన తిండిలే. అందుకే నీరసం వచ్చి పడిపోయింటింది లేబ్బా అంట్రి కొందరు. కానీ పల్లోళ్ళు వప్పుకోలే. యిది అయితమ్మ మహెత్తమే. వచ్చే ఉగాదికి బుడ్డమ్మను బసివిని చెయ్యాల్సిందే. లేకుంటే ఊరికి అరిష్టమంట్రి. లేకుంటే ఊర్లోనే వుండనీయమంట్రి. అంతేగాదు. పలకలు కొట్టినప్పుడు ఏ గాలో వచ్చి ఊగినా అయితమ్మొచ్చింది. ఈ బిడ్డెను బసివిని జెయ్యండంటారు. లేదా వళ్లు బాగ లేకపోతే, నీ బిడ్డెను నువ్వే కాపాడుకో, బసివిగా వదల్తాము. మా బిడ్డె బతికుంటే చాలు అంటూ దేవతకు మొక్కుకుంటూ వుంట్రి. వొగతూరి వొగబిడ్డెను దేవతల కొదిలేస్తే యింక పతి తరంలోను వొగ బిడ్డను దేవతలకొదిలేసే ఆశారంగా మారిపోతావుండె. ఇట్ల అదే ఆచారం శాస్వితమై కూసుంటా వుండె. పల్లెలో వోళ్లు, ఊర్లో వోళ్లు ఉల్లాగా వచ్చే ఆడదాని పొందు కోసరం ఆశారం నిలబెట్టి నీళ్లు పోసి పోషిస్తా వుంట్రి. అట్లా ఆశారానికి నా బిడ్డె కూడా బల్తైపోతావుండాదే..."

పరిపరివిధాల ఆలోచించసాగాడు గురవయ్య.

"ఏమిరా గురవా... పొద్దుకల్లా దేవళం కాడికి పోదాం రా. ఊర్లో తొందరిస్తా వుండారు" అంటూ హెచ్చరించారు కొందరు.

ఇంట్లో ఆలగోలగా ఉంది. తల్లిని పట్టుకొని బిడ్డ, బిడ్డను పట్టుకొని తల్లి భోరున ఏడ్చుకుంటున్నారు. బుడ్డమ్మ తమ్ముళ్ళు, చెల్లెళ్లు "అక్కా! రేపట్నుంచీ మాకు దూరమైపోతావా?" అంటూ కడుపు చెరువయ్యేలా ఏడుస్తున్నారు.

బుడ్డమ్మయితే రెండు రోజులుగా ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పోయింది. "అమ్మా! అమ్మా! నన్ను బసివిని సెయ్యొద్దు. వద్దమ్మా. నా కిష్టం లేదమ్మా" అంటూ మాటి మాటికీ కలవరిస్తున్నట్టుగా, పిచ్చిదానిలా తనలో తనే అనుకుంటోంది.

"నాకు ముద్దరేసి వదిలేసిన బసివిది అనే పేరొద్దయ్యా. నాకు పెండ్లి పెటాకులూ ఏమీ వద్దయ్యా. బతికినంత కాలం మీ దగ్గిరే ఉండిపోతా. కూలీ నాలీ చేసయినా సరే మిమ్మల్ని సాకతా. వద్దయ్యా. నన్ను మాత

మ్మను చెయ్యొద్దయ్య" అంటూ తనకు తానే మాట్లాడుకుంటోంది. ఎవరు వింటున్నారో, తను ఎవరికి చెబుతోందో గమనించే స్థితిలో ఆమె లేదు. ఆమె మాటలు ఆ తల్లిదండ్రుల గుండెలకు బల్లాలై గుచ్చుకుంటున్నాయి. అయినా ఆచారాన్నెదిరించే ధైర్యం వాళ్లకు లేక పోయింది. ఇటు తల్లిదండ్రులను, అటు ఊర్లో వాళ్లను ఎదిరించే ధైర్యం బుడ్డమ్మకూ లేకపోయింది. దాంతో ఆ అనాచారం నిరాఘాటంగా జరిగిపోసాగింది.

"ఎంత యేడిస్తే మాత్రం ఆచారం ఆపే దానికుండాదా. ఎట్ల జరిగేది అట్ల జరగాల్సిందే. ఇదంతా దేవుడి యత్నం. ఆ యమ్మికట్ల రాసి పెట్టిండాది. కొంచెం ధైర్యంగా వుండండి"

ధైర్యం చెప్పాడు ఉత్తన్న.

అతని మాటల్తో కాస్త ఊరట చెందాడు గురవయ్య.

"సరే. సర్పంచింటినించీ పసుపు చీర, పసుపు రయికా వచ్చిండాదా? "



లడిగాడు ఉత్తన్న.

"వచ్చిండాయి. వాటితో బాటు పూలమాల కూడా పంపించిండారు" అన్నాడు గురవయ్య.

"అయితే యింకేం! పాపను సిద్ధం చేయండి" తొందరించాడు. పలకలు, కొమ్ములు గురవయ్య యింటి ముందరికొచ్చి గుమ్మెత్తిస్తున్నాయి. బసివి లచ్చిమి, తోటి బసివినులతో వచ్చి, సర్పంచి పంపిన పసుపు బట్టలు తీసుకుని బుడ్డమ్మను బయలుదేరదీసింది. మిగిలిన ఆడంగులు ఆమె వెంట బయలుదేరారు. వాద్యాల హోరు మిన్నుముట్టింది.

వాద్యాలు ముందు... ఆడవాళ్లు వెనక.

ఊరు వింతగా చూస్తోంది. పల్లె ఆనందంలో మునిగిపోయింది.

ఊరేగింపుగా బుడ్డమ్మను రచ్చబండ మధ్యనున్న రావిచెట్టు కాడికి తీసుకువెళ్లారు. ఆ రావిచెట్టు కిందనే వీధి గంగమ్మ, సత్తెరాయి వున్నాయి.

వాటిని కడిగి పసుపు పూసి కుంకుమ బొట్లు పెట్టి వేపమండలతో అలంకరించారు. ఆ తర్వాత గురవయ్య భార్య పొంతన కాగిన నీళ్లు ఒక బకెట్‌లో తెచ్చి పెట్టింది. ఆడవాళ్లు చీర తెరపట్టారు.

బసిమి లచ్చిమి అందరి ముందర రచ్చబండ కింద బుడ్డమ్మను కూర్చోబెట్టి వళ్లంతా పసుపు రుద్దింది. తోటి బసివి రాండ్రతో ఆమెకు స్నానం చేయించింది. చీర తెర వెనక తడి బట్టలు విప్పి సర్పంచి పంపిన పసుపు చీర కట్టించి జాకెట్టు తొడిగింది లచ్చిమి. తల ఆర్చి, జడవేసి పూలు పెట్టారు బసివినులు. కళ్లకు కాటుక పెట్టారు. తలకు బాసికం కట్టారు. కాళ్లకు పారాణి అద్దారు. లచ్చిమి చేతులకు కొత్త గాజులు తొడిగింది. ఆ తర్వాత పూలమాల వేసి కాటుకతో చెంపన దిష్టి చుక్క పెట్టింది. బుడ్డమ్మ పెళ్లినాటి కళతో అందం గా, ముగ్ధమనోహరంగా కనిపిస్తోంది.

వాద్యాలు ముందు...
ఆడవాళ్లు వెనక.
ఊరు వింతగా
చూస్తోంది.
పల్లె ఆనందంలో
మునిగిపోయింది.
ఊరేగింపుగా
బుడ్డమ్మను రచ్చబండ
మధ్యనున్న రావిచెట్టు
కాడికి
తీసుకువెళ్లారు

సత్తెమ్మకు, వీధి గంగమ్మకు మొక్కించి బుడ్డమ్మను తీసుకుని అక్కడి నుంచీ అటే ఐతమ్మ గుడి దగ్గరకు నడిచారు అందరు.

ఊర్లో యువకులు, పల్లె కుర్రాళ్లు ఉత్సాహంగా చూస్తున్నారు. కొందరు ఈలలు వేస్తూ డప్పుల ముందు నృత్యం చేయసాగారు. వాళ్ల ఉత్సాహం చూసేసరికి బుడ్డమ్మ తల్లికి వాళ్లు పశువు రక్తమాంసాల కోసం కాచుక్కూచున్న తోడేళ్లలా అనిపించారు. అందరూ గుడిని సమీపించారు. ఇంతలో పులిచెర్ల నుంచీ ఒకతను పెట్రోమాక్స్ లైటు వెలిగించుకొని నెత్తిన పెట్టుకుని వచ్చాడు.

"లైటు యాడబెట్టేది ఉత్తన్న మామా" అంటూ కేకేశాడతను.

"ఆ ప్రక్క కానగచెట్టు కొమ్మకు వేలాడదీయరా" ఆ గుడికి కొంత దూరంలో ఉన్న కానగ చెట్టును చూపిస్తూ అన్నాడు ఉత్తన్న. ఆ వ్యక్తి ఆ పనిలో నిమగ్నమైపోయాడు.

కుల పెద్ద ఉత్తన్న బుడ్డమ్మను కూర్చోబెట్టి, అందర్నీ కూర్చోమన్నాడు. అందరూ అక్కడే ఉన్న రాళ్లపైనా, నేలపైనా కూర్చున్నారు. పెట్రోమాక్స్ లైటు దేదీప్యమానంగా వెలిగిపోతోంది.

వాద్యాలహోరు ఆగింది. వానాగాలీ వెలసినట్లయింది. ఉత్తన్న తంతు ప్రారంభించాడు.

లచ్చిమి తన బృందాన్ని తీసుకుని వెళ్లి, అక్కడికి కొంత దూరంలో చిదుగులు పేర్చి మంట పెట్టింది. కులపెద్ద యిచ్చిన ఐతమ్మ తల గుర్తువున్న అచ్చును ఆ మంటల్లో వేసి కాల్చసాగింది లచ్చిమి.

బుడ్డమ్మను గుడి ముందర కూర్చోబెట్టాడు ఉత్తన్న. ఆమె చేతుల్లో పసుపుతాడు చుట్టిన

కొబ్బరి బొండం పెట్టాడు. ఒక తట్టలో అక్షింతలు పెట్టాడు. ఆ తర్వాత గంగమ్మకు కొబ్బరికాయ కొట్టి, కర్పూరం హారతి పట్టాడు. ఆ హారతిని బుడ్డమ్మ ముందుకు తీసుకువచ్చి పొగను ఆమె ముఖం వైపు చేత్తో ఒక్కసారి విసరి నేలపైన పెట్టాడు. ఆ తర్వాత బుడ్డమ్మను ఆ బిగర చెట్టు చుట్టూ మూడుసార్లు తిప్పించి కూర్చోబెట్టాడు. గంగమ్మ బండారు నొసటన అద్దాడు. ఇంతలో ఇద్దరు రెండు కల్లు ముంతలు తెచ్చి దేవతకు నైవేద్యం పెట్టారు. ఆమె తల్లిదండ్రుల్ని పిలిచి ఆమె పక్కన కూర్చోబెట్టారు. వాళ్ల చేతుల్లో ఆకూ వక్కా పెట్టి "మీ బిడ్డను అమ్మోరికిచ్చి పెండ్లి జేసి, ముద్దరేసే దానికి శలవా? " అంటూ అడిగాడు ఉత్తన్న.

"సామి శెలవ!" అన్నారిద్దరూ.

ఆ తాంబూలాన్ని చేతుల్తో ఎత్తి పట్టుకుని "ఏమయ్యా గ్రామస్థులూ, పెద్దలూ, పిల్లా జల్లా అందరూ వినండి. ఈ బద్దె గురవయ్య దంపతుల బిడ్డను దేవతకిచ్చి పెండ్లి చేసి ముద్దరేసేదానికి శెలవా? " అన్నాడు.

అందరూ ఒకేసారి "సామి శెలవ!!" అన్నారు.

ఆ తాంబూలం దేవత ముందరబెట్టి "వొసే బసివి లచ్చిమీ యాడ సస్తివే. ఇట్లరా...." అంటూ కేకేశాడు.

"ఆఁ... అన్నా, వస్తన్నా" అంటూ గట్టిగా అని అక్కడికి వెళ్లింది లచ్చిమి. మిగిలిన బసివినులు ఆమెననుసరించారు.

"రేయ్, వాద్యాలూ!" అరిచాడు.

పలకలు జజ్జనక జజ్జనక అంటూ ఒక్కసారిగా ఊపందుకున్నాయి - పిడుగులు పడినట్లుగా కొమ్ములు ఉరిమాయి.

పసుపు కొమ్ము కట్టి వున్న బొట్టిదారం బొండంను తీసి, దాన్ని లచ్చిమి చేతికిచ్చి 'బొట్టు కట్టవే' అన్నాడు.

ఒక బసివిని జడ ఎత్తి పట్టింది. లచ్చిమి ఆమె మెడలో పసుపుదారం కట్టేసింది.

"ఇంకేం,ముద్దర రెడీనా," అన్నాడు ఉత్తన్న.

"ఆఁ... కాగతా వుండాది" అంది లచ్చిమి.

"దాన్ని గోరెచ్చగా కంటే కొంచెం వేడిగా వుండేట్లు సూడు. అట్లని ఎక్కువ వేడి పెట్టొద్దు. వళ్లు కాల్తుంది. రంగు సిద్ధమేనా? ' ' అన్నాడు.

"పచ్చబొట్టు పొడిచేటప్పుడు వాడతావుండ్లా. ఆ రంగు ఒక సిప్పలో యేసకొచ్చినా" అంది లచ్చిమి.

"సరే. దాంట్లో అచ్చు అద్ది కుడిరెట్టకు, సరిగ్గా డాకట్రు సూదేస్తా వుండ్లా, ఆడ ముద్దరేసేయాలి. భద్రం కాలకూడదు"

"అన్నా. నాకు సెప్పాల్నా నేనేయించుకోలా... యెట్ల, సీమ కుట్టినట్టుంటుందంతే" అంది లచ్చిమి.

"సరే, తీసుకురా"

లచ్చిమి వెళ్లింది. మంటలో కాలిన అచ్చు పిడి పట్టుకొని పైకి తీసి చూసింది. అచ్చు ఎర్రగా కాగింది. వేడికి మురికిపోయి దాని కున్న గంగమ్మ తల స్పష్టంగా కనిపించింది.

దాన్ని రంగు చిప్పలో అద్దుతూ చల్లార్చసాగింది. అది సుయ్యమని శబ్దం చేస్తూ పొగలు గక్కసాగింది. ఎడమ చేతి చూపుడు వేలితో దాన్ని తాకి వేడిని ఒకసారి పరిశీలించి దాన్ని తీసుకెళ్లింది.

ఇద్దరు బసివినులు బుడ్డమ్మ కుడిరెట్టను పట్టుకున్నారు. మరో బసివిని ఆమె జాకెట్టును పైకి లాగింది. అంతే లచ్చిమి అచ్చు పిడి పట్టుకొని ఒక్కసారి ఆమె భుజానికి గుద్ది తీసేసింది.

"అమ్మా..." అంది బుడ్డమ్మ.

"ఓర్చుకో బిడ్డా" అన్నారాడవాళ్ళు.

ఆమె భుజంపైన రంగంతా కలిసిపోయి రూపాయి బిళ్ళంత వెడల్పుతో ముద్రపడింది.

"రంగంతా కలిసిపోయినట్లనిపిస్తా వుండాదే" ఒక బసివిని అంది.

"రెండు దినాల తర్వాత పుండు ఆరుతుంది. అది ఆరిన తర్వాత ముద్దర పచ్చబొట్టు మాదిర్తో బాగా కనిపిస్తాది" అంది లచ్చిమి.

"యింగేమబ్బా. ఈ కార్యమైపోయిండాది. ఇంక కన్నెరికం జేసే సర్పంచి ముసలయ్యకి కబురంపి, ఆయన్ను మేళతాళాలతో తీసక రండి" ఆజ్ఞాపించాడు ఉత్తన్న.

సరేనని యిద్దరు యువకులు చిచ్చిలవారిపల్లెకు పరిగెత్తారు.

"యింకేమిరా... కల్లు యాడా? " అరిచాడు గుండెకాయలోడు. కల్లు కడవ తెచ్చి అక్కడ పెట్టాడు బానతోళ్ళ బాలయ్య.

గుడి ముందరున్న ఒక కల్లు ముంతలోని కల్లును కాస్తా అమ్మోరి ముందర పోసి మిగిలింది బుడ్డమ్మ చేత తాగించాడు. ఆ తర్వాత ముంత లచ్చిమికిచ్చి మీరు తాగండన్నాడు.

బుడ్డమ్మను పైకిలేపి నడుముకు వేపమండలు చుట్టారు బసివినులు. మెడలోను వేప మండల హారం వేశారు.

ఆ పైన ఆడా, మగా, పిల్లోళ్ళతో సహా కడవలోని కల్లును పంచుకుని తాగారు.

కల్లు మత్తు తల కెక్కడంతో 'అప్పలప్పల' అంటూ కిందా మీదా పడుతూనే గుండెకాయలోడు డప్పు కొట్టసాగాడు. మిగిలిన వాద్యగాళ్ళు అతనితో శ్రుతి కలిపారు. మరిద్దరి వ్యక్తుల మూతులకు కొమ్ములు మొలిచాయి. అవి 'భూం' అంటూ ఉరమసాగాయి.

పాత బసివి లచ్చిమి కొత్త బసివిని బుడ్డమ్మ చేత పలకల దరువుల కనుగుణంగా ఎగిరించింది. తానూ చిందులు తొక్కింది. మిగిలిన బసివినులు వలయాకారంగా నిలబడి 'చిందు' లేశారు.

అలా రాత్రి పదివరకూ ఎగిరి వేడుక చేసుకున్న పల్లె ప్రజలు బుడ్డమ్మను చివరి గుడిసెలో ఒంటరిగా వదిలిపెట్టి వాళ్ళ వాళ్ళ యిండ్లకు వెళ్లిపోయారు. ఒక అనాచారాన్ని నిర్విఘ్నంగా కొన సాగించి నిశ్చింతగా వెళ్ళి నిద్రపోయారు.

అందరితోబాటు పీకల్దాకా కల్లు తాగి ఉన్న ఉత్తన్న "రేయ్ గురవా! యింక మీరు మీ బిడ్డను మర్చిపోండి. ఈ క్షణంనుంచీ మీరింక ఆ గుడిసెకాడికి పోగూడదు. మీ బిడ్డ యిప్పుడు దేవత ప్రసాదం. ఆయమ్మ ప్రతి రూపం..." అని హితబోధ చేసి మరీ వెళ్ళిపోయాడు.

బుడ్డమ్మ బసివిదాని గుడిసె గుమ్మంలోనే కూలబడిపోయి ఏడవసాగింది.

గురవయ్య దంపతులు ఏడ్చుకుంటూ తమ యింటికి వెళ్ళిపోయారు. చిచ్చిలవారిపల్లెకు వెళ్ళినవాళ్ళు ముసలయ్యకు పసుపుబట్టలు తొడిగించారు. పూలమాలను మెడలో వేసి, అతని సంకల్లో సెంటు కొట్టి, అతన్ని ఊరేగింపుగా వాద్యాల మధ్య పల్లెకు తీసుకు రాసాగారు.

పల్లె ప్రజలు కొందరు వీధుల్లోకొచ్చి చూడసాగారు. కొందరు ఆ ఊరేగింపులో కలిసిపోయారు. మేళతాళాలు ముందు, ఆ వెనక ముసలయ్య, అతని వెంట పల్లెప్రజలు నడుస్తున్నారు. వాద్యాల ముందు అక్కడక్కడా ఆగి బసివినులు 'చిందు' తొక్కి అందరినీ ఆనందింపచేస్తున్నారు. ఆ ఊరేగింపులో ఎక్కువమంది యువకులే ఉన్నారు. వాళ్ళల్లో ఎప్పుడెప్పుడు కన్నెరికం పూర్తవుతుందా, ఆ మరునాటినుంచీ బసివి మన వశమౌతుందా అన్న ఉత్సాహం ఉరకలేస్తోంది.

ఆకాశం చంద్రుని వెన్నెల కిరీటాన్ని ఎప్పుడో ధరించేసింది. ముసలయ్యను తీసుకొని ఊరేగింపు బసివిదాని గుడిసెవైపు సాగిపోయింది.



రెండు రోజుల తర్వాత...

ఉదయాన కాలకృత్యాలు తీర్చుకోవడం కోసం చింతలతోపులో అడుగు పెట్టింది

బాలమ్మ. రెండు కానగచెట్లు దాటుకొని అలా వెళ్ళిందో లేదో అక్కడి దృశ్యం చూసి అలాగే నిలబడిపోయింది. భయంతో ఆమె శరీరం మెల్లగా ఒక్క క్షణం వణికిపోయింది. వెంటనే చల్లబడిపోయినట్లయింది.

ఎదురుగా ఒక చింతచెట్టు కొమ్మకు వ్రేలాడుతూ ఒక శవం... గుడ్లు తేలిపోయి, నాలుక బయటకు వచ్చి భయంకరంగా కనిపిస్తున్న శవం. ఒక్కసారి కెవ్వున కేకవేసింది. ఆ చెట్ల లోనుంచీ గబగబా పరుగెత్తుకుంటూ బయటకు వచ్చి గట్టిగా అరవసాగింది.

"ఒరే నాయనా... చింతలతోపులో ఎవరో ఉరిబోసుకున్నారు. ఒరే రండ్రా" అంటూ అరుస్తూ ఊర్రివైపు పరిగెత్తసాగింది. ఆమె అరుపులు విని ఊరి ప్రజలు గుమికూడారు. పల్లెవాసులు వాళ్ళతో కలిశారు.

క్షణాల్లో ఆ వార్తతో ఊరూ పల్లె అట్టుడికిపోయాయి. కొందరు యువకులు చింతల తోపు వైపుకు పరిగెత్తారు.

మిగిలిన వాళ్ళూ నిదానంగా అక్కడికి చేరుకున్నారు. ఒకరిద్దరు చెట్టెక్కి ఉరితాడును కోసి శవాన్ని కిందకు దించారు.

అది బుడ్డమ్మ శవం!

రెండురోజుల క్రితం కట్టిన పసుపు బట్టలు అలాగే వున్నాయి. కాళ్ళపారాణి యింకా ఆరినట్లే లేదు. పాత బసివి కట్టిన కొత్త పసుపుతాడు యింకా నలిగినట్లే లేదు. కానీ ఆమె శరీరం మాత్రం ఏనుగు తొండానికి చిక్కిన తామరపువ్వులా వుంది. వాడిపోయిన చిగురుటాకులా ఉంది.

ఆ వార్త తెలుసుకుని గురవయ్య దంపతులు ఏడ్చుకుంటూ అక్కడికి చేరుకున్నారు.

అతని భార్య, గుండెలు బాదుకుంటూ కూతురి శవంపైన బడి ఏడవసాగింది. గుండె పగిలేలా ఏడవసాగింది. కడుపు చెరువయ్యేలా శోకిస్తోంది.

అభం శుభం తెలీని వయసు.

ఒకవేళ పెండ్లయివుంటే భర్త ప్రేమానురాగాలతో సంసార సుఖాన్ని చవిచూడాల్సిన వయసు. కానీ నిండా పదహారేండ్లు కూడా లేని ఆమెను బసివిని చేసిన రాత్రి, నలభై ఏండ్ల ముసలయ్య కన్నెరికం చేశాడు.

మదించిన ఆబోతులా మీదపడ్డాడు.

తెల్లారేసరికి ఆమె సొమ్మసిల్లిపోయింది. అలాగే పడి నిద్రపోయింది. ఏ తొమ్మిదికో ఆమె తల్లి అన్నం తెచ్చి లేపిందాకా శరీరం స్వాధీనంలోనే లేదు.

ముక్కుపచ్చలారని ఆ అమ్మాయిని ఆ స్థితిలో చూసిన తల్లిగుండె తరుక్కుపోయింది. కూతుర్ని వడిలోకి తీసుకుని భోరున ఏడ్చేసింది. మొదట్నుంచీ కూతుర్ని బసివిని చేయడం ఆమెకిష్టం లేదు.

బుడ్డమ్మ పిచ్చిగా తల్లివైపు చూసింది. కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.

అలా ఎంతసేపు ఏడ్చుకున్నారో వాళ్ళకే తెలీదు. చివరికి తల్లే గబగబా అంత బొగ్గుపిండి తీసుకుని కూతురికి పండ్లుతోమి నోరూ ముఖమూ కడిగింది. అన్నంగిన్నె చేతుల్లోకి తీసుకుని అన్నం తినిపించసాగింది.

"తిను తల్లీ. ఈ దినంతో మాకూ నీకూ రుణబంధం తెగిపోతుంది. ఇంకెప్పుడు నా చేతి కూడు తింటావో తల్లీ? పాపా తిను, నా బంగారు తల్లీ తిను. నిన్నటిదాకా నా బిడ్డవి. ఈరోజుతో ఈ ఊరోళ్లందరికీ..."

ఆపైన మాట్లాడలేకపోయింది. బుడ్డమ్మ పిచ్చి చూపులు చూస్తూనే మింగలేక మింగింది.

అలా అన్నం తినిపించి వచ్చేసింది గురవయ్య భార్య.

అలాగే ఆ మధ్యాహ్నము, ఆనాటి రాత్రీ అన్నం తీసుకెళ్ళి పెట్టింది.

ఆరోజు రాత్రి ఊర్లో యువకులు, కళేబరం చుట్టూ మూగే రాబందులైపోయారు.

ఆ మరుసటి నుంచీ పల్లెవాళ్ళు...

ఆ బాధ భరించలేకపోయింది. అంతే తెల్లారేసరికి.... ఇలా శవమైపోయింది.

గురవయ్య కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నాడు. గురవయ్య భార్య శాపనార్థాలు పెడుతూనే ఉంది.

"నా బిడ్డెను వద్దన్నా మారమ్మను జేసిరి. దాని బతుకు బండల్జేసిరి. దాన్ని పీనిగిని జేసిరి. వోళ్ళ నెత్తక పొయ్యి బచ్చనకుంట్లో, నా కూతురితో బాటుగా గుంత తవ్వి పూడ్చా వోళ్ళ ఆశారాలు కాలి బూడిదై బుగ్గిగానీ..."

ఆమె నోటికి అడ్డేలేకుండా అయిపోయింది. ఏడుస్తూనే వుంది. తిడుతూనే వుంది.

"సరే యింక ఎంతసేపేడ్చినా పోయింది తిరిగొస్తుందా? "

"బసివిగా మారిపోయి అడిగినోనికంతా కొంగేసి, కానా కష్టం బతుకు బతికే కంటే యిట్ల పోయిందే మేలు"

•"అన్నెం పున్నెం ఎరగని బిడ్డె. ఆశారం పేరుతో ప్రాణం తీసేసిరి"

"ఏమి ఆశారాలో, ఏమి నాశినమో"

అయినా ఈ వెదవల కన్నా బుద్ధుండద్దా"

రకరకాలుగా అనుకోసాగారు.

"ఇంకెంతసేపు పీనిగిని పెట్టుకుంటారుగానీ ఎత్తుండబ్బా పల్లెకు"

"పల్లెకెత్తకపోయినా మాత్రం చేసేదేముం డాది. పక్కనేగదా బచ్చనగుంట. అన్నే గుంత తొగి పూడ్చేస్తే సరిపాయ"

"సరే, జరిగేటివి సూడండి"

ఎవరికి తోచిన విధంగా వాళ్ళు మాట్లాడు తున్నారు.

కొందరు తెల్లగుడ్డ కోసం పరిగెత్తారు. ఇంకొందరు పాడె కొయ్యల కోసం పోతే, మరి కొందరు గుంత తవ్వను సిద్ధమైపోయారు. ఇంకొందరు పలకలు, కొమ్మలు సిద్ధం చేసుకో సాగారు.

గురవయ్య భార్య శవాన్ని యింటికి తీసుకు వెళ్ళాల్సిందేనని పట్టుబట్టింది. శవం పల్లెకు కదిలింది.

అక్కడంతా స్మశాన వైరాగ్యం, ఏడుపులు.

ఆరోజు పది గంటలకంతా ఖననానికి సిద్ధ మైపోయింది శవం.

కొందరు మోసుకెళ్ళి దింపుడుకళ్ళెం కానిచ్చి గుంత దగ్గర దించి శవాన్ని గుంతలో పెట్టి, ఆమె తల్లిని, తండ్రిని మట్టెయ్యమన్నారు. ఆ తర్వాత బసివి లచ్చిమిని మట్టెయ్యమన్నారు.

లచ్చిమి మట్టి చేతుల్లోకి తీసుకుని "అమ్మ ణ్ణీ! ఈ సేతుల్తో నీకు తానం చేయించి, పసు పు గుడ్డలు కట్టించి, బొట్టు కట్టి, ముద్దరేసి మూడు రోజులు కాలే. ఇప్పుడు యిదే చేతు ల్తో నీకు మట్టేసే అన్నేకారి దుర్గతి పట్టె. ఓ బిడ్డా నన్ను మన్నించు తల్లీ... ఈ ఆశారం కాలి బూడిదయ్యే వరకూ మన బతుకులింతే తల్లీ..." అంటూ ఏడ్చి ఏడ్చి మట్టి వేసింది. ఆ తర్వాత క్షణాల్లో మట్టితో కప్పేశారు.

* * *

ఇన్ని రోజులకు మళ్ళీ ఈ గుడిసె కొత్త పెళ్ళికూతురిలా అలంకరించబడుతోంది. పల్లెలో ఏ అమాయకురాలి జీవితానికో ఒక పాపిష్టిరాత రాయబడుతోంది.

ఎవరా బిడ్డె?

ఇప్పుడేం చేయాలి?

ఈ అనాచారం ఈ ఊర్లో ఇకమీదట జర గడానికి వీల్లేదు. అందుకోసమే గదా నేనీ ఊ రొచ్చింది!

ఇక ఈ అజ్ఞాతవాసం చాలించాల్సిందే.

తీవ్రంగా ఆలోచించసాగింది హసీనా.

గుండెనిండా బాధ! మనసు నిండా ఆలోచ నలు. బుర్ర తిరిగిపోతోంది. ఈ బాధ ఎవ రికైనా చెప్పుకుంటే బాగుండనిపించింది.

"అమ్మా హసీనా? ఏందమ్మా ఆలోచనల్లో బడిపోతివి? " పలుకరించింది ఓబులవ్వ.

"ఏం లేదవ్వా? " అంటూ ఆలోచనల పద్మ వ్యూహం నుంచీ బయటపడింది హసీనా. ఆమె కళ్లు బుడ్డమ్మ సంఘటన గుర్తు రావ డంతో చెమ్మగిల్లి ఉన్నాయి. ఒక్కసారి పైటతో కళ్లు వత్తుకుంది.

"ఇది మామూలేమ్మా. యిట్టా కష్టాలు నేను శ్యానా పడినా. ఇట్లాంటివెన్నో అనుభో గించీ అనుభోగించీ నా మొనుసు రాయి మాదిరైపోయిండాది. సరే యింక రేపట్నుం చీ నువ్వెవురో నేనెవరో. ఈ నాలుగు దినా లైనా మనం కలిసున్నాం. వెండిపోయిన యేట్లోకి తియ్యటి చెలమ మాదిర్తో నా జీవి

తంలోకి వచ్చినావు. నేస్తురాలవైపోతివి. నా కూతురు లాంటి దానివైపోతివి. అయినా నువ్వెవరో తెలుసుకోలేకుండానే మనం విడి పోతే, నాకు చచ్చేదాకా అది వెలితిగానే ఉంటుంది. ఈ ముసిలి మొప్పన ఆ బాధ ఎందుకు మిగల్చుతావు తల్లీ. ఇప్పటికైనా చెప్పు తల్లీ. నువ్వెవరు? ఎందుకిక్కడికొచ్చినావు? "

మళ్లీ అడిగింది ఓబులవ్వ.

హసీనా ఒక్క నిట్టూర్పు విడిచింది.

మళ్లీ కథ చెప్పడం ప్రారంభించింది.




మధ్యాహ్నం పదకొండు కావస్తోంది. గుండెకాయలోడు రాత్రెప్పుడో కప్పుకున్న దుప్పటి ఇంకా తియ్యనేలేదు.

కొట్టం ముందరున్న అరుగుమింద కుక్కర కూర్చొని, నోటినిండా తంబకర్ర నములుత్తా, మాటిమాటికీ 'తుపుక్ తుపుక్' మంటూ వీధి లోకి ఉమ్ముతున్నాడు. అతని పక్కనే బద్దెగు రవయ్య కూర్చోనున్నాడు.

'ఎమ్మామా! ఈ దినం ఎక్కడ పోలేదా? ' పలుకరించాడు గురవయ్య.

"యాడ బొయ్యేదిరా గురవా! మనం చేసే పనులేముండాయనీ సెంటు భూమిలే. శారదు నీళ్లూ లే. మేపేదానికి వొగ గొడ్డా గోదా!" అన్నాడు గుండెకాయలోడు.

"అదీ నిజమే. యింక మనం చేసే పనులే ముండాయి గనక"

"నువ్వేడా పోలేదా? "

"మీకు లేని పనులు నాకెక్కడినించీ వస్తాయి"

"ఈ ఊర్లో అందరి పరిస్థితీ అందేగదా. దినొమ్మ యాలకంత తినేది దుప్పట్లు కప్పు కొని ఈదిలో కూసుండేది" అన్నాడు గుండెకా యలోడు.

"ఏమయ్యా! లేసొస్తావా? ఆడనే అరుపులు జేస్తా కూసుంటావా? " లోపల్నుంచే అరిచింది ఆదెమ్మ.

"ఏమిరా ఈ బాశాలి. ఎప్పుడూ అరస్తానే ఉంటుంది" అని ఒక్క క్షణం నోట్లేనే గొణు క్కుని "ఏమే" అంటూ గట్టిగా అన్నాడు.

"ఇట్ల లేసిరా" కసిరినట్టు పిలిచింది.

"పోమామా పో. పోకపోతే, మా యక్క కొట్టేదిగా వుండాది" అంటూ అక్కడి నుంచి లేచి వెళ్లిపోయాడు గురవయ్య.

గుండెకాయలోడు పైకి లేచాడు. జారిపో తున్న దుప్పటిని యెగదోసుకుంటూ కొట్టం లోకి అడుగు పెట్టాడు.

మెల్లగా వెళ్లి పొయ్యి ముందు కూర్చు న్నాడు గుండెకాయలోడు.

"ఏమీ అదీ! ఏంది ఉడకతావుందే పొయ్యి మీంద" ఆతృతగా అడిగాడు.

"ఏముండాది. నువ్వు దెచ్చిపెట్టిండే నెల్లూరు సన్నబియ్యం ఉడకతా వుండాయి" ఎత్తిపొడుపుగా అంది.

"అబ్బబ్బ. ఎందుకే అట్ల ఈనిన గొడ్డుమా దిరి యిగలపడతావు? " కోపం తెచ్చుకుంటూ అన్నాడు.

"ఏంలేదులే నాయనా. సద్దకుర్రగానీ..." అనునయంగా చెప్పింది చినపాప.

"ఈ బతుక్కి అంబలి, గెంజీ తప్ప ఏంబొ క్కలాడతా వుండాం. ఆ సద్దలు గూడా ఇంక రెండు దినాల అంబలికే. ఆమింద ఏం తినేది? పిల్లోళ్లకేం బెట్టేది? " అంది ఆదెమ్మ.

"అట్లనా. అయితే యింకో పనిచేద్దాం..."

"ఏందో ఆ పని? "

"సద్దసేన్లు కోసేసినారు గదా! పెద్ద బిడ్డె ఊసలమ్మ కోసి రాంగానే ఆ సేన్లపైన పోదాం" అన్నాడు.

"సేన్లపైనెందుకు? " ప్రశ్నించింది.

"నేలపైన పరిగెన్నులు పడుంటాయి



గదా!"

"పరిగెన్నా!" ఆశ్చర్యంగా అంది.

"అదేనే. సేన్లు కోసేసి వారం పదిరో జులైపాయ. అవి కోసేటప్పుడు కింద పడిపోయింటాయి సూడు సద్దకంకులు. అవి ఏరుకోని తెచ్చుకుంటే కొన్నిదినాల బత్తేనికి సరిపోదాని? " వివరించాడతను.

"నిజమే! రైతులూరకే వుంటారా? "

"ఎవురు మాత్రం ఊరికే వుంటారు. అరుస్తారు. లేదా అగుమానంగా సాపిస్తారు. అవ న్నీ ఇని రోసం పడితే కడుపుకు జరగొద్దా? "

"యిన్ని దినాలకు వొగ పనికొచ్చే మాట జెప్పినావు. అట్లేగానీలే"

"ఉస్సుబ్బా" అనుకుంటూ వాళ్ల సంభాషణ

కడ్డు తగుల్తూ అప్పుడే అక్కడికి వచ్చింది కోటమ్మ. పొరకక్కట్టలమ్మకు రావడానికి పల్లె లంట పొద్దననంగా వెళ్లింది. అమ్మగా మిగి లిన పొరక కట్ట ల్ని కొట్టానికీ, చుట్టింటికీ మధ్యన పెట్టి, పెరట్లోకి వెళ్లి పొంతలో ఉన్న నీళ్లతో కాళ్లూ చేతు లూ కడుక్కుని ఇంట్లోకి అడుగుపెట్టింది.

"ఏమమ్మణ్ణీ! పొరకలేమన్నా అమ్ముడు పోయినాయా?" అడిగాడు గుండెకాయలోడు.

"ఏం. సారాయికి గావాల్నా?" సూటిగా ప్రశ్నించింది కోటమ్మ.

"అది గాదమ్మా. మరీ..." నీళ్ళు నమి లాడు.

"ఎన్నిసార్లు చెప్పినా అంతే నాయనా. నీకు సారాయి, కల్లు తప్పా యింకేమీ పట్టదు. సంసారమెట్ల గడస్తాదనే యోచనే లేదు"

"మీ నాయనే గాదమ్మా. ఈ ఊర్లో మొగో ళ్ళంతా ఇంతే. పొద్దస్తమానం దుప్పట్లు కప్పు కొని ఈదిలో అరుగులపైన కూసోని అరు వులు జేసేది. ఇంట్లో ఆడోళ్ళు కనా కష్టాలు బడి అంత ఉడకేస్తే తినేదీ. సంపాదిచ్చేది ఎత్తకపొయ్యి సారోయో, కల్లో తాగేసొచ్చేది. బరువు బాద్దెతలు లేనోళ్ళు. సిగ్గూ సెరమూ వదిలేసినోళ్లు" తిట్టడం ప్రారంభించింది ఆదెమ్మ.

"సరేలేయే. లోకానికి ఇరుద్ధంగా నేనొగన్నే అట్ల జెయ్యలేదుగానీ..." సమర్థించుకోబో యాడు గుండెకాయలోడు.

"సూడమ్మా. ఈ మొగోడు! యింగితం లేకుండా యెట్ల మాట్లాడతాడో" ముక్కు చీదు కుంది ఆదెమ్మ.

"సరేలేమ్మా. నాయన్నొగణ్ణి అన్నంత మాత్రాన మొగోళ్ళంతా మారిపోతారా ఏమ న్నానా! యేడ్చినంత మాత్రాన మన బాధలు తీరేనా ఆరేనా?" నట్టింట కూర్చుంటూ అంది కోటమ్మ.

"ఇంతకూ... యేమన్నా రెండు కాసులొచ్చి నాయా?" మళ్ళీ ఆశగా అడిగాడు గుండెకా యలోడు.

అవునంటే చాలు. ఆ రెండు కాసులూ లాక్కెళ్ళి అంత సారానో, కల్లో గొంతులో పోసుకుందామా అన్నంత ఆతృత ధ్వనిం చింది అతని మాటల్లో.

"ఇది ఊసలు దొరికే కాలం. యాడ సూసినా ఊసలు పెరిగే కాలం. అందరిండ్ల ల్లోనూ పొరకలుండాయి. మనం యెత్తకపో యేవి ఎవ్వరు కొంటారు?"

"సరేలేమ్మా. రెండు మూడు కట్టలన్నా అమ్మినావా?" తల్లి ప్రశ్నించింది.

"యాడిదమ్మా. అట్లదేసి రెడ్డిగారి పల్లె, కమ్మరపల్లె, కురప్పల్లె, బాలిరెడ్డిగారిపల్లె, వగ ల్లోళ్ళపల్లె తిరిగితే రెండంటే రెండే కట్టలు... అదీ కట్ట పావలా లెక్కన అమ్మినా" చెప్పింది కోటమ్మ.

"యాడ, కనీసం వొగ కల్లు ముంత గూడా రాదే" నోరు చప్పరిస్తూ అన్నాడు గుండెకాయ లోడు.

ఆ మాటతో ఆదెమ్మకు నెత్తికెక్కింది కోపం.

"చూడు. మనిషికి యేమన్నా యిదుం దేమో. వగిసు ఆడబిడ్డె. కాలిక్కాలు కొట్టుకొని ఊరూరు దిరిగి వొగకాసు పట్టుకొస్తే... కల్లు కావాలనిపిస్తా వుండాదా నీకు. నిన్నె త్తెయ్యనానీ నోర్ముయ్" గడ్డి పెట్టింది ఆదెమ్మ.

"అబ్బ. యిదెక్కడి మడిసిరా. నేని ప్పుడేమన్నా! తాగాలంటినా యేందీ" తనూ కోపం తెచ్చుకున్నాడు గుండెకాయలోడు.

"నాయనా. కొంచెం ఊరికే వుంటావా? అమ్మా యేంది నువ్వు గూడాను. ఆయప్ప సంగతి తెలిసిందేగదా. ఊరికే ఎందుకు మొర్సుకుంటావు?"

యిద్దరికీ సర్దిచెప్పింది కోటమ్మ.

"లేకుంటే సూడమ్మా. కాగులో బత్తెం అయి పోతా వుండాది. పైగా సంకురేత్తిరి పండగ వారమన్నా లేదు. వొగిసు పిలకాయలు. వళ్ళు కప్పుకుండేదానికన్నా అంత గుడ్డ పీలిక తీసిద్దామే అనిలే. రేపు పిల్లోళ్ళ కడుపులెట్ల నింపాలరా భగవంతుడా అనే బాధేలే" యాస్ట

పోయింది.

"మీరెందుకు కొట్లాడుకుంటారమ్మా. మనూరి సంతరేపాదోరమే గదా. కట్ట పొర కలు సంత కెత్తకపోతే రెండు కాసులు కండ్ల సూడచ్చు యిట్ల నూకలో, జొన్నలో ఏవో కొనుక్కోవచ్చు. అట్ల పండగా జరుపుకోవచ్చు" ధైర్యం చెప్పింది కోటమ్మ.

"పండగ నాటికన్నా సాంబువ్వ గాకపో యినా, అంత సంగటన్నా కడుపునిండా దొరి కితే సాల్లేమ్మా. మనట్టా వోళ్ళ కదే పండగ" అంది ఆదెమ్మ.

"వొరే గుండెకాయలోడా. గుండెకాయ లోడా..." అంటూ వీధిలో నుంచి ఎవరో పిలి చారు. దాంతో వాళ్ళ మాటలాగిపోయాయి.

"ఎవరబ్బా" అనుకుంటూ లేచి వీధిలోకొ చ్చాడతను.

ఎదురుగా కురప్పల్లె సిద్దప్ప.

"ఏమన్నో యిట్లొస్తివి? " ఏదో బేరం తగి లిందనుకుంటూ సంతోషంగా ప్రశ్నించాడు గుండెకాయలోడు.

సిద్దప్ప అతని రైతు. "కపిల తోల్తా వుంటే వున్నిట్టుండి బాన బొక్కపడె. తొండం తునిగి పాయ. అర్జంటుగా రావాలరో... కొరముట్లె త్తుకొని యెలబారు" అన్నాడు సిద్దప్ప.

"సరేన్నా... వస్తాలే" అంటూ కొరముట్ల తోలు సంచీ దించి, సంకకు తగిలించుకు న్నాడు. అక్కడే కొట్టంలో ఒక మూలనున్న పాతబడిపోయి ఉన్న తోలు చెప్పులు తొడు క్కున్నాడు. పైగుడ్డ తలకు చుట్టుకున్నాడు.

"ఏమే. మన రైతొచ్చిండాడు. అట్ల బొయ్యొ స్తా. అంత లోపల మీరు అట్ల పరిగెన్నుకన్నా పొయ్యిరండి" అంటూ కేకేశాడు.

"యిద్దో. ఎట్లా పోతావుండావుగానీ, మేర గింజలన్నా అన్ని అడుగు. వచ్చేటప్పుడు అన్ని పచ్చి మిరక్కాయలడిగి కోయించుకోనిరా" పుర మాయించింది ఆదెమ్మ.

"ఆఁ... అట్లేలే" తిరిగి వీధిలోకి వచ్చి 'ఏదన్నా' అన్నాడు. సిద్దప్ప ముందు, అతను వెనకా కురవపల్లెవైపుకు దారితీశారు.

తూర్పు నుంచీ వీచిన ఓ గాలి తిమ్మెర వాళ్ళ శరీరాల్ని సుతారంగా తాకుతూ ముందుకు వెళ్ళిపోయింది.

✶ ✶ ✶

ఆ రోజు మధ్యాహ్నం సుబ్బయ్యను యింట్లోనే పెట్టేసి, ఒక గోనె సంచిని భుజాన వేసుకుని తల్లిని, చెల్లిని వెంట బెట్టుకుని సద్ద చేన్ల వైపు బయలుదేరింది కోటమ్మ.

ఊరి ముందరికి అడుగు పెట్టగానే మున లయ్య యింట్లో పనిచేస్తున్న ఎర్రన్న పెద్ద కొడుకు కిష్టయ్య ఎదురయ్యాడు.

"యాడికి కోటమ్మా... యెలబారినావు? " సిగ్గుపడిపోతూ అడిగాడు.

"సద్దసేన్లల్లో పరిగి వేరేదానికి బోతా వుండాం" అంది ఆదెమ్మ. కోటమ్మ మౌనంగా ఉండిపోయింది. కానీ అతని మాటల్లో తన పట్ల ఉన్న అభిమానం పసిగట్టకుండా ఉండలే కపోయింది.

"సరే, సరే పోయిరండి" అంటూ కోట మ్మను చూసి ముసిముసిగా నవ్వుకుంటూ, సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ పల్లె వైపుకు వెళ్ళిపోయాడు.

"ఓ యబ్బో. ఆడోళ్ళ మాదిరి బో సిగ్గుపడ తావుండాడు గదమ్మా పిల్లోడు" అనుకుంటూ ముందుకు నడిచింది కోటమ్మ.

వాళ్ళు ముందుగా పల్లెకు పడమటి వైపు నున్న సజ్జ చేన్లలోకి అడుగు పెట్టారు. చేన్లల్లో కనిపించిన సజ్జ కంకుల్ని వడిలో వేసుకుంటూ ముందుకు సాగుతున్నారు ముగ్గురూ.

అనుప తీగెల మధ్యన, పెసలు తీగెల్లోను, అలసంద పొదల్లోను ఇరుక్కున్న కంకుల్ని, నేలపైన పడిపోయిన కంకుల్ని ఏరిఏరి తమ వళ్ళలో వేసుకుంటున్నారు. క్రమంగా వాళ్ళ వడులు నిండుతున్నాయి.

ఆదెమ్మ సజ్జ కంకుల్తో బాటు అలసంద కాయల్ని, అనప కాయల్ని కూడా పెరికి పెరికి వడిలో వేసుకోసాగింది కోటమ్మ. అనపతీగెలు, అలసంద పొదలు విరగకాసి ఉన్నాయి. వాటిని చూసేసరికి ఆశ పుట్టింది ఆదెమ్మకు.

## ఇవిగో, ఇవి మరికొన్ని!



ఇవ్వాళ ఎక్కడ చూసినా సందుకో బ్యూటీ క్లినిక్ కన్పిస్తోంది. స్త్రీలతో బాటు పురుషులకూ ప్రత్యేక క్లిని క్కులు వెలుస్తున్నాయి. అక్కడ చర్మ సౌందర్యాన్ని కాపా డుకోవడానికంటూ సహజత్వానికి దూరంగా ఉండే రసా యనాలతో తయారు చేయబడ్డ క్లీన్సర్లు, టోనర్లు, నరి షర్లు అంటూ రకరకాల ఆంగ్ల పేర్లు చెప్పి, ఖరీదైన ఉత్పత్తుల్ని మనకి అంటగడుతుంటారు. డబ్బున్న వాళ్ళు సరే. ఆర్థికంగా స్థోమత లేని వాళ్ళ సంగతి...?

వాళ్ళూ చింతించనవసరం లేదంటున్నారు హెర్బల్ అండ్ బ్యూటీ ఫౌండేషన్ ఆఫ్ కెనడా శాస్త్రవేత్తలు... కొన్ని చిట్కాలు కూడ చెప్తూ మనకి అన్ని కాలాల్లోనూ చౌకగా లభ్యమయ్యే పండ్ల నుండి, కాయ గూరల నుండి క్లినిక్కుల్లో చెప్పే క్లీన్సర్లు, టోనర్లు, నరిషర్లని సహజసిద్ధంగా ఎలా తయారు చేసుకోవచ్చో వివరిస్తున్నారు.

చాలా పండ్లలో, కూరగాయల్లో సూక్ష్మ క్రిములను అరికట్టే రసాయనాలు, చర్మ సౌంద ర్యాన్ని పెంచే పోషకాలతో పాటు చర్మ కాంతికి దోహదపడే విటమిన్-ఎ కూడా ఉంటుంది. తేనె, దోసకాయ, పాలు మిశ్రమంగా చేసి చర్మం మీద మొహం మీద, మెడల మీద పూసి, ముప్ఫయి నిమిషాల తర్వాత కడిగితే సూక్ష్మక్రిములు మాయమవుతాయి.

"వయసు పైబడుతున్న కొద్దీ శరీరంపై ఏర్పడే ముడతలకు అరికట్టడానికి- అరటి పండు గుజ్జు, తేనె, బంగాళాదుంప రసాల మిశ్రమం మొహానికి పట్టిస్తే ముడతలు మరుగున పడతాయి. కోడిగుడ్డు తెల్లసొన బాగా గిలకొట్టి, నిమ్మరసం కలిపి మొహానికి పూసి ముప్ఫయి నిమిషాల తర్వాత కడిగితే మొహంలో కాంతి మీ సొంతం.

సహనం, సమయం, శ్రద్ధ ఉంటే మీ సౌందర్యం, మీ ఇంట్లో, మీ చేతుల్లోనే!

చుట్టూ ఒక్కసారి కలియచూసింది. చేళ్ళల్లో అక్కడక్కడా సజ్జగూళ్ళు చేలల్లో వేసుకున్న చుట్టు గుడిసెల్లా కనిపిస్తున్నాయి తప్ప మను షుల జాడే కనిపించడం లేదు.

ఆమెకు ధైర్యం వచ్చేసింది.

గబగబా వెళ్ళి ఆ పొదల దగ్గర కూర్చుంది. పండిన కాయల్ని రెండు చేతుల్తో లాగిలాగి వడిలో వేసుకోసాగింది.

అది గమనించింది కోటమ్మ.

"అమ్మా! ఏం పనది? దొంగపని! మనం నేలపైన పడుండే పరిగేరుకునే దానికి వచ్చిం డాము. దీనికే రైతులు అరస్తారు. చేనల్లోకి రానియ్యరు. యిట్ల గనక కాయలు దుసుకు న్నామా సంవత్సరానికొకే ఒక పంట ఊరికే వదల్తారా ఆ అలసంద తీగల్తోనే కట్టేసి కొడ తారు. అట్టాపని చేయొద్దు" బుద్ధి మాటలు చెప్పింది కోటమ్మ.

"యడా మనిషి ఏవుడేలే. యేం గాదు లేమ్మా" అంది కాయల్ని కోస్తూనే ఆదెమ్మ.

మనుషులుండారా లేదాని గాదమ్మా అది అన్నాయం గమ్మునుండు" అంటూ దగ్గరకు వెళ్లి ఆమె చేత ఆ పని మాన్పించింది.

అలా అలా ఏరుకుంటూ బండారోళ్ల సింత మాను దాటి ఆవలి పొలాల్లోకి అడుగుపె

ట్టారు. కాస్త దూరం వెళ్లేసరికి ఎవురో ఆడమనిసి అరుపులు, శాపనార్థాలు, వినబడడంతో గబగబా నడచి ఆ పొలాల్లోంచి తప్పుకుని తమ ఊర్నివైపు పరుగులాంటి నడకతో సాగిపోయారు. ఆ ఆడమనిసి శాపనార్థాలు చాలా దూరంగా లీలగా వినబడతానే ఉండాయి.




ఆ రోజు ఉదయాన తొమ్మిదికంతా ఇంట్లో పనిముగించేసింది కోటమ్మ. అందరితో బాటు అన్ని సద్దినీళ్ళు నోట్లో పోసుకుంది. ఊసలకు బయలు దేరింది.

ఊరి ముందరికి వెళ్ళీ వెళ్ళగానే ఎదురయ్యాడు కిష్టయ్య.

"ఏం కోటమ్మా! యాడికి పొద్దన్నే యెలబారినావు? "

మామూలుగానే అడిగాడు!

"యేడికయితే నీకేం? " తీక్షణంగా ప్రశ్నించింది.

"ఏం లేదూ. ఊరికే అడిగినా. అంతే ఎందుకంత రోసం దెచ్చుకుంటివి? "

"లేకుంటే కనిపిచ్చినప్పుడంతా, కోటమ్మా యాడికీ? అంటా అడగతావే యింకేం పనిలే నీకు? "

"అది గాదు కోటమ్మా... మరీ..." సిగ్గుపడుతూ అన్నాడు.

"మరీ లేదు గిరీ లేదు.. యింకెబ్బుడూ నాతో అట్లా మాట్లాడొద్దు"బిరబిరా ముందుకు నడిచింది.

వడి ఎగచెక్కి, ఒక చేన్లో జారబడి వేలు లావు ఉన్న కంది చెట్టును ఫెళామని విరిచింది. దాని రెమ్మల్ని విరిచేసి అవతల పారేసింది. ఆ తర్వాత దాని మొదలు రెండు దబ్బలు చేసింది. అందులో ఒక దబ్బను తీసుకుని, బెత్తెడు పొడవు విరిచింది. దానిపైనున్న నార తీసేసి అటు యిటూ తిప్పి చూసింది.

ఇప్పుడది సగం నిలువుకు చీల్చి కూరచేసి చీకేసిన కోడి కాలి ఎముకలా, సానబట్టిన చేతికత్తిలా మెరుస్తోంది.

చేలగట్ల వెంబడి కనిపించిన ఈన పుల్లల్ని, ఊసపుల్లల్ని ఆ దబ్బ అంచుకేసి, బొటనవేలితో అదిమి వంచి కోయసాగింది. ఈ దబ్బ అంచు వాదరకు ఆ పుల్లలు కత్తితో కోసినట్లుగా తునిగి చేతిలోకి వస్తున్నాయి. అలా కోసుకుంటూ ఊరికి తూర్పుగా ఉన్న చిన్న గుట్ట వైపు బయలుదేరింది.

అదొక చిన్న అడవి ప్రాంతం. దిగువన అన్నీ పొలాలే. వాటి మధ్యన అక్కడక్కడా కంపచెట్లు, బారులు బారులుగా పెరిగిన కాశి గంటలు, బోదకసువు గంటలు పొదలు పొదలుగా కనిపిస్తున్నాయి. అలాంటి ఒకచోట పెద్ద కంపచెట్ల గుంపు, తానికి దట్టంగా అల్లుకొని ఉన్న తీంద్ర పొద. దాని కవతల గంటలు గంటలుగా పెరిగి ఉన్న ఊసలు గాలికి తలలూపుతున్నాయి. అక్కడ కోటమ్మ ఏకాగ్రతతో ఊసలు కోసుకుంటోంది. చాకచక్యంగా ఎంతో నేర్పుగా, చేతిని చకచకా కదిలిస్తూ ఊసల్ని కట్టలు కట్టలుగా కోస్తోంది. మరోవైపు ఈన పుల్లల్ని కోస్తోంది. కోసికోసి కుప్ప పెడుతోంది.

తను ఆ ప్రాంతపు ఆ ఊరి సర్పంచ్ ముసలయ్య చేలల్లో ఉందని ఆమెకు తెలీదు. ఆదే సమయంలో మరొక వైపున ముసలయ్య సిగరెట్టు తాగుతూ, తన చేని గట్టునున్న బాగి మాను కింద కూర్చొని పొలాలను చూస్తున్నాడు.

ఉన్నట్టుండి ఒక కాకుల గుంపు ఒక కోకిలను తరుముకుంటూ కావు కావుమని గోల చేస్తూ వచ్చి ఆ చెట్లో వాలాయి. వాటి ధాటికి తట్టుకోలేక పరుగెత్తు కొచ్చిన కోకిల పిల్ల,

కుర్ర్ కుర్ర్‌మని ఆయాస పడిపోతూ వచ్చి ఆ చెట్టుకు కొంత దూరంలో గుబురుగా దట్టంగా పెరిగివున్న ఒక కానగ చెట్ల గుంపులో దూరి కొమ్మల్లో దాక్కుంది. దాని కోసం కాకులు ఆరాటపడిపోతూ అది ఎప్పుడెప్పుడు కనిపిస్తుందా, దాన్ని ఎప్పుడెప్పుడు ముక్కుల్తో పొడిచి పొడిచి, గోళ్లతో రక్కి రక్కి చంపుదామన్న ఆవేశంతో అరుస్తూనే ఉన్నాయి.

ముసలయ్య సిగరెట్టు పొగను గాల్లోకి వదుల్తూ, ఆకాశంలోకి చూస్తున్నాడు. ఆకాశంలో చాలా ఎత్తులో ఒక డేగ ఆ ప్రాంతంలో ఎక్కడో దాగివున్న దేన్నో కొట్టడానికి కాబోలు రెక్కలు విప్పార్చి నిశ్చలంగా నిలబడి వెదుకుతున్నట్లుంది.

ముసలయ్య చూపు క్షణకాలం ఆ డేగ పైన పడింది. "ఏ కుందేలుకో ఈ రోజు మూడింది. అది యాడుండేదీ ఈ డేగ కనిపెట్టేసినట్టుండాది. అదును కోసరం చూస్తావున్నిట్టుంది" అనుకున్నాడు.

ఇటు కోకిలను తరుముకు వచ్చిన కాకులను, అటు ఆకాశంలో ఎర కోసరం మాటు వేసివున్న డేగను చూసి, చిన్న వాటిని పెద్ద జంతువులు కొట్టి తినే అరణ్య న్యాయం గుర్తుకు వచ్చి చిన్నగా నవ్వుకున్నాడు ముసలయ్య.

అతని చూపు మెల్లగా తన పొలాల మధ్య ఏపుగా ఎత్తుగా పెరిగి ఒంటరిగా కనిపిస్తున్న మరో బాగిమాను మీద నిలిచింది. ఆ పొలాల గట్లపైన ఎక్కడా చెట్లు లేకపోవడంతో ఆ బాగిమానే మహావృక్షంలాగాను, వృక్షరాజంగాను అనిపించింది.

ఇంతలో చేన్లో ఏదో సరసరా కదిలినట్లయితే అటు చూశాడు. కుడివైపున్న చేన్లో కంపచెట్ల కవతల ఎవరో ఉన్నట్లనిపించింది.

కోకిల పిల్ల కనిపించిందేమో బాగి చెట్లో వున్న కాకులు కావు కావు మంటూ గోలచేస్తూ కానగచెట్ల గుంపుపైకి దూకాయి.

ముసలయ్య తాగుతున్న సిగరెట్టు ఆఖరి దమ్ములాగి ముక్కను పారవేసి పైకి లేచాడు. పొగ యొక్క మాధుర్యాన్ని గుండెల దాకా అనుభవిస్తూ, వేసుకున్న తెల్లబట్టలకు అంటుకున్న దుమ్మును దులుపుకుంటూ "ఎవురో సేన్లో అనపకాయలో, ఏవో కోసేస్తావున్నిట్టుండాదే. ఈ జీతగాళ్లను నమ్ముకుంటే చేన్లో కొల్లబెట్టేటిగా వుండారే" అనుకుంటూ కంపచెట్ల పొదల వైపు కదిలాడు.

అలా రెండడుగులు వేశాడోలేదో, కంపచెట్ల కవతల ఒంటరిగా అక్కడ ఏపుగా పెరిగి ఉన్న ఊసగంటల్లో కోటమ్మ వంగి వంగి ఊసలు కోసుకుంటూ కనిపించింది. ఒక్క క్షణం ఆశ్చర్యపడ్డాడు. ఆ తర్వాత మరికొన్ని క్షణాలు ఆమెను వింతగా చూశాడు. చిన్నగా చిరునవ్వు వొకటి అతని పెదాలపైనున్న గుబురు మీసాలను కదిలించింది. అతనికి తెలియకుండానే అతని ఎడమ చెయ్యి అతని బట్టతలపైకి వెళ్లింది.

అదేదీ గమనించే స్థితిలో కోటమ్మ లేదు. ఎంతో ఏకాగ్రతతో ఊసలు కోసుకుంటోంది.

ఆకాశంలో డేగకు ఎర ఏదో కనిపించినట్లుంది. అంతవరకూ నిశ్చలంగా ఉన్న డేగ, రెక్కలు కాస్తా పైకి లేపి ఉంచి, నిటారుగా భూమివైపుకు దిగుతోంది.

ఆవేళ కాకులకు కనిపించని కోకిలపిల్ల ప్రక్కనేవున్న కానగచెట్ల కొమ్మలో అమాయకంగా కూర్చొని కనిపించింది. అది తన ఎర్రటి నోటిని తెరచి గొంతును వేగంగా తన శ్వాసతో టకటక లాడిస్తోంది.

ముసలయ్య చుట్టూ చూశాడు. ఎక్కడా ఏ సంచారమూ లేదు.

"వంటిగా ఊసలు కోసుకుంటా వుండే, ఎవురబ్బా ఈ ఆడది" అనుకొని తన బుర్ర మీసం మెలేసుకుంటూ రెండడుగులు ముందుకేశాడు.

అతని కాళ్ల కిందపడి, పచ్చని కాయల్ని విరగకాసిన ఉలవచెట్లు కసకస నలిగిపోసాగాయి.

ఆ శబ్దానికి కోటమ్మ ఉలిక్కిపడి అటువైపుకు చూసింది. ఆ సమయంలో నల్లటి శరీరానికి తెల్లటి బట్టలు తగిలించుకొని నునుపైన బట్టతల, నిండైన బొర్ర మీసాలతో అత

డొక యమదూతలా కనిపించాడు. ఆమె గుండె జల్లుమంది. భయంతో వణికిపోయింది. అలాంటి స్థితిలో ఆమె అతని కళ్లకు పులిని చూసి వణికిపోయే లేడిపిల్లలా అనిపించింది.

"ఎవరు నువ్వు? ఏం చేస్తావుండావు? " గద్దించి అడిగాడు.

"ఏం లేదన్నా, ఊసలు కోసుకుంటావుండా" భయపడిపోతూనే అంది.

ఎర్రటి వళ్లు, పద్దెనిమిదేళ్ల వయసులో పొంగులు వారుతున్న యవ్వనం, ముచ్చటయిన ముఖం, తీర్చిదిద్దినట్లున్న ముక్కు, కనుబొమలు... ఆమె అందం అతనికి పిచ్చెక్కించింది.

"ఇంతకూ ఎవురు నువ్వు? "

ఆమె అందాన్ని కళ్ళతో ఆస్వాదిస్తూ అడిగాడు.

"వంకమద్దోళ్ళపల్లె. ఆ ఊర్లో గుండెకాయలాయన కూతుర్ని" బెదిరిపోతూ చెప్పింది.

"ఓహో మాదిగోళ్ళ పిల్లవా. సరిసరి. మా చేన్లలోనే ఊసలకెందుకొచ్చినావు? "

ఏదో విధంగా సంభాషణ కొనసాగించాలన్న తలంపుతో అన్నాడు.

"ఈ పక్క ఊసలు బాగుండాయి. సందెడు కోసుకొని పోయి, పొరకలు జేసి అమ్ముకుంటే, రెండు పూటలు గడుస్తాదనీ..."

ఆపైన ఏం చెప్పాలో తెలీక ఆపేసింది.

ఆమెను ఆపాదమస్తకం తాగేసేవాడులాగా చూస్తూ ఆమె వడిలో ఏదో ఎత్తుగా వుండడం చూసి "వడిలో యేందే. అనపకాయలా! అలసందలా? " కాస్త కఠినంగా అడిగాడు.

"కాదు దాపక్క సీతాఫలం చెట్లల్లో రెండు కాయలు బాగా తేరింటే కోసుకున్నా అంతే" అంది అక్కడినుంచీ వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తూ...

"అవి సీతాఫలాలు గాదు. అబద్ధం సెప్తావుండావు. ఉండు సూడనీ..." గబగబ వెళ్ళి ఆమె వడి పట్టి లాగాడు. ఆమె వడిలో ఉన్న రెండు సీతాఫలం కాయలు రాలి కిందపడ్డాయి.

ఈ అనుకోని సంఘటనకు కోటమ్మకు చేష్టలుడిగిపోయాయి. లాగినప్పుడు అతని చేతుల్లోకి వెళ్ళిన పైటను అతను తిరిగి వదల్లేదు. అతనిలో అంతవరకూ నిద్రపోతున్న వెయ్యి కాళ్ళ జెర్రియేదో, ఒకసారిగా పాదాలను కదిపినట్టనిపించింది. కోరిక తీరికలేసే కళ్ళతో ఆమెను చూస్తూ, తన బట్టతలను ఒక చేత్తో దువ్వుకుంటూ, గుబురు మీసాలని వింతగా కదిలిస్తూ "రా... రా..." అన్నాడు.

ఆ మాటతో నిలువెల్లా కంపించిపోయింది కోటమ్మ.

"అన్నా నేనలాంటిదాన్ని కాదు. పెండ్లి కావాల్సిన దాన్ని, నన్నొదిలేయ్. యింకెప్పుడూ మీ సేన్లకళ్ళానే రాను. వదిలేయ్" అంటూ వేడుకుంది.

ఊహుం. అతని మనసు కరగలేదు.

"నేను ఈ గ్రామ సర్పంచిని. ముసలయ్యని. నేను కోరుకుంటే నువ్వు రావాల్సిందే... రా..."

చేయిపట్టి మీదకి లాక్కోపోయాడు.

కోటమ్మ తప్పించుకోవడానికి ప్రయత్నించింది.

అతనింకా గట్టిగా ఆమె చేతిని పట్టేశాడు. ఆ పట్టుకి సున్నితమైన ఆమె చేయి నొప్పి పెట్టసాగింది. అతని కబంధ హస్తాలనుంచీ తన చేతుల్ని విడిపించుకోవాలని ప్రయత్నిస్తూ "అన్నా, నేను అంటరానిదాన్ని, నన్ను నీలాంటోళ్ళు ఆశించడం తగదు. వదులన్నా" అంది.

"వసేయ్, మా ఊళ్లో ఆడపిల్లోళ్ళను దేవత పేరుతో ముద్దరేసి బసివిని చేసినప్పుడంతా, మేళతాళాలతో వచ్చి నన్ను తీసకపొయ్యి నా చేత బలవంతంగా కన్నెరికం చేయిస్తారు. అందువల్ల ఏ ఆడదాన్ని చూసినా కావాలనుకోవడం వ్యసనంగా మారిపోయిండాది. కాబట్టి నేను కోరుకుంటే నువ్వు రావాల్సిందే. నాకు అంటూ సొంటూ ఏమీ లేదు. అందు నా కోరిక తీర్చుకుంటే దానికి కులమేముం

డాది. మతమేముండాది. రా నిన్ను బాగా చూసుకుంటాలే. నీ మింద ఈగవాలనియ్యను రా మరి"

నెమ్మదిగా, నిర్మలంగా చెప్పాడు. అలా చెప్పడం అతని పద్ధతి.

ఆమె చేతిని వదిలేసి ఆమెను కౌగలించుకోవడానికి ప్రయత్నించాడు. ఆమె అదే అదునుగా భావించి తప్పించుకుని, పరిగెత్తాలని చూసింది. కానీ అతను వదల్లేదు. ఆమె చీర పట్టుకున్నాడు.

"వొసే లచ్మీ రాయే" అంటూ లాగాడు. ఆ ఊపుకి చీర కుచ్చిళ్ళు భళ్ళున ఊడిపోయాయి. ఇక లాభం లేదని కోపంతో రెచ్చిపోయింది కోటమ్మ. తన బలాన్నంతా కూడదీసుకుని చెంపకు బట్టి ఈడ్చి ఒక్కటిచ్చింది.

అంతే ముసలయ్యకు గూబ గుయ్యిమంది. కళ్ళు బైర్లు కమ్మాయి. ఆకాశం గుండ్రంగా, గిర్రున బొంగరంలా తిరిగినట్టనిపించింది. చీరను వదిలేసి చెంపను పట్టుకున్నాడు.

"సెప్తావుంటే ఇంగితం లేదంట్రా నీకు. ఇంక గనక నా జోలికొచ్చినావంటే, పొరకతో కొట్టేస్తా. కులం చెడిపోయేట్టుగా కులమనేది పేర్లో, పుటకలో గాదురా గుణంలో వుండాలి. తుc... నీ బట్టతలా సరే. నీ బొర్రమీసాలు సరే. పోరా బోడి గుండూ బొర్రమీసం"అంటూ గబగబ చీరను వంటికి చుట్టుకుని అక్కడి నుంచీ పరిగెత్తుకుంటూ వచ్చేసింది కోటమ్మ.

అలాగే చూస్తూ ఉండిపోయాడు ముసలయ్య.

చూస్తుండగానే ఉగాది వచ్చేసింది.

ఊరు కొత్త అందాల్ని సంతరించుకుంది. ప్రతి గుమ్మం ముందరా కళాపి, రంగవల్లి. ప్రతి గుమ్మానికీ పచ్చటి మామిడాకుల తోరణాలు.

పెచ్చులూడిపోయిన గోడలను బాగుచేసి సున్నాలు కొట్టి ఉండడంచేత ప్రతి ఇల్లూ కొత్త అందాలతో మెరిసిపోతోంది. కొత్త బట్టలతో, కొత్త ఉత్సాహంతో ఊరు సంతోషంగా ఉంది. సందడిగా ఉంది.

దళితవాడలో ఏ సందడీ లేదు. ఏ సంతోషమూ లేదు. ఉన్నవాళ్లకు పండుగలు కానీ, లేనివాళ్లకేం పండుగలు? కడుపు నిండా తిండి దొరికిననాడు సంక్రాంతి. కడుపులో ఆకలితీరి కంటారా నిద్రపోయిన రోజు శివరాత్రి. అలా కాదంటే ఏ పండుగ రోజయినా రైతులిండ్లకు వెళ్లి కాసింత అడిగి తెచ్చుకుంటే అదే నిజమైన పండగ. అందుకే పల్లె కాస్త ఉత్సాహంగా కనిపిస్తోంది.

పల్లెలో ఆడవాళ్లు కొందరు డేక్సాలు తెచ్చుకున్నారు. ఇంకొందరు చిన్న వెదురు బుట్టలు, తట్టలు ఎత్తుకున్నారు. వాటితోబాటు సత్తు చెంబులు, మట్టి దుత్తలు కూడా ఎత్తుకున్నారు. అందరూ ఊర్లమీద పడ్డారు.

ఉన్నవాళ్లకు పండుగలు కానీ, లేనివాళ్లకేం పండుగలు? కడుపు నిండా తిండి దొరికిననాడు సంక్రాంతి. కడుపులో ఆకలితీరి కంటారా నిద్రపోయిన రోజు శివరాత్రి

ఆదెమ్మ కురవపల్లె, కోటమ్మ చిచ్చులవారిపల్లె వెళ్లారు. అలా వెళ్లి అడుక్కోవటం కోటమ్మకు చిన్నతనంగా అన్పించింది కానీ పండుగప్పుడైనా కాస్త నాలుగు రకాల రుచు లతో కడుపు నిండుతుందనే ఆశ అందరిలానే ఆమెలోనూ ఉంది. ఛీ వెధవ బతుకులు అని మనసులో తిట్టుకున్నా గత్యంతరం లేక వెళ్లింది.

రెండు మూడు వీధులు తిరగగానే రకరకాల పిండివంటలతో, అన్నం కూరలతో బుట్ట నిండింది. నిండిన బుట్టను నెత్తిన పెట్టుకుని ఊరి ముందరికి వచ్చి మిగిలిన వాళ్ల కోసం ఎదురుచూస్తూ నిలబడింది.

ఇంతలో పొలం నుంచి ఇంటికి వస్తున్న ఆ ఊరి సర్పంచి ముసలయ్య హఠాత్తుగా ఆమెను చూశాడు.

"ఏమే, పండుగపూట అడక్కతినేదాని కొస్తి



వేమే" అన్నాడు.

ఒక్కసారి అదిరిపడింది కోటమ్మ. అతన్ని చూసి మౌనంగా తల వంచుకుంది. తన జీవితంలో మొట్టమొదటిసారిగా ఒక మగవాడి ముందర తల వంచుకుని నిలబడింది.

"ఒసే గబ్బుదానా. నేను చెప్పినట్టి వింటే ఈ మాదిరిగా అడక్కతినే పని తప్పిపోవును గదా!" వెటకారంగా నవ్వుతూ అన్నాడు ముసలయ్య.

"ఆడ ఇచ్చింది సాల్లేదా. నోరు మూసుకుని పో... బోడిగుండు, బొర్ర మీసాలు నువ్వూనూ. పో..."

కోపంగా అరిచినట్లుంది. మరోవైపు భయంతో వణికిపోయింది.

"మా ఊరిదేనే. ఇంకెక్కడికి పొమ్మంటావే? " అన్నాడు గుబురు మీసాలు కదిలిస్తూ.

"నీ కొవ్వు యెట్ల తగ్గించాల్నో నాకు బాగా తెలుసే, అప్పుడే ఏమైంది? ముందుంది. ఈ ముసలయ్య నీకేసే ముండ్ల పందిరి" అని అతను మనసులోనే అనుకుంటూ తన బోడిగుండును ఒక చేత్తో నిమురుకుంటూ ఆమెను ఆపాదమస్తకం పరిశీలించసాగాడు.

ఆ మరుక్షణం అన్నంతో నిండిన పాత్రలతో అక్కడికి వచ్చారు ఆమె స్నేహితురాళ్ళు. వాళ్లను చూసిన ముసలయ్య తన కిర్రు చెప్పుల్ని కిర్రుకిర్రు మనిపించుకుంటూ అక్కడి



నుంచి వెళ్లిపోయాడు.

'ఛీ, ఇంక జీవితంలో ఎప్పుడూ ఇట్ల అడ క్కతినే పని చేయకూడదు' అనుకుంటూ తన స్నేహితురాండ్రతోపాటు పల్లె వైపుకు నడిచింది.

10

"ఎంతమాటనింది. ఈ గ్రామానికే మకుటం లేని మహారాజుని నేను. ఈ గడ్డపైన నా మాటకు ఎదురే లేదు. నా మాటే చట్టంగా చెల్లుబాటయిపోయే ఈ గడ్డపైన, యే పిల్లను మాతమ్మగా మార్చినా నువ్వే కన్నెరికం చెయ్యి సామీ అంటూ అడుక్కునే కడజాతి కులంలో పుట్టిన ఒక ఆడది ఇంత మాటనడమా? "

ఒకరోజు ఉదయాన సిగరెట్టు తాగుతూ తన ఇంటి ముందరున్న అరుగుపైన కూర్చొని దీర్ఘంగా ఆలోచించసాగాడు ముసలయ్య.

"బోడిగుండు. బొర్రమీసం" నిన్నటి మాట.

"నా జోలికి వస్తే పొరకతో కొడతాను" మొన్నటి మాట.

ఒక్కో మాటా ఒక్కో కొరడా దెబ్బలా మనసును గాయపరుస్తోంది. ప్రతి నిత్యం పచ్చి పుండుగా మారుస్తోంది.

"దీన్ని ఏం జేయాల? ఇట్లే వదిలేస్తే, అది యాడ కనిపించినా తలొంచుకొని పోవాల్సిందే మన పరిస్థితి. దానికి, వంగి వంకాయలు కోసినట్లే గదా. దీన్ని ఇంతటితో వదలకూడదు. దీన్ని ఏదో ఒగటి సెయ్యాల. ఆ సేసేది గూడ మామూలుగా ఉండగూడదు. వోళ్ళమ్మకు, వోళ్లబ్బకు ఎరిక కావాల. జన్మజన్మలకు గుర్తుండిపోవాల. ఏం చేయాల? "

తీవ్రంగా ఆలోచిస్తున్న ముసలయ్య కంటికి తన యింటివైపే వస్తున్న యాదయ్యగారి శ్రీనివాసులు కనిపించాడు.

"వీడేదో వార్త మోసుకొనొస్తా వుండాడు. ఊరికే రాడు గదా!" అనుకుంటుండగానే గేటు దాటుకొని అతణ్ణి సమీపించాడు శ్రీనివాసులు.

"ఏమిరా శ్రీనివాసులు! పొద్దన్నే యిట్టొస్తివి? కూసో" అంటూ అరుగుపైన చేత్తో తడుతూ స్థలం చూపించాడు ముసలయ్య.

"ఏం లేదన్నా. ఊరికేనే వొస్తి" అంటూ అరుగుపైన కూర్చున్నాడు.

"ఊరకరారు మహాత్ములన్నారు గదా పెద్దోళ్ళు. ఏదో వొగటి లేకపోతే ఇంత పొద్దన్నే ఎందుకొస్తావురా!"

"నేనేమీ మహాత్ముణ్ణి కానులే మహానుభావా. నీ నేస్తున్ని. అంతే"

"సరే. ఇప్పుడెవుడు కాదన్నేడు సెప్పు"

వాళ్ళ మధ్య కొన్ని క్షణాలు మౌనంగానే కరిగిపోయాయి. చివరికి శ్రీనివాసులే "ఈ యిసయం నీకు తెలుసా? " అంటూ మొదలె

ట్టాడు.

"ఏ యిసయం"

"ఆ మధ్య నువ్వు కన్నెరికం చేసిన బుడ్డమ్మ చచ్చిపోయింది"

"ఆ, సచ్చిపోయిందా? ఎందుకురా? " ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎందుకేంది. వొగ సామితుంది సూడు. భోగం దానిల్లు కొల్లపోయిందోచ్చే అన్న మాటిని, తాతా, నాయన, మనవడు వున్నపళాన, ఇంట్లోనించీ గోసీలు యిప్పుకోని మరీ పరిగెత్తినారంట. ఆ మాదిరిగా నువ్వు కన్నెరికం జేసిన బుడ్డమ్మ కత కూడా అట్లయిపాయ. అది, తాళలేక ఉరి బోసుకోని సచ్చిపాయ"

"ఉరి బోసుకొని సచ్చిందా? ఎప్పుడు? " ఆశ్చర్యంగా అడిగాడు ముసలయ్య.

"నీకింతవరకూ తెలీనే తెలీదా? అయ్యో, శ్యానాదినాలైపాయనే"

"నేను ఈ సేన్ల కోతల పనుల మింద తీరిక లేకండా తిరగతావుంటి. నెలగా యింటిక్యాడా రేత్తిరిపూటే వచ్చిపోయే పరిస్థితి అయిపాయలే"

"నువ్వు, కన్నెరికం చేసిన మరుదినం ఊర్లో పిలకాయలు ముగ్గురు నలుగురు దూంకిరి. ఆ మరుదినం వోళ్ళ కులస్థులు నలుగ్గైదు గురు దూరిరి. అదీ మడిసే గదా. యెట్ల తట్టుకుంటుంది? "

"బసివిగా ముద్దరేయించుకున్నె తర్వాత దానికి ఎరుసుకుంటే యెట్లా? "

"అసలు యిసయం అది గాదంటలే"

రహస్యం చెబుతున్నవాడిలా స్వరం తగ్గించి మరీ చెప్పాడు.

"యింకేమంటరా"

"మనూరి పిలకాయలే ఆయమ్మిని రేత్తరంతా ఉడకాడించి సంపేసినారంటలే. యాడ మన మిందకొస్తుందోనని సచ్చిన శవాన్ని తీసకపోయి సింతల తోపులో యాలాడదీసినారంట"

"ఇట్లగూడ జరుగునా..."

"జరిగింది మరి. యింకేమనుకుంటివి. నిజం నిదానం మిందగదా తెలస్తాది. ఈ నిజం బయటపడేదానికి నెల జరిగింది మరి. అది సరేన్నా. నాదొగ మాట. ఏమీ అనుకోవద్దు"

"అనుకోన్లే సెప్పు"

"ఏం లేదన్నా. నువ్వు కన్నెరికాలు యింక సెయొద్దన్నా"

"ఏం? "

"పాపమన్నా"

"వోరినీ పాసులగోల. తరతరానించీ వచ్చే ఆశారాలు వదలుకోలేంరా... ఇప్పుడు, పల్లెలో వోళ్ళు మాతమ్మల్ని చేసే ఆశారం వదులుకోరు. పైగా అది మన బాధ్యత అనుకుంటారు. అట్లాగే మాతమ్మలకి కన్నెరికంజేసే ఆశారం మా వంశానిది. దాన్ని వదులుకోలేం. దాన్ని నిలబెట్టుకోవడం గూడా వొగ గౌరవంరా నాయాల. యిట్లా ఆశారాన్ని వదులుకుంటే పాపంగానీ, కన్నెరికాలు జేసేది పాపం గాదురా. పైగా అయితమ్మ దేవత కోసరం చేసే పున్నెకార్యం"

"అది గాదన్నా..." ఏదో చెప్పబోయాడు శ్రీనివాసులు.

"ఏది గాదురా. నువ్వన్నిట్టు నేను మానుకుంటా. కన్నెరికాలకు పిల్చినా పోను అనుకుందాం. అంతమాత్రాన వోళ్ళు ఆశారం మానుకుంటారా! లేదే. నాలాంటోన్ని యింగొకకోన్ కిస్కాగాన్ని పట్టుకోని కన్నెరికం చేయించుకుంటారు. అప్పుడు యిన్ని తరాలనించీ వచ్చే మన పెద్దరికం ఏమైపోతుంది? అయినా మనదేముండాది. వోళ్ళు ఆకూ వక్కా యిచ్చి పూలమాలేసి, నలుగు బెట్టి పిలిస్తేనే గదా మనం పోతాము. కాబట్టి వోళ్ళయ్యి వోళ్ళు ఆశారం మానుకోవాల. మనదేముండాది. రమ్మంటే వస్తాం. పొమ్మంటే పోతాం, అంతే. పైగా ఈ బసివిలుంటేనే గదా మన పనులూ జరగతాయి. పై ఆఫీసర్లు వచ్చినప్పుడు, యింకా ముఖ్యమైనోళ్ళు ఎవురయినా వచ్చినప్పుడు ఉపయోగపడేది బసివిన్లే గదా" నిక్కచ్చిగా చెప్పాడు

ముసలయ్య. అయోమయంగా అతని ముఖం లోకి చూస్తుండిపోయాడు శ్రీనివాసులు.

"బుడ్డమ్మ జస్తే ఏమైందిలే... యింక కొన్ని దినాల్లకైనా ఇంకో బసివి తయారుగాదా యేంది? " తిరిగి అతనే అన్నాడు మీసం దువ్వుకుంటూ.

"పొర కట్టలు కావాలామ్మా పొరక కట్ట లో... విస్తరాకులు కుట్టేదానికి ఈన పుల్లలు కావాలా అమ్మా ఈనపు ల్లలో..."

ఇంత బతుకు బతికీ వాగ అంటరాని దాని దెగ్గిర ఇన్నిన్ని మాట్లనిపించుకున్నానే. తుఽ యింక ఇంత అగుమానం జరిగినాకా ఈ ధర్ణిపైన తలెత్తుకోని ఇంకా బతకతానే ఉండానే. ఎంత అగుమానం జరిగె

వీధిలో ఓ ఆడ కంఠం వేసిన కేక వినిపించింది. వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

"పొరకలే. పొరకలు... ఈనపుల్లలో... ఈనపుల్లలు" మళ్ళీ వినిపించింది.

"ఎవుర్రా ఆ ఆడమడిసి. వయ్యారంగా అరస్తావుండాది. అట్ట సూసిరా" పురమాయించాడు ముసలయ్య.

శ్రీనివాసులు లేచి వెళ్ళి గుమ్మందాటి వీధి లోకి ఒకడుగు వేసి ఆ కేక వినిపిస్తున్న వైపు చూశాడు.

కుడివైపున వీధి చివర నెత్తిన పొరక కట్టలు పెట్టుకున్న ఓ స్త్రీ అటువైపుగా వస్తూ కనిపించింది. యువతిని చూసి తిరిగొచ్చి "అది మా ఊరి గుండెకాయలోని కూతురు కోటమ్మ. పొరక్కట్లు, ఈనపుల్లలు అమ్ముకుంటా వుండాది" అన్నాడు.

ఆ మాట వినగానే అంతవరకూ ఏదయితే మరచిపోయి ఉన్నాడో ఆ విషయం మళ్ళీ గుర్తుకొచ్చింది ముసలయ్యకు. కోటమ్మ చేతిలో పరాభవం పొందిన బాధ...

"దీన్నెట్ల సాధించాల? "... "దీన్ని ఏ విధంగా వేధించాల. తన కసి తీర్చుకోవాల. ఎలా? ఏం చేయాలి? "

ముసలయ్య కోపాన్ని మరింత ఎక్కువ చేస్తూ "పొరక్కట్టలే ఈనపుల్లలే" అంటూ ఆ యింటి ముందరి నుంచీ ముందుకు సాగిపోయింది కోటమ్మ.

* * *

ముసలయ్య మనసు కుతకుతా ఉడికిపోతా ఉంది. కోపంతో రగిలిపోతా ఉంది. అవమాన భారంతో కుంగిపోతోంది. ఇంట్లో ఉన్నా, చేలో ఉన్నా ఏ పని చేస్తున్నా కోటమ్మ చేసిన అవమానాలు గుర్తొచ్చి హృదయం దహించుకుపోతోంది.

ఆ అలగాదానికి ఎలా బుద్ధి చెప్పాలి? ఎలా లొంగదీయాలి? అనే ఆలోచనే అన్నివేళలా అతడి మనసు నాక్రమించేసింది. ఒక రోజు చేలో కంది కోస్తుంటే పర్యవేక్షిస్తూ తిరుగుతున్నాడు. మనసులో మళ్ళీ అవమాన గాయం సలిపింది.

ఆ గుండెకాయలోని కూతురు నన్నెంత అగుమానంగా తిట్టింది... అదీ ఇక్కడే... ఈ చేనుకాడే. తిట్టడమే గాదు. గూబ గుయ్యమనేటట్టుగా చెంపపై కొట్టి, పొరకతో కొడతాననింది. నా బట్టతల, గుబురు మీసం జూసి బోడుగుండు, బొర్ర మీసం అనింది. నిమ్మకాయలు నిలబడేంత గొప్ప మీసాలు నావి. ఇంత బతుకు బతికీ వాగ అంటరానిదాని దెగ్గిర ఇన్నిన్ని మాట్లనిపించుకున్నానే. తుఽ. యింక ఇంత అగుమానం జరిగినాకా ఈ ధర్ణిపైన తలెత్తుకోని ఇంకా బతకతానే ఉండానే. ఎంత అగుమానం జరిగె. ఆనాడు మయసభలో దుర్యోధన సెక్రవర్తికి జరిగినంత అగుమానం జరిగే గదా. ఆ దుర్యోధన సెక్రవర్తి, తన్ను జూసి అగుమానంగా నవ్విన ద్రౌపదిని ఊరికే వదిల్నాడా! లేదే. మరి. నేను మాత్రం ఎందుకు ఊరికే వదలాల. దాని అంతు జూస్తా. దాని బతుకు పర్లాకిల పాలుపట్టిస్తా"

తన గుండెను తానే గాయం చేసుకోసాగాడు. తనకుతానే శపథాలు పలుక్కో

సాగాడు.

తనకేదయినా బాధ గలిగితే వెంటనే, ఆ ఊరి శివాలయంలో పూజారిగా ఉన్న శాస్త్రులుకు చెప్పుకోవడం అతనికి అలవాటు. తన కడుపులో బాధనంతా అతని దగ్గర వెళ్లగక్కుకుంటే అతనికి ఉపశమనం. ఆ తర్వాత ఏంచేయాలో ఇద్దరూ కలిసి మాట్లాడుకోవడం సహజంగా జరిగిపోయే విషయాలు. అందుకే "ఈ యిసయం ముందు శాస్త్రులుకు చెప్పాలి. చెప్పి దాని కత తేల్చే మార్గం యోచించాల" అనుకున్నాడు.

అదే సమయంలో కంది మోపుల్తో బండి తోలుకొచ్చాడు కిష్టుడు.

"వొరే కిష్టా. కంది మండలు దించేసినాకా మా అయ్య కలవాలంట ఈ దినం యాడికీ పోవద్దని శాస్త్రులుకు సెప్పిరా" అన్నాడు.

"అట్లేన్నా!" అంటూ ఎద్దుల్ని అదిలిస్తూ బండిని ముందుకు తోలుకుపోయాడు కిష్టుడు.

అటువైపే చూస్తూ గుబురు మీసాలు కదిలించి నవ్వుకుంటూ బట్టతలను చేత్తో నిమురుకుంటూ ఉండిపోయాడు మునలయ్య. అదేరాత్రి.... మునలయ్య ఇంట్లో... అందరూ నిద్దరపోయిన తర్వాత వరండాలో కూర్చొని శాస్త్రులు, మునలయ్య మాట్లాడుకుంటున్నారు.

"ఏమయ్యా, మీ జీతగాడు కిష్టుడు నువ్వు పిలస్తా వుండావని సెప్పిపాయ" శాస్త్రులు ప్రారంభించాడు.

"ఏంలేదు శాస్త్రులు. ఊర్లో ఇల్లు కట్టుకోవాలన్నా, వొగ పెండ్లి ముహూర్తం పెట్టాలన్నా, ఏ మంచీ చెడుకైనా అందరూ నీ దెగ్గిరకు రావాల్సిందే. అట్ల ఎన్నింటికో ముహూర్తాలు పెట్టినావు. నువ్వు పెట్టిన ఏ ముహూర్తమూ 'చెడిపోదు' అని పేరు తెచ్చుకున్నావు. కడా కు... పల్లెలో వొగ ఆడదాన్ని బసివిని చేయాలన్నా నువ్వు ముహూర్తం పెట్టాల్సిందే"

"అవునండయ్యా. ఏదో అడుగుతారు, పెట్టక తప్పదు".

"అది సరే. ఈ ప్రాంతంలో జనాలకు నీ మీద గురి, నమ్మకం"

"అంతా మీ అభిమానమండయ్యా"

"సరే. ఈసారి వొగ మంచి ముహూర్తం బెట్టాలి. ఈ ముహూర్తం అట్లాంటి ఇట్లాంటి దిగా, అల్లాటప్పాగా ఉండకూడదు. అదిరిపోవాల. అంతే"

"అలాగేనండయ్యా" అని పంచాంగం చూసి, ఏవో లెక్కలు చేసి "వచ్చే శనివారం అమోఘమైన ముహూర్తముందండయ్యా" అంటూ చెప్పాడు.

"మంచి ముహూర్తం కాదయ్యా. మంచి దుర్ముహూర్తం గావాల. అది మంచి యమగండంలో వుండాల"

"అయ్యయ్యో. ఏమంటిరండయ్యా. యింతకూ ముహూర్తం దేనికండయ్యా"

"శాస్త్రులూ... నీకు సెప్పుకోక యింకెవురికి సెప్పుకుంటాను. మీ ఊరి మాదిగోళ్ళలో గుండెకాయలోడుండాడు గదా!"

"అవును"

"వాడి కూతురు కోటమ్మ వుండాది గదా"

"అవును వుండాది"

"ఆయమ్మ నన్ను మానేని దెగ్గిర అగుమానించిందయ్యా" జరిగిందంతా వివరించాడు.

"అట్లనా. అయితే యిప్పుడేంజేయాల సెప్పండయ్యా"

"ఏం లేదు... దానిమింద పగ సాధించాల. దానికి పెండ్లి గాకూడదు. దాని బతుకు కుక్కలు చింపిన విస్తరి కావాల. సర్వనాశనమై పోవాల..."

ఆవేశంగా అన్నాడు మునలయ్య.

"దానికేముండాదిలేండయ్యా. వోళ్ళ కులాచారమే వుండాది గదా. ముద్దరేసే ఆచారం. దాన్ని పట్టుకోని కొడితే సరిపాయ. అట్ల మీ కోరిక తీరుతుంది. మీ పగా చల్లారుతుంది"

ఆలోచన చెప్పాడు శాస్త్రులు.

"ఈ పని నీ వల్లనే గావాల. నాకీ సాయం జెయ్యి. నీకు పట్టుబట్టలు పెడతా. ఘనంగా

# చతుర భాషితాలు

ఇంగిత జ్ఞానం అసాధారణ పరిమాణంలో ఉంటే దానిని ప్రపంచం వివేకం అంటుంది.

– కాల్రిడ్జ్

---

తనను తాను జయించుకోగల వ్యక్తి అన్నిటినీ జయించగలడు.

– లాటిన్ సూక్తి

---

మనసును అదుపులో పెట్టుకోలేని వారు, ఏ వ్యవహారంలోకీ దిగకూడదు.

– చెస్టర్ ఫీల్డ్

---

అనుభవాన్ని మించిన గురువు లేడు. నీ అనుభవాలే నీ కరదీపికలు.

– స్వామీ వివేకానంద

---

మనోవికారాలే నిజమైన శత్రువులని గ్రహించి వాటితో నిత్యం పోరాడాలి.

– మహాత్మాగాంధీ

---

వయసు మళ్ళిన వారివి వెనుకటి గాథలు. వయసులో ఉన్న వారివి ముందున్న స్వప్నాలు.

–స్మిత్

---

మంచిని, చెడును వేరుచేసేది ఆలోచన మాత్రమే. మానవ కార్యాలను కోరికలను ఉన్నతం కావించేది, అగౌరవ పరిచేది ఆలోచన మాత్రమే

– జార్జ్‌మూర్

---

అందరిలోనూ మంచిని చూడటం నేర్చుకుంటే మనలోని మంచి పెరుగుతుంది.

– రామకృష్ణ పరమహంస

---

నువ్వు అధికారివైతే అప్పుడప్పుడు చూసీ చూడనట్లు ఉండు, సేవకుడివైతే వినీవిననట్లు ఉండు.

–పుల్లర్

---

అవమానాల్ని మౌనంగా స్వీకరించు. వాటికి బదులుగా పుష్పాలు సమర్పించు.

– రవీంద్రనాథ్ ఠాగూర్

---

రాపిడి లేనిదే రత్నం ప్రకాశించదు. కష్టాలను తట్టుకోలేని మనిషి ఏనాటికీ పరిపూర్ణత పొందలేడు.

– చైనా సూక్తి

---

సోమరుల వలె బలహీనంగా నూరేళ్ళూ జీవించడం కంటే దృఢ సంకల్పంతో ఒక్క రోజు జీవించినా ఉత్తమం.

–ధర్మపథం

---

మనిషిలో మూడు ప్రధాన శక్తులున్నాయి. అవి ఆలోచనాశక్తి, ఇచ్ఛాశక్తి, అనుభూతి శక్తి. ఈ త్రివేణి సంగమం ప్రవహిస్తేనే మనిషి సరిగా జీవించేది.

– డా॥ సంజీవ్‌దేవ్

వేలల్లో సంభావనిచ్చుకుంటా" ఆశ కల్పించాడు ముసలయ్య.

"దానికేముండాదిలేండయ్యా. ఆ పని నా కొదిలేసి మీరు నిశ్చింతగా వుండండయ్యా" భరోసా యిచ్చాడు శాస్త్రులు.

ఆనందంగా గాలి పీల్చుకున్నాడు ముసలయ్య.




కాలం వేగంగా మరో అడుగు ముందుకేసింది.

ఒకరోజు సాయంత్రం...

కూలి పనికి పోయి, అలసిపోయి వచ్చింది కోటమ్మ. ఉదయమెప్పుడో తాగిన అంబలి. కడుపులో ఒకటే బాధ.

ఇంట్లో ఎవ్వరూ లేరు.

సుబ్బయ్య వీధిలో ఆడుకోవడానికి వెళ్ళాడు.

ఇంటి ముందరున్న అరుగుపైన అప్పటికే దుప్పటి కప్పేసి కూర్చోనున్నాడు గుండెకాయలోడు. అతనితో బాటుగా బాలయ్య, గురవయ్య అదేమాదిరిగా దుప్పట్లు కప్పుకొని మెరవణికి సిద్ధం చేసిన ఉత్సవ విగ్రహాల్లా కూర్చోనున్నారు.

పెరట్లోకి వెళ్ళి తిరిగి కొట్టంలోకి వచ్చిన కోటమ్మ "నాయనా! అమ్మ యేదీ. కనిపించ లేదే? " అంది తండ్రికి వినిపించేటట్లు.

"నీళ్లకు బొయ్యిందమ్మా. అద్దో వస్తా వుండాది సూడు" కూర్చునే సమాధానం చెప్పాడు. ఉన్నట్టుండి ఆమెకు కండ్లు గిర్రున తిరిగాయి. ఎవరో చేయి పెట్టి ప్రాణాలు తోడేస్తున్నట్టనిపించింది. కళ్ళు మసకలు కమ్మాయి. నరాలు జివ్వున లాగాయి. శరీరం ఎక్కడికో తేలిపోయినట్టనిపించింది. అంతే. 'అమ్మా' అంటూ నిలువునా కుప్పకూలిపోయింది.

అప్పుడే నీళ్ళ కడవతో కొట్టంలోకి అడుగు పెట్టిన ఆదెమ్మ కెవ్వున కేకేసింది.

నడుం పైనున్న కడవ జారి కిందపడింది. కడవ ముక్కలైంది. నీళ్ళు భళ్ళున ఇంట్లోకి సగం, వీధిలోకి సగం ఎగిరిపడ్డాయి. ఆదెమ్మ కూడా సగం నీళ్ళతో తడిసిపోయింది.

అదేదీ గమనించలేదామె.

"అయ్యో నా బిడ్డో. నా బిడ్డో" అంటూ అరుచుకుంటూ కోటమ్మను సమీపించింది. ఆమె అరుపుకు బెదిరిపోయి 'ఏం జరిగిందో సామీ' అనుకుంటూ అరుగుపైన కూర్చోనున్న ముగ్గురూ పరిగెత్తుకుంటూ వచ్చారు.

ఆదెమ్మ గబగబా వెళ్ళి కూతురి తలను వడిలోకి చేర్చుకుని "అయ్యో తల్లీ. ఏమాయమ్మా. నా బిడ్డో" అంటూ ఏడవడం మొదలెట్టింది.

"అయ్యో. అమ్మణ్ణీ. ఏమయిందమ్మా" అంటూ గుండెకాయలోడు కూతుర్ని పలకరించాడు.

కోటమ్మ పలకలేదు, ఉలకలేదు.

గురవయ్య "ఉండడమ్మా, యాడవొద్దు" అంటూ వెంటనే కడవలో కుండ పగిలిన ప్పుడు కింద పడి వున్న నీళ్ళలో చేయి అద్ది, ఆమె ముఖాన చిలకరించి తేమ చేతితో ముఖం పైన నిమిరాడు.

దాంతో కొంతసేపటికి మెల్లిగా కళ్లు తెరిచింది కోటమ్మ. అందరూ సంతోషంగా గాలి పీల్చుకున్నారు.

"ఏమాయ తల్లీ? " ఆందోళనగా ప్రశ్నించింది ఆదెమ్మ.

"ఏమయిందమ్మా" ఆతృతగా అడిగాడు గుండెకాయలోడు.

"ఏం లేదు నాయనా. కండ్లు తిరిగినట్లనిపించింది. అంతే" అంది నీరసంగా కోటమ్మ.

"ఏ గాలో సోకినట్టుంది లేబ్బా" అన్నాడు

గురవయ్య.

"గాలి సోకింటే కష్టమేనే" అన్నాడు బాలయ్య.

"ఎందుకయినా మంచిది. వొగతూరి ఆసుపత్తిరికి తొడక్కపొయ్యి డాక్రటుకు సూపించండబ్బా" అన్నాడు గురవయ్య.

"దాంతోబాటుగా మనూరి శాస్త్రులుగోరిని శాస్త్రం అడగండి. ఆయన ఇలా వరిగా చెప్పేస్తాడు" అన్నాడు బాలయ్య.

"ఎవరి దెగ్గిరన్నా మంతరించండి. మేలు జరుగతాది" ఎవరో అన్నారు. కొంతసేపటికి ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళారు. ఆ వెంటనే ఏ మాత్రం ఆలస్యం చెయకుండా ఆదెమ్మ భర్తను యింట్లోనే పెట్టేసి కూతుర్ని తీసుకుని పులిచెర్ల ఆసుపత్రికి బయలుదేరింది.

వీళ్ళు పోయేటప్పటికి డాక్టరు రాజాసాబ్ వచ్చి వున్నాడు. అతని దగ్గర యిద్దరు ముగ్గురు పేషేంట్లు కూడా ఉన్నారు.

తన వంతు రాగానే కూతుర్ని తీసుకుని రాజాసాబ్‌కు చూపించి జరిగింది చెప్పింది.

అదే మొదటిసారి ఆసుపత్రికి రావడంతో కోటమ్మ బిడియపడుతూ మౌనంగా కూర్చుంది.

రాజాసాబ్ పరీక్ష చేసి "ఎన్ని రోజులయింది అన్నం తిని" అంటూ ప్రశ్నించాడు.

"నిన్న అంత సజ్జంబిలి, పొద్దన్న అన్ని సద్దె నీళ్ళు తాగినా అంతే" అంది కోటమ్మ.

"ఏం లేదమ్మా. ఈ అమ్మాయికి తిండి లేక, కండ్లు తిరిగి పడిపోయింది. వ్యాధేమీ లేదు. అంబలికి సద్దినీళ్ళకు బలమేమొస్తాది? బాగా తినాల. నేను బలానికి టానిక్కులు, మందులు రాసిస్తాను. నెలపాటు వాడండి. కోలుకుంటుంది. దాంతో బాటుగా ఆకుకూరలు, పండ్లు బాగా తీసుకోండి. రోజుకొగ గుడ్డు తీసుకో యింకా మంచిది" అంటూ బరబరా కాగితంలో గీకి రాసిచ్చాడు.

"తినే దానికే లేదు. ఇంక టానిక్కులు, మందులు ఎక్కడ తెచ్చేదిరా దేముడా" అనుకుంటూ అమ్మా కూతురు తిరిగి ఇల్లు చేరుకున్నారు. చేరుకున్నారే గానీ వాళ్ళ మనసులు స్థిమితపడలేదు.

"ఏమే ఆదీ! ఏమన్నాడు డాక్రటు" యింటికి వచ్చిన వెంటనే అడిగాడు గుండెకాయలోడు.

"ఏమీ లేదన్నాడు. బాగా తింటే సరిపోతుందన్నాడు!" చెప్పింది ఆదెమ్మ.

"వాళ్ళు అట్టే చెబుతారు గానీ... మన శాస్త్రుల దెగ్గిరికి పొయ్యి శాస్త్రం జూపించి మంతరించాల, శాంతి చేయించాల. అన్నింటికీ శాస్త్రం జూపిస్తే బాగుంటుంది"

"అదీ నిజమే. అయితే అంగిడింటికి బొయ్యి రెండాకులు, వక్కలు తీసకరాపో"

పైటకొసలో ముడి వేసుకొని ఉన్న ఒక రూపాయిని విప్పి చేతికిచ్చింది.

"సరే, నేను తీసుకోనుంటా. నువ్వా ఆ మేరకు రా. అట్లే పోదాం" అంటూ అంగడింటికి బయలుదేరాడు గుండెకాయలోడు.

"అమ్మణ్ణీ ఇంట్లో భద్రం కొడకా. మేం శాస్త్రులు దెగ్గిరికి పోయొస్తాం" అంది ఆదెమ్మ.

"వద్దులేమ్మా. నాకేం గాదు గానీ, డాక్రటు చెప్పినట్టుగా తిండి లేక కండ్లు తిరిగినాయి. అంతేగానీ..." అంది కోటమ్మ.

"కాదులేమ్మా. శాస్త్రం జూపిస్తే తెలిసిపోతుంది గదా" అంటూ పెరట్లోకి వెళ్ళి కాళ్ళూ, చేతులూ, ముఖం కడుక్కొని పైటతో ముఖం తుడుచుకుంటూ వచ్చింది ఆదెమ్మ.

నట్టింటి దీగూట్లో ఉన్న కుంకుమ భరిణి తీసుకుని పక్కనే ఉన్న అద్దం ముక్కలో ముఖం చూసుకుంటూ నొసటన పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకుంది.

ఆ తరువాత నేరుగా ఎగువ వీధిలో ఉన్న శాస్త్రులు యింటికి బయలుదేరింది. ఆదెమ్మ పోయేసరికి తాంబూలంతో రెడీగా ఉన్నాడు ఆమె భర్త. ఇద్దరూ శాస్త్రులు యింటికి చేరుకున్నారు. అతడు ఇంట్లో లేకపోవడంతో అక్కడే ఎదురుచూస్తూ నిలబడ్డారు.

కొంతసేపటి తర్వాత శాస్త్రులు వచ్చాడు. ఆ అరుగుపైన కూర్చున్నాడు. ఆదెమ్మ దంపతులిద్దరూ వంగి వంగి దండాలు పెట్టారు.

"ఏమిరా గుండెకాయలోడా యిట్లొస్తిరి?" ప్రశ్నించాడు.

"ఏం లేదు సామి. కొంచెం శాస్త్రం జూడాల!" చేతులు నలుపుకుంటూ వినయంగా చెప్పాడు.

"ఏం నీ కూతురికేమైనా సంబంధమా?"

"లేదు సామి మొన్న రెడ్డేరి పల్లెకి ఎవురికో కూలికి పోయ్యొచ్చింది. వచ్చీ రాగానే వాయి మందిరొచ్చి పడిపోయింది. యేమన్నా గ్రహాలు కొట్టిందేమో సూపించి మంతరిద్దామనీ..."

"సరే అట్ట పక్కనొచ్చి నిలబడండి" అన్నాడు.

ఆ మాటతో ఆ పందిరి కిందనే ఒక వైపుకు వదిగి వదిగి నిలబడ్డారు.

"ఆకు వక్కా, కాణికా తెచ్చినారా?" పంచాంగం విప్పుతూ అన్నాడు.

మనసులో ఇదే మంచి సందర్భం అనుకుంటూ "ఆఁ తెచ్చినాము సామీ" అంటూ పైట కొసలో ఉన్న రూపాయ విప్పి భర్త చేతికిచ్చింది ఆదెమ్మ.

ఆ రూపాయను వక్కలతో కలిపి, తాంబూలం అరుగుపైన పెట్టాడు గుండెకాయలోడు.

"ఏం పేరు?" పుస్తకం చూస్తూ అడిగాడు

"కోటమ్మ" చెప్పాడు గుండెకాయలోడు.

"కోటమ్మ. కేకో హోకీ పునర్వసు, రెండవ పాదం, మిథునరాశి. బుధుడు, చంద్రుడు రాశ్యాధిపతుల దేవగణం. జంతువు మార్జాలం. ఆదినాడీ... రాజపూజ్యం ఒకటి. అవమానం పన్నెండు" అంటూ తనలో తానే గొణుక్కుంటూ పంచాంగంలో కాగితాలు తిప్పి చదివాడు. ఆకుల్ని, వక్కల్ని, కాణిక కాసుని లెక్కించి ఏవో లెక్కలు వేశాడు. చివరికి ఇలా చెప్పాడు.

"ఔరే గుండెకాయలోడా. అమ్మా, నువ్వు కూడా విను. అమ్మాయికి గ్రహదోషం ఉంది. శనికి తైలాభిషేకం చేయిస్తే మంచిది. అయినా అమ్మాయికి దైవయోగం కూడా ఉంది. అందువల్లా గ్రహదోషం చేయదు. దాని ప్రభావం తాత్కాలికమే. అయితే శక్తి స్వరూపిణి అయిన ఆదిశక్తికి మీపైన కోపం కూడా ఉంది. దాని ప్రభావం



వల్లనే అలా జరిగింది" వాళ్ళ ముఖాలను పరిశీలిస్తూ చెప్పాడు.

అతని చూపుల్లో ఏదో పాచిక కదులుతున్నట్లనిపించింది.

"అమ్మోరికి మాపైన కోపమా?" ఆశ్చర్యంగా అంది ఆదెమ్మ.

"అవునమ్మా. శాస్త్రం అలా చెబుతోంది"

"నిజమా అయిహోరా? " గుండెకాయలోడు దిగాలుగా అడిగాడు.

"అవున్రా, నేను ఆ జగన్నాథుడికి పురోహితుణ్ణి. నాకు అన్నీ తెలిసిపోతూ ఉంటాయి. నా శాస్త్రానికి తిరుగులేదు" ఖచ్చితంగా చెప్పాడు శాస్త్రులు.

తోడేలు కళ్ళలోని క్రూరత్వం అతని



కళ్ళలో క్షణకాలం పాటు కనిపించి మాయమైంది.

"అయితే ఇప్పుడేమి చేయాలి సామి"

వినయంగా ప్రశ్నించింది ఆదెమ్మ.

"ఏమీ లేదమ్మా. మీరు అయితమ్మకేమైనా 'మొక్కు' బాకీ వుండారా? " అంటూ తీక్షణంగా వాళ్ళవైపు చూస్తూ అడిగాడు.

ఈసారి ఆతని చూపుల్లో జిత్తులమారి నక్కల గుంపులేవో గంతులేస్తున్నట్లు అనిపించింది.

"లేదు సామీ" చెప్పాడు గుండెకాయలోడు.

"య్యోవ్. బాగా గెౘవనానికి తెచ్చుకో. లేకుంటే అమ్మోరికి కోపం వచ్చును" అన్నాడు శాస్త్రులు.

"లేదయ్యా, అట్టాంటి మొక్కులేమీ లేవు" నమ్మకంగా చెప్పింది ఆదెమ్మ.

"య్యోవ్. ఏమ్యా.... గుండెకాయలాయనా. బాగా గెౘవనానికి తెచ్చుకో. లేకుంటే అమ్మోరు అగ్గిలం మీద గుగ్గిలమే అవుతుంది. అప్పుడు ఈ ఊరే మాడి మశానమైపోతుంది" భయపెట్టాడు శాస్త్రులు.

గుండెకాయలోడు మౌనం వహించాడు.

"సరే. మీ వంశంలో ఆడపిల్లనెవుర్నయినా అయితమ్మ కొదిలే ఆచారం వుందా? " తిరిగి ఆరాతీస్తున్న ధోరణిలో అడిగాడు శాస్త్రులు.

మళ్ళీ మౌనంగ తలొంచుకున్నాడు గుండెకాయలోడు.

"నివ్వన్నా చెప్పమ్మా...? " ఆదెమ్మనడిగాడు.

ఆమే తల దించుకుంది. ఏమీ మాట్లాడలేదు.

మళ్ళీ గద్దించి అడిగాడు శాస్త్రులు.

"ఆశారం అంటే... అట్టాంటిదేమీ లేదు... గానీ..." నసిగాడు గుండెకాయలోడు.

"అవునయ్యా. అట్టాంటి ఆశారం ఏమీ లేదయ్యా" ఆదెమ్మంది.

"య్యోవ్. గుండెకాయలాయనా! అపద్దం చెబితే ఊరి కరిష్టమయ్యా"

"అట్లేమీ లేదయ్యా. నువ్వు దాస్తే మాత్రం దాగుతుందా? గతంలో మీ సెల్లిని బసివిని

జేసి వొదల్లా?" అన్నాడు శాస్త్రులు - ముస లయ్యా చెప్పిన సంగతిని మననం చేసు కుంటూ...

"మా సెల్లెలు..." నీళ్ళు నమిలాడు.

"ఇదేదో శని దాపురించేటట్లుంది గదరా సామీ" మనసులోనే అనుకుంది ఆదెమ్మ.

"ఏమిరా. చెప్పు... అట్లాంటిదేదో ఉందని శాస్త్రం గూడా చెబుతోంది. చెప్పరా" గదుమా యించాడు శాస్త్రులు.

"ఆ మధ్య మీ యింటికప్పు అంటుకోలా? మీయమ్మి కండ్లు తిరిగి పడిపోలా? ఎందుక నుకుంటివి? మొక్కుందయ్యా... మొక్కు... ఆఁ. నిజమే గదా" అన్నాడు శాస్త్రులు.

"అవునయ్యా. వొగబ్బుడు వుండేది" చెప్పా డు గుండెకాయలోడు.

"అయితే అమ్మోరి మొక్కు మీ వంశంలోనే ఉందన్నమాట. సూడు ఆదెమ్మా. యేమ య్యా గుండెకాయలాయనా. బాగా వినండి... అమ్మోరి మొక్కు గుర్తు చేసేదానికే, మీ యింటికి అగ్గి రగిలించి, మీ బిడ్డకు మతిలే కుండా పడిపోయేటట్లచేసి నిదర్శనం సూపిం చింది గంగమ్మ. ఇంకా ఆలస్యం జేస్తే ఊరినే మింగేస్తుంది. గుర్తు పెట్టుకోండి. పోండి" అన్నాడు శాస్త్రులు.

"బతుకు జీవుడా" అనుకుంటూ బయట పడ్డారు అక్కడినుంచీ ఆదెమ్మ దంపతులు. వారటు వెళ్ళగానే నర్మగర్భితంగా నవ్వుకు న్నాడు శాస్త్రులు.

"ముసలయ్యకు ఈ విషయమంతా చెప్పి, అది సరేగానీ... ఇప్పుడు కార్యం సాధించా లంటే ఇంక మీ చేతుల్లోనే వుంది" మనసు లోనే పథకం రచించుకుంటూ అన్నాడు శాస్త్రులు.

"యెట్లా?" ఆసక్తిగా అడిగాడు ముసలయ్యా.

"అమ్మోరి మొక్కుబడి తీర్చమని ఎవరిచే తైనా వాళ్ళ కులపెద్దను యెగదొయ్యించండి. యింకొందరు ముసిలోళ్ళను తట్టి వదిలె య్యండి. అట్ల చెయ్యకపోతే దూము తగలి ఊరు ఊరే ఉడ్చుకపోతుందని చెప్పించండి. బాగా భయపెట్టించండి."

"ఆ పని నాకొదిలెయ్. కోటమ్మను ముద్ద రేసి వదిలేదాకా నేను నిద్దరపోను" వికారంగా పెదాలమీదనే నవ్వుకున్నాడు ముసలయ్య.

శాస్త్రులు తనకు రాబోయే సంభావనను తలచుకొని సంతోషంతో పొంగిపోసాగాడు.




ముసలయ్యా కదిపిన పావుకు విజయం లభించినట్టయింది. అనుకున్న ప్రకారం... కోటమ్మ స్పృహతప్పి పడిపోయిన నెలకంతా ఆమెను బసివిని చేయడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. గుండెకాయలోడు, ఆదె మ్మా నెత్తీ నోరూ కొట్టుకున్నా పల్లె పెద్దలు వినలేదు.

కోటమ్మ ఎంత గింజుకున్నా... ఏకమైన పల్లెను ఎదిరించలేక ఏకాకిగా ఉండిపో యింది.

బసివి గుడిసెను శుభ్రంచేసి ముగ్గులు పెట్టారు. చుట్టుపక్కల మాతమ్మలంతా ఊర్లోకి దిగిపోయారు.

ముసలయ్యా పసుపు బట్టల్ని, కడివెడు కల్లును పల్లెకు చేర్పించాడు. రచ్చబండ దగ్గర స్నానం చేయించి ఆ బట్టలు కోటమ్మకు చుట్టారు. ఆ తర్వాత ఐతమ్మ గుడి దగ్గరకు తీసుకెళ్ళి ముద్ర వేసి కల్లు తాగించారు. నడు ముకు వేప మండలు చుట్టారు. డప్పులకను గుణంగా చిందులు వేయించారు. ఆ తర్వాత ఆమెను గుడిసెలోకి పంపించి మేళతాళాలతో ముసలయ్యను తీసుకువచ్చి గుడిసెలో వది లేసి వెళ్ళిపోయారు.

ఆ రాత్రి పల్లెపల్లే కల్లు మత్తులో జోగు

తోంది. ముసలయ్య బాగా తాగుతున్నాడు.

మెడలో మాల, చేతికి మల్లెపూలు, నల్లటి శరీరానికి పసుపులో అద్దిన తెల్లటి బట్టలు, ఎలగొడ్డుకు బట్టలు తొడిగినట్టుంది. వృద్ధ పెళ్లికొడుకులా వున్నాడు.

తలుపు తోసుకు లోపలికి వచ్చాడు. దీగూట్లో నూనెదీపం వెలుగుతోంది.

లోపల ఒక పాత నులకమంచం, దానిపైన ఒక కొత్త దుప్పటి, ఒక దిండు, ఒక మూలన పాత సిరిచాప, మరో మూల ఓ కడవ నిండా మంచినీళ్ళు, దానిపైన మూకుటి, ఒక సత్తు గ్లాసు, తలుపు సందున ఒక బడ రోకలి...

పసుపు బట్టలతో, ముడి వేయకుండా అలాగే వదిలేసి ఉన్న వెంట్రుకలతో మంచంపైన వెల్లకిలా పడుకుని ఉంది కోటమ్మ. ఆమె ప్రతి అణువులోనూ కల్లు మత్తు ఆవరించి ఉంది. ఏం జరుగుతోందో తెలుసుకునే స్థితిలో కూడా ఆమె లేదు. బుర్రమీసం దువ్వుకుంటూ, మరో చేత్తో బట్టతల నిమురుకుం టూ ఒకడుగు ముందుకేసి, ఏదో గుర్తుకు వచ్చినట్టుగా మళ్ళీ వెళ్లి తలుపు గడియ పెట్టి వచ్చాడు.

"ఏమే నీయిత్తగిల్ల. ఏదో చెయ్యి పట్టుకున్నానే అనుకో. నన్ను కొడతావా? పొరకతా కొడతానని నోటి కొచ్చినట్టు తిడతావా? పైగా నా ఆకారం జూసి బోడిగుండు బొర్రమీసం అంటా ఎగతాళిగా అంటావా? అందుకే నీ బతుకే ఎగతాళి చేసే స్థాయికి తెచ్చినా. ఏమనుకుంటివి ఈ ముసలయ్యంటే... నా పేరులో ముసలితనం వుండాది గానీ నాకు గాదు. ఈ గ్రామానికే మకుటంలేని మారాజునే. నన్నెదిరించేదానికి నీ తరమౌనా. నా పంతం నెగ్గించుకున్నా సూడు!"

మంచం పైన కూర్చుంటూ అన్నాడు.

ఒక్కసారి ఆపాద మస్తకం ఆమెనొకసారి ఎగాదిగా చూశాడు.

ప్రకృతిలోని అందమంతా తన కోసమే మంచంమీద పరచుకుని ఉన్నట్లనిపించింది.

తన హయాంలో దాదాపు అయిదు మందికి కన్నెరికం చేశాడు. కానీ ఇంత అందమైన అమ్మాయిని మాత్రం తాకి కూడా ఎరుగడు. అందుకే ఆతని మనసులో ఆమెపైన అంతవరకూ ఉన్న ద్వేషం స్థానంలో ప్రేమ పుట్టుకొచ్చింది.

"ఎంత అందంగా వుండావే. ఆ ముక్కు తీరు, వెడల్పయిన నుదురు, సుట్ట ఎంటికలు, పెద్ద పెద్ద కండ్లు, ఆ బుగ్గలు, వద్దికయిన వళ్ళు... మా కులంలో కూడా నీ మాదిరి తీరయిన ఆడదే లేదనుకో... పోనీలే... నీకు నేను కన్నెరికం చేస్తా. పరమనెంటుగా నేనే ఉంచుకుంటా. నీపైన ఈగ వాలనివ్వను. ఏనా కొడుకును కన్నెత్తి సూడనియ్యను. బతికినంతకాలం నీకు కూడూ, గుడ్డా, గుసురు అన్నీ నేనే ఏర్పాటు చేయిస్తాలే"

అంటూ తన్మయత్వంతో మాట్లాడాడు.

కానీ అవేవీ వినే స్థితిలో ఆమె లేదు.

మత్తులో, మత్తుగా మూలుగుతోంది.

తను తెచ్చిన వంద రూపాయల నోటును ఆమె పైట చెరగుకు కట్టాడు. ఆ తర్వాత ఆమెను అక్కున చేర్చుకున్నాడు.

సాయంత్రం ఎప్పుడో పోసిన నూనె అయిపోయి ఉండటంతో కొడిగట్టిన దీపం ఆ పాపాన్ని చూడలేనన్నట్లు ఆ సమయంలోనే మెల్లగా ఆరిపోయింది.

మూడు రోజుల వరుసగా ముసలయ్య మొసలిలా ఆమె అందాన్ని అంచెలంచెలుగా పీక్కుతిన్నాడు. ముక్కలు ముక్కలుగా, నలిపి నలిపి నమిలి మింగాడు. మూడోరోజు అతని చేతిలో పిప్పిగా మిగిలింది కోటమ్మ.

నాలుగో రోజు వదిలేశాడు. ఆ రోజు నుంచి రెండు మూడు రాత్రులు ఎవరెవరో వచ్చి తలుపు తట్టారు. మొదటిసారి తలుపు చప్పుడు విన్నప్పుడు ముసలయ్య అనుకుని తలుపు తీసింది. ఎవరో యువకుడు కన్పించడంతో తిట్టి పొరక పుచ్చుకుని తరిమికొట్టి తలుపు గడియ వేసుకుంది. ఇక ఆ తర్వాత ఎవరు తలుపు తట్టినా తీయలేదు. ఆ నాలుగు రోజులూ తన దుస్థితికి వెక్కి వెక్కి ఏడ్చింది. కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. కళ్ల

లో నీరు ఇంకిపోయేదాకా ఏడ్చింది. ముఖ మంతా దుఃఖం చేసుకుని ఏడ్చింది.

ఏడ్చి ఏడ్చి అలాగే ఆలోచనల్లో పడిపో యింది.

ఈ సమాజాన్ని ఎదిరించాలనుకుంది. కానీ తన దుస్థితికి ఆ మరుక్షణమే నీరుకారి పోయింది. ఈ మగ సమాజం ఒక మదిం చిన ఏనుగులా అనిపించింది.

దాంతో తలపడడానికి వీలవునా? కాదు. ఏ మాత్రం వీలు కాదు.

అలా ఎందుకనుకోవాలి? గడ్డిపోచలు మదపుటేనుగు సంగతి ఉండనే వుంది కదా. నిజమే. తను గడ్డిపోచ, ఒకే ఒక గడ్డిపోచ వల్ల ఏమవుతుంది. దాని అడుగుల కిందపడి నలిగిపోక తప్పదు. దాన్ని బంధించడం వల్ల కాని పని. ఎందుకుంటే తనకు తోడుగా మరో స్త్రీ గడ్డిపోచ ఒక్కటీ లేదు. ఈ సమాజంలో తను ఒంటరి. ఓడిపోక తప్పదు.

ఇప్పుడేం చేయాలి? గురవయ్య కూతురు బుడ్డమ్మలాగా చావడమా!

చచ్చి ఏం సాధిస్తాం? చచ్చింతర్వాత తన వాళ్ళను ఎవరు చూస్తారు.

అయితే ఈ నికృష్ట జీవితం ఇలాగే సాగా ల్సిందేనా?

అలా సాగడానికి వీలులేదు.

అయితే ఇప్పుడేం చేయాలి? "

పరిపరివిధాలా ఆలోచించింది. బుర్ర పగి లేలా ఆలోచించింది. ఆ రాత్రంతా ఆలోచిం చింది. ఆలోచించగా, ఆలోచించగా చివరికి ఆమెకొక సమాధానం దొరికింది.

"బసివినిగా మార్చి కన్నెరికం చేసినవాడు ముసలయ్య, ఈ మగ సమాజానికి వాడొక ప్రతినిధి. వాణ్ణి ఎలాగూ ఎదురించలేము. రాజీపడడమే మేలు. అంతకంటే చేసేది గూడా ఏమీ లేదు. వాడు చెప్పినట్లు వాడిక నుగుణంగా నడ్చుకొని తన బతుకు కుక్కలు చించిన విస్తరి కాకుండా చూసుకుంటే చాలు. అతని దాపులో మరే మగాడి కన్ను పడ కుండా ఉండొచ్చు తన వాళ్ళకు సహాయం గానూ ఉండచ్చు అంతకంటే మార్గం ఏముంది? ఈ జన్మకింతే. ఆ బోడిగుండు బొర్రమీసాలోడే మొగుడనుకుంటే సరిపో తుంది. ఈ సమాజం అంగీకరించనీ, అంగీక రించకపోనీ, చివరికి ఆ ముండాకొడుకూ ఒప్పుకోనీ, ఒప్పుకోకపోనీ, వాడే నా మొగుడు. నాకు కన్నెరికం చేసిన మొగుడు. వాడికొక్క డితోనే ఈ జీవితం... ఈ శరీరం మిగిలిపో వాలి. అంతే"

దానికి ముందు చేయాల్సిందేమిటి? మళ్ళీ ఆమె అంతరంగం ప్రశ్నించింది.

అతన్ని మంచి చేసుకోవాలి. అతనే చెప్పా డుగా. నా మాట వింటే నీ మీద ఈగ వాల నియ్యనని. అలాగే చేయాలి. అతన్ని మెప్పిం చి, వప్పించి ముందు ఈ గుడిసె నుంచి బయటపడాలి" సమాధానం చెప్పుకుంది.

ఆ సమాధానమే ఆమెకు సరయిందిగా అని పించింది.

అలాగే నిద్రపోయింది.

ఈ మధ్యలో ఎన్నోసార్లు తలుపు తట్టారు. అయినా ఆమె తలుపు తీయనేలేదు.

* * *

ఇలాగే మరో వారం గడిచింది.

పల్లెలో కోటమ్మ బసివిని అన్న వాస్తవం పాతబడసాగింది. ప్రతి రాత్రీ ముసలయ్య బసివి గుడిసెకు వస్తూ పోతూనే ఉన్నాడు.

కోటమ్మ పగలంతా వాళ్ళ పొలాల్లోకే కూలికి పోతోంది. కూలి చేయగా వచ్చిన డబ్బుల్ని ఒకచోట చేరుస్తోంది.

ఆరోజు కోటమ్మకు ఏ పనీ లేకపోయింది. ఇంటికి బయలుదేరింది. ఊరిముందరికి వచ్చింది. అప్పుడే ఇంటినుంచీ ముసలయ్య పొలానికి వెళుతున్న కిష్టయ్య ఎదురుపడ్డాడు. ఆమెనే ఎగాదిగా ఒక్కసారి చూసి "యాడికి బొయింటివి కోటమ్మ?" అంటూ ప్రశ్నించా డు. ఎప్పుడు ఎదరుపడినా ఆతను మామూ లుగా వేసే ప్రశ్న, ఆ ప్రశ్న వేసినప్పుడంతా అతను మెలికలు తిరిగిపోయేవాడు. ఆ పోయేదాంట్లో బిడియమూ, సిగ్గూ పెనవేసుకు

న్నట్లుండేది. అందుకే అతన్ని చూసి వీడొక పిచ్చోడనుకుని తిరస్కారంగా చూసి ఎగతాళిగా నవ్వుకునేది. కానీ ఈ రోజు వేసిన అదే ప్రశ్నలో ఆమెకు ఎన్నో అర్థాలు తోచాయి. ఆ బిడియమూ లేదు. ఆ సిగ్గూ లేదు. మెలికలు తిరిగిపోవడమూ లేదు. వాటి స్థానంలో తనేదో తప్పు చేసిన వాడిలా అనిపించే భావం, ఏదో బంధం ప్రస్ఫుటంగా కనిపించాయి. అందుకే కాబోలు అతను తలవంచుకుని ఉన్నాడు. అతన్ని చూసిన కోటమ్మకు ఆ స్థితిలో అతనిపట్ల కాస్త సానుభూతిలాంటి భావం కలిగింది. అందుకే "ఏదోలే. ఇట్ల జరిగిపోతావుండాది"అని చెప్పేసి వచ్చేసింది.

ఆమె ఇంట్లోకి అడుగు పెట్టగానే పలకరించింది తల్లి,

"అమ్మా, నువ్వు ఎప్పుడొస్తావా అని చూస్తున్నానమ్మా" కళ్ళ నీళ్ళు తెచ్చుకుంటూ అంది.

ఆ రోజంతా తన కుటుంబసభ్యులతో గడిపింది కోటమ్మ. అలా గడవడం మనసుకెంతో ఊరటను, ఆనందాన్ని కలిగించింది. రాత్రి కాగానే తన గుడిసెకు చేరింది.

ఏవేవో ఆలోచనలతో ఆమెకు నిద్ర పట్టడం లేదు.

ఇంతలో తలుపు చప్పుడయింది.

ముసలయ్యేనుకుని తలుపు తెరిచింది.

ఎదురుగా ఉన్న మనిషిని చూసి అవాక్కయిపోయింది. ఈ ఊరి గుడి పూజారి... శాస్త్రులు. నెత్తిన శాలువా కప్పుకొని దొంగలా చూస్తూ నిలబడి ఉన్నాడు.

తలుపు తెరవగానే గబుక్కున లోపలికి గెంతాడు.

"ఊఁ. తలుపేసేయి. ఎవురయినా చూస్తారు. ఆ తర్వాత నా పరువుండదు. అంటరాని దాంతో కులికాడని నా అర్చకత్వం ఊడపీకుతారు. యేసెయ్యి" అంటూ స్వరం తగ్గించి గోల పెట్టాడు.

కోటమ్మకు వళ్ళు మండింది.

తనను ముద్దరేసి వదిలేయడానికి అతనే మూలకారకుడని ఆమెకు తెలుసు. అందుకే అతన్ని చూడగానే నిలువునా నరికివేయాలన్నంత కోపం వచ్చింది.

పెను గాలికి ఊగిపోయే చిగురుటాకులా కోపంతో ఊగిపోయింది.

"రేయ్! పిలక నా కొడకా. సిగ్గు లేదంట్రా నీకు. చేసేది పూజలు. దూరేది బసివిదాని గుడిసెనా? మళ్ళా మడి, అంటు. తుఁ, ఇట్లా శాస్త్రాలు చెప్పి ఎందరి కొంపలు కూలుస్తావురా... ఎందరి ఆడపిల్లల గొంతు కోయిస్తావురా.... కసాయి నా కొడకా. పోరా బయటకు లేకుంటే పీక పిసికి సంపేస్తా... పో" మెడపట్టి బయటికి తోసి గడియ పెట్టేసింది.

ఆ మరుక్షణమే ఒక నిర్ణయానికొచ్చేసింది. 'రేపట్నుంచే ఈ గుడిసెలో ఉండకూడదు. అంతే"

అనుకున్న ప్రకారం ఆ మరునాడే తను ఆ గుడిసెలో ఒంటరిగా ఉంటే ఎదురయ్యే సమస్యల గురించి, వచ్చిపోయే వాళ్ళ గురించీ ముసలయ్యకు ఏకరువు పెట్టింది.

## ఎవరు గొప్ప?

ఆనంద గజపతిరాజావారితో దాసుగారు పేకాట ఆడుతున్నారు. మూడు రాజులు పడడంతో 'షో'అంటూ చూపారు దాసుగారు ఆనందంగా.

'నా వద్ద మూడాసులున్నాయి.. నాదే గెలుపు' అన్నారు రాజావారు నవ్వుతూ.

దాసుగారు అమాయకంగా ముఖంపెట్టి 'రాజావారూ... ఆసులు రాజులకన్నా గొప్పవా? ' అన్నారు.

ఆయన గడుసుతనాన్ని మెచ్చి రాజావారు దాసుగారికే గెలుపును ఇచ్చేశారు.



జరిగిన సంఘటనల్ని వివరించింది. తన తల్లిదండ్రుల దగ్గర ఉండిపోతాననీ, కోరుకున్నప్పుడు ఎవరితో కబురంపినా చివరి గుడిసెకు వచ్చి కోరిక తీరుస్తానంది ఆ మాటే ముసలయ్య చేత చెప్పించి తల్లిదండ్రుల దగ్గరనే ఉండిపోయింది.

13



కాలపురుషుడు మరికొన్ని రోజుల్ని చకచకా చప్పరించి మింగేశాడు.

ఒకరోజు...

పెందలాడే నిద్ర లేచింది కోటమ్మ.

లేచినప్పటినుంచీ వంట్లో అదో మాదిరిగా అనిపించింది. వళ్ళు తూలింది. కండ్లు తిరిగాయి. వళ్ళంతా నీరసం అనిపించింది. కూర్చుంటే కాళ్ళు తిమ్మిరెక్కుతున్నాయి. కడుపులో దేవినట్టు ఒకటే వికారం. ఏదయినా తినాలనిపిస్తోంది. కానీ తిన బుద్ధి కావడం లేదు. ఒకటే ఆరాటం.

"ఈ నీరసం నాకు ఉండేదేలే" అనుకొని ఎలాగో పళ్ళు తోముకుని, పొయ్యి మంటేసి నీళ్ళు కాచుకుని స్నానం చేసింది... ఆమె ముఖంలోను, వంట్లోను ఏదో కొత్త కాంతి వచ్చినట్టుంది. ఎంతో అందంగా మెరిసిపోసాగింది.

పొయ్యిమీద చట్టి పెట్టి నీళ్ళు పోసి ఎసరు పెట్టింది.

కాగులో నుంచీ రెండు పడుల సజ్జలు తీసి రోట్లో పోసి కుదురుపెట్టింది. అన్ని నీళ్ళు పోసి రోకలితో దంచసాగింది. మధ్యలో చిన పాప లేచి వచ్చి అక్కకు సాయం చేసింది.

ఇంతలో ఉన్నట్టుండి కడుపులో తిప్పినట్టయింది. వాంతి వస్తున్నట్లనిపించింది. పరిగెత్తుకుంటూ పెరట్లోకి వెళ్ళి కక్కుకుంది. అలా రెండు మూడుసార్లు కక్కుకుంది.

ఆదెమ్మ అది గమనించి "భయపడొద్దు తల్లీ. యిదేమీ రోగం కాదులే. నెలతప్పినప్పుడొచ్చే వాంతులు" అంది.

ఆ మాట వినగానే కోటమ్మ క్షణకాలం నివ్వెరపోయింది.

"తన పరిస్థితికి పిల్లలా? వాళ్ళు పుడితే, వాళ్ళనెవరు సాకుతారు? బసివిదాని బిడ్డలుగా తండ్రెవరో తెలియని స్థితిలో, తెలిసినా చెప్పుకోలేని స్థితిలో ఎలా బతుకుతారు? ఈ సమాజంలో వాళ్ళకు విలువేముంటుంది? "

తీవ్రంగా ఆలోచించసాగింది.

"కానీ మాతృత్వం అనేది ఆడదానికి ప్రకృతి ఇచ్చిన వరం. ఎందుకు కాదనుకోవాలి? ఏం? పెళ్ళయిన ఆడదే పిలల్ని కనాలా! పెండ్లి కాని ఆడది కనకూడదా? కంటే తప్పేమిటి? కంటాను. ఎన్ని కష్టాలొచ్చినా పెంచి పెద్ద చేస్తాను. వాళ్ళను గొప్పవాళ్ళను చేస్తాను"

పరిపరి విధాలా ఆలోచించసాగింది.

ఆదెమ్మకు కూతురు నెలతప్పడం ఆనందంగా ఉన్నా బసివిగా మారిన కోటమ్మ భవిష్యత్తును తల్చుకుని భయపడిపోయింది.

అందుకే చూస్తూ మౌనంగా ఉండిపోయింది.

రెండు మాసాలు గడిచాయి.

కడుపు తెచ్చిన కొత్త అందాలతో కోటమ్మ ఇంకా అందంతో మెరిసిపోసాగింది. ఆమె శరీరం కొత్త కాంతుల్తో మిలమిలా మెరుస్తోంది.

అలాంటి పరిస్థితిలో పొలంలో పనిచేస్తున్న కోటమ్మను చూశాడు ముసలయ్య. ద్విగుణీకృతమైన ఆమె అందాన్ని చూసి తట్టుకోలేకపోయాడు. ఆమె పైన ఎన్నడూ కలగనంత ప్రేమ పొంగుకొచ్చింది.

వెంటనే పెద్ద జీతగాడు మల్లప్పను పిలిచాడు. అతను వచ్చి 'అయ్యా' అంటూ నిలబడ్డాడు.

"నువ్వు బొయ్యి ఈ దినం రాత్రికి. కోటమ్మను దాని గుడిసె దెగ్గిర్నే ఉండమని చెప్పు" అన్నాడు.

అతను కోటమ్మను పక్కకు పిలిచి ఆ విషయం చెప్పాడు.

ఆ మాట కోటమ్మకూ ఆనందాన్నే కలిగించింది. తన కడుపు విషయం చెప్పి, ఈ బిడ్డ నీ బిడ్డే అని చెప్పి మురిసిపోవాలనుకుంది.

ఆ పగలంతా ఆ ఆలోచన్లతోనే గడచిపోయింది. సాయంత్రం భోంచేసి నిదానంగా తన గుడిసెకు వెళ్ళి దీపాంతిలో నూనెపోసి, వత్తివేసి వెలిగించింది. శుభ్రంగా ఇల్లు ఊడ్చింది. మంచం పైనున్న దుప్పటి దులిపింది. ఆ తర్వాత ముసలయ్య కోసం ఎదురు చూస్తూ కూచుంది.

పది గంటల రాత్రికి తన బట్టతలను నిమురుకుంటూ బొర్రమీసం తడుముకుంటూ వచ్చాడు ముసలయ్య.

అతను రాగానే "రా... ఇలా కూర్చో" అంటూ ఆహ్వానించి మంచం చూపించింది.

ఎప్పుడొచ్చినా మౌనంగా ఉండి శరీరాన్నప్పజెప్పేసి అవసరమైనంత వరకే అరకొరగా మాట్లాడే కోటమ్మ ఆరోజు సంతోషంగా కనిపించడం, పైగా సాదరంగా ఆహ్వానించడం చూసి ముసలయ్య ఆశ్చర్యపోయాడు.

"ఏం భలే సంతోషంగా వుండావే. ఏం కత?" అంటూ పళ్ళు యికిలించి నవ్వుతూ వెళ్ళి మంచంపైన కూర్చున్నాడు.

"ఏం లేదు... నీకు ఒక సంతోష వార్త చెబుదామనీ..." దూరంగా నిలబడి మెల్లగా చెప్పింది.

"సంతోష వార్త! ఏమది?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నాకు... నాకు..."

"ఆс నీకూ..."

"నెల తప్పింది. మూడో నెల" అని చెప్పి తలవంచుకుంది.

ఆ మాట వినగానే తన బట్టతల పైన అమాంతం పిడుగు పడినట్టనిపించింది. భూమి బద్దలైనట్లనిపించింది. మరుక్షణమే తేరుకుని "నీ కెందుకు కడుపు?" అన్నాడు సీరియస్‌గా.

"ఆс..." అంది అయోమయంగా కోటమ్మ.

"బసివిదానికి కడుపంటే అందరూ నవ్విపోతారు. పైగా బసివికి బిడ్డలు పుడితే వాళ్ళనెవరు సాకుతారు? ఎవరు చూస్తారు? అదొక లంపటం. కోటా... వద్దులే. రేపు రాజాసాయిబు డాక్టర్ దగ్గిరికి పొయ్యి తీయించెయ్. అన్ని ఏర్పాట్లు నేను చేయిస్తాలే"

ఆమెను తన వడిలోకి తీసుకుంటూ అనునయంగా అన్నాడు.

"ఆహాс... నేను తీయించుకోను. నా ఒంటరి బతుక్కి వొగతోడు గావాల. నా బిడ్డే నాకు తోడు" అంది.

"నీకే తాడూ బొంగరంలే. నీకింకో తోడా..."

"ఏమన్నాగానీ, నేను బిడ్డెను కంటాను!"

"అబ్బ... సెప్తే యినవే..." కసురుకుంటూ ఆమెను దూరంగా తోసేశాడు. కోటమ్మ దూరంగా వెళ్ళి నిలబడింది.

అతను లేచి వెళ్ళి ఆమె గడ్డం పట్టుకుని "నా మాటినను. నీకు బిడ్డెలొద్దు. అదొక జంజాటం" అన్నాడు.

"ఆరు నూరు గానీ, నూరు ఆరుగానీ... నాకు బిడ్డె కావాల్సిందే. నా బిడ్డె నాకు కావాల్సిందే" వెక్కి వెక్కి ఏడవసాగింది.

"అట్లయితే నీ మొగం సూడను" కచ్చితంగా చెప్పాడు.

"నువ్వు సూడకపోయినా ఫరవాలేదు. నేను తీయించుకోను, నా కడుపులో నెత్తురు గుడ్డును సంపుకోను" ఏడుస్తూనే అంది.

"నీ నిర్ణయం మారదా?"

"మారదు. ఎప్పటికీ మారదు"

"అయితే నీ కర్మ. నేనింక నీ దగ్గరికి రాను. నేను రాకపోతే ఆ తర్వాత నీ బతుకు ఈనగాచిన నక్కలపాలే"

"ఏమైనా గానీ గాక నా నిర్ణయాన్ని మార్చుకోలేను" ఖరాఖండిగా చెప్పేసింది.

ముసలయ్య కోపం నసాళానికెక్కింది.

"ఛ... అఘోరించు" తలుపు తెరచుకుని గబగబా వెళ్ళిపోయాడు.

కోటమ్మ మంచంపైనే కూలబడి వెక్కి వెక్కి ఏడుస్తూ ఉండిపోయింది.

కాలం మరో ఏడు మాసాల్ని ఎగరేసుకుని వెళ్ళిపోయింది. కోటమ్మకు నవమాసాలు నిండాయి.

ఆమె తల్లిదండ్రులు, చెల్లెలు ఆమెకు ఏ లోటూ లేకుండా చూసుకున్నారు, సేవలు చేశారు.

ఊర్లో ఆడవాళ్ళు నానా రకాలుగా సూటీ పోటీ మాటల్తో కోటమ్మ గుండెను గాయం చేస్తూనే ఉన్నారు.

అయినా కోటమ్మ అదరలేదు, బెదరలేదు. బిడ్డను కననే కనింది.

ఆడబిడ్డ. తల్లి పోలికే, తెల్లంగా కుందనపు బొమ్మలాగుంది.

పొత్తిళ్ళలో బిడ్డెను చూసుకుని మురిసిపోయింది కోటమ్మ.

"ఎట్లో, దేవుడి దయవల్లా, ఆ బోడిగుండు బొర్రమీసాల కర్రోడి పోలిక రాలా. నా పోలికే వచ్చింది" అని మనసులోనే కాస్త సంతోషించింది.

ఏదిఏమైనా మురిపాలు మూట గట్టుకొని పుట్టిన ఆ బిడ్డెను చూసుకుని ఆ ఇంటిల్లిపాదీ మురిసిపోయారు. ఆ బిడ్డెను అపురూపంగా చూసుకోసాగారు.

కోటమ్మ కడుపు తీయించుకోనందుకు అలిగి వెళ్ళిపోయిన ముసలయ్య ఆ తర్వాత ఎప్పుడూ ఆమెవైపు కన్నెత్తి కూడా చూడలేదు. బిడ్డను కనడంతో ఆ ఊరి మగవాళ్ళు ఆమె ఒక బసివిని అన్న విషయం కూడా మరచే పోయారు.

కోటమ్మ తన బిడ్డకు అరుణమ్మ అని పేరు పెట్టి అపురూపంగా పెంచుకుంటోంది. పాపే ఆమెకు ప్రాణం. పాపే ఆమెకు ఊపిరి.

## 14

కోటమ్మ కూలికీ నాలికీ పోతూనే ఉంది. కానీ ముసలయ్య పనులకు మాత్రం పోవడం లేదు.

ఎలాగో కష్టపడుతోంది. తన పాప కోసం, తన వారి కోసం రేయింబవళ్ళు కష్టపడుతూనే ఉంది. రెక్కలు ముక్కలు చేసుకుంటోంది. ఎవరికీ లొంగకుండా కష్టపడుతోంది.

ఒకరోజు పాపను ఇంట్లో వదలి తన చెల్లెల్ని వెంట పెట్టుకుని కురవపల్లె వైపు బయలుదేరింది కోటమ్మ. అక్కడ గొల్లపల్లోళ్ళ చెనిగ చేను తవ్వుతున్నారు. కూలీలు అవసరం.

ప్రతి సంవత్సరం నవంబర్ మాసంలో చిత్తూరు ప్రాంతం నుంచీ, వేలూరు ప్రాంతం నుంచీ పేదజనం పనులు వెదుక్కుంటూ ఆ ప్రాంతానికి వస్తుంటారు. ఆ ఏడూ దిగేశారు.

ఎక్కడ చూసినా వాళ్ళే. ఏ చేలల్లో చూసినా వాళ్ళే.

"వీళ్లకు దొరికే కూలి పనులు మనకు దొరకవా?" అనుకుంటూ వెళుతున్నారు కోటమ్మ, చినపాపా.

తమ రైతుగాళ్ళ పల్లోళ్ళ సిద్ధయ్య "మనుషులవసరం. చెనిగ చెట్లు పెరకాల. తేటయితే నేలలో తేమ ఆరిపోయి బిగసకపోతాది. మీ ఆడోళ్లుంటే పంపించరా" అన్నాడు.

ఆ విషయం యింట్లో చెప్పి కూతుళ్ళను పంపించాడు గుండెకాయలోడు.

వీళ్ళు వెళ్ళేటప్పటికే మడకతో చెనిగ సాళ్ళు దున్నేసి ఉన్నారు. చెట్లన్నీ పైకి లేసి ఉన్నాయి. తంగలామాలోళ్ళు కొండ్రల్లోమునాలు పట్టుకొని ఆ చెట్లను ఏరి ఏరి మట్టి ఖదిలించి కుప్పలు పెట్టసాగారు.

ఆ ఏడు పంట బాగానే పండింది. చెట్లు వేర్లనిండా గుత్తులు గుత్తులుగా శెనక్కాయలు కనిపిస్తున్నాయి. సిద్ధయ్య వీళ్ళను చూస్తూనే మరో కొండ్ర చూపించి శనిగ తీగెల్ని ఏరి కుప్ప పెట్టమన్నాడు. ఆ కొండ్రలో యింకా యిద్దరు మగవాళ్ళు కూడా వున్నారు.

వాళ్ళతోబాటు అక్కా చెల్లెళ్ళు పని చేయసాగారు. ఆ యిద్దరు మగాళ్ళు వాళ్ళకు పరిచయమయ్యారు. ఒకతని పేరు మణి. మరో

అతని పేరు మున్నాండి.

మణిపక్క మునమే కోటమ్మది.

అతడు మాటా మాటా కలిపాడు. కబుర్ల లోకి దించాడు.

కోటమ్మ ఊరూ పేరూ అడిగి తెలుసుకున్నాడు. తనది చిత్తూరు అవతల తమిళ ప్రాంతమని, రాయవేలూరు దాటిపోవాలని, తన పేరు సుబ్బర మణి అని, తనతోపాటు ఇంకొందరు కూడా వచ్చారని, ఈ సీజన్లో ఇక్కడ పనులుంటాయి కనుక ఇలా రావడం తనకు కొత్తేం కాదని చెప్పుకొచ్చాడు. తమిళ యాసతో విచిత్రంగా మాట్లాడే మణి కబుర్లతో కోటమ్మకు శ్రమ తెలీడం లేదు.

గెల్లపల్లోళ్లు మెట్టభూములు చాలా ఉన్నాయి. రోజుకు ఇరవై మంది పనిచేసినా పదహైదు రోజులు సులభంగా పడుతుంది. పీకేసి వామేసిన చెనిగ తీగెల నుంచీ మళ్లీ చెనిక్కాయలు విడిపించే పని, తిరిగి పదిరోజులుంటుంది. అలా చేసుకుంటూ పోతే నెలపైగానే పని దొరుకుతుంది. ఆ కారణంగా అటు మణి, ఇటు కోటమ్మ అక్కడికే పనికి పోతున్నారు.

అలా ఏర్పడిన వాళ్ళ పరిచయం కాస్తా అభిమానంగా మారింది. ఒకరి బాధలు ఒకరు చెప్పుకోసాగారు.

మూడోరోజు అదే చేన్లో అదే పని చేయసాగారు. అక్కడ మరి కొన్ని వివరాలడిగాడు మణి.

"కోటమ్మా. మీరు ఏ వర్ణస్తులు. అదే. కులందా ఏమి? " అడిగాడు. అది ఎదురు చూడని ప్రశ్న. కష్టపడేదానికి ఏం కులమైతేనేమి అనుకుని ఒక్క క్షణం ఊరికే ఉండి "మేము మాదిగోళ్ళం" అంది.



"మరి మీరేమిటోళ్ళు? " అతన్ని ప్రశ్నించింది.

"మాదీ యించుమించు అదే కులందా. తంగలామాలోళ్లం"

"ఓహో. తంగలావాళ్ళా, మీకు భూములు గట్రా లేవా? "

"మా ఊర్లో శ్యానా మందికి నేలదా వుండదు. ఎన్ని మంది జనమున్నా, అందురూ ఇందమాదిరి ఏదో పని సేసికొనిదా పసి తీర్చుకోవాల. నేల ఉండి పూడ్చినా ఏమి సేస్తుము. తన్నిదా లేదు. వరషం పడితేదా పండును. మా సైడు వరషం రొంబా తక్కువ. గవురుమెంటువోడిదా ఏమి సెయ్యడు. ఇంక సాపాటు యెంగే? అందుకే యిందు పక్కం వస్తుము. దుడ్డు సరిసేసుకునిపోయి దాన్నెం కొంటుము"

తమ కష్టాలు చెప్పాడు

"పాపం" అనుకుంది.

మణితో ఏర్పడిన ఆ పరిచయం. అతని అమాయకత్వం ఆమెను అతనికి మరికాస్త దగ్గర చేర్చింది. ఒకరి పట్ల ఒకరికి అభిమానం పెరిగింది. ఆ యిద్దరికీ ఏదో మాట్లాడుకోవాలనీ, యింకా ఒకరి బాధలు ఒకరు చెప్పుకోవాలనీ అనిపించసాగింది.

ఇంకో రోజు చెనిగ తీగెలు పీకడం పూర్తయిపోయి, అలా పీకిన చెట్లన్నీ కసిరెడ్డిగారి పల్లె సమీపాన మరో చేన్లో పెద్దవామిగా వేశారు.

ఆ వామి చుట్టూ కూర్చొని కూలీలు చెట్లలోనుంచీ కాయలు విడిపించి తట్టకు పోస్తున్నారు.

మణి, కోటమ్మ పక్కపక్కనే కూర్చొని ఒక్కొక్క చెట్టునే చేతుల్లోకి తీసుకుని కాయల్ని లాగి వాటంగా పెట్టుకున్న వెదురు బుట్టల్లో వేస్తున్నారు.

"కోటమ్మ! వొరుమాట సెప్తును. కోబం దా రాదు గదా"- అన్నాడు సంశయిస్తూ మణి.

"ఏమీ? " ఆత్రుతగా అడిగింది కోటమ్మ.

"నాను ముందే సెప్తును. కోపం పడవాదు"

"ఫరవాలేదు సెప్పు"

"నువ్వన్నా, నీ మాటన్నా నాకు నిండా యిష్టందా అయిపూడిసింది. నువుదా ఏమీ అనుకోకపోతే..." అనుమానంగా ఆమె కళ్ళలోకి చూశాడు.

"ఉహూఁ ఫరవాలేదు. ఏమీ అనుకోను" భరోసా యిచ్చింది. ఆ మాటతో కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు. చుట్టూ ఒక్కసారి చూశాడు. ఇక్కడొకరు అక్కడొకరుగా, సాలుల్లో పెరిగివున్న ఆముదపు చెట్ల నీడల్లో కూర్చొని చెనిక్కాయల్ని విడిపించుకుంటున్నారు. వీళ్ళకి కొంత దూరంలో మున్నాండి చెనిక్కాయలు విడిపిస్తూనే, అతని చేత్తోపాటు నోటిని అదేపనిగా ఆడిస్తున్నాడు. ఒకవైపు చెనక్కాయలు వొలిచి గింజల్ని నోట్లో వేసుకుంటూ నమిలి నమిలి మింగుతున్నాడు. ఎవరయినా అటువైపుకు వచ్చినప్పుడు నోరు మెదపడంలేదు.

రైతులు మధ్యాహ్నం పెట్టే ముద్దసంగటి వాళ్ళకు చాలడం లేదు. అందుకని అలా చెనగింజలు తింటూ దాన్ని భర్తీ చేసుకుంటుంటారు చాలామంది. మణీ అదే చేస్తున్నాడు. మున్నాండీ అదే చేస్తున్నాడు.

అంతవరకు నోట్లో వేసి నములుతున్న గింజల్ని మింగేసి నిదానంగా చెప్పాడు మణి. "నీమింద నాకు రొంబా ప్రణయందా కలిగింది. నువ్వుదా వప్పుకుంటే మాతో వచ్చాడిసేయ్. మా వూరు పోయినాకా కల్యాణందా సేసుకుందును. నువ్వు సరే అంటే, నీకోసందా రేపు రాత్తిరికి, రేత్తిర్లో వచ్చును సూడు ధర్మవరం ప్యాసింజరు. దానికి రెడీగా వుందును. వస్తివో యెళ్ళి పూడుస్తాము" చెప్పాల్సింది ధైర్యంగానే చెప్పేశాడు.

"ఓరి... నీ మగబుద్ధి పోనిచ్చుకోలేదు గదరా. అట్ల కొంచెం కలుపుగోలుగా మాట్లాడినానో లేదో ప్రణయం అంటివి. మనసంటివి. కడాకు కల్యాణం అంటివి. వోరి నీ యిత్తగిల్ల. అమాయకంగా కనిపిస్తావుండావు

గానీ పరాయి స్థలం నుంచీ వచ్చినోడివి. ఏ మాత్రం యిది లేకండా ఉడికితే మనమూ అంత ఏద్దాం అనే లెక్కన మాట్లాడితివే. ఈ రేత్తిరి బండికే లేసిపోదామంటివే. ఏమి ధైర్నంరా అరవోడా నీకు"

అనుకుంటూ మౌనంగా ఉండిపోయింది.

అది చూసి కాస్త బెదిరిపోయాడు మణి.

"ముందే పరాయిదేశం. యాడబొయ్యి యాడొచ్చునో. మనసులో మాట సెప్పేస్తిని. వోళ్ళోళ్ళవరన్నా వచ్చి నాలుగు తంతే దిక్కెవుర్రా దేముడా? " అనుకున్నాడు.

అందుకే ఆమె కోపం పోగొట్టి మంచి చేసుకోవాలనుకున్నాడు.

"కోబం వచ్చినట్టుండాది. మనసులో మాటదా సెప్తిని. యిష్టంలేక పోతే పోనీలే. ఏమీ అనుకోవద్దు. బాధ కలిగింటే సెమించెయ్" అన్నాడు.

అయినా ఆమె చాలాసేపు మౌనంగానే ఉండిపోయింది. ఆమె మౌనం చూసి ఆ తర్వాత మాట్లాడలేకపోయాడతను. తన పనిలో తాను మునిగిపోయాడు.

ఆమె పరిపరివిధాలా ఆలోచించసాగింది.

"వీడితో పోతే ఏమైపోయింది. శీలం చెడిపోతుందనా? బసివిదానికి శీలమేముండాది. ఈ పొద్దు గాకపోయినా రేపయినా ఎవుడో వొగడు బలవంతంగానైనా నన్ను అనుభవించాలనుకుంటాడు. అలా చేస్తే తాను మాత్రం ఏం చేయగలదు. నిండా మునిగినాకా చలే ముందని ఊరికే ఉండిపోవాల్సిందేగదా. సరే పాపనేం చేయాలి. తల్లిదండ్రుల దగ్గర వదిలేస్తే? అట్లా వొదిలేస్తే వాళ్లు సరిగా చూస్తారా? దానికంటే నిజం చెప్పేసి పాపను గూడా తీసుకుని పోతే సరిపాయ. అందుకు అతను వప్పుకోకపోతే ఏం జేయాల! చేసేదేముండాది. దానికొప్పుకుంటేనే పోతా. పైగా పెండ్లాడతానంటావుండాడు గదా. అదే జరిగితే ఈ బసివి జీవితం నుంచీ బయటపడి సుఖంగా జీవించవచ్చునేమొగదా! అందరిలాగా నేను సంసార జీవితం గడపవచ్చుగా. నలుగుర్లో గౌరవంగా తలెత్తుకొని తిరగొచ్చుగదా"

ఆలోచిస్తూనే పనిలో నిమగ్నమైపోయింది.

15



ఆ మరునాడు... సాయంత్రం...

పంచాయతీ సమితి నుంచి సర్పంచ్ ఆఫీసుకు ఇన్‌స్పెక్షన్ కోసం పై అధికారులు దిగారు.

వాళ్లకు తన బావి దగ్గర మామిడి తోటలో, రెండు కోళ్లను కోయించి, వండించాడు. సీమ సారా తెప్పించి డిన్నర్ ఏర్పాటు చేశాడు.

ఆ విందుతో బాటుగా పొందు కూడా ఏర్పాటు చేస్తే, తన పనులు బాగా జరిగిపోతాయి. తన బిల్లులకు డోకా వుండదు. పైగా భవిష్యత్తులో కాంట్రాక్టులన్నీ మనమే దక్కించుకోవచ్చు అని ఆలోచించాడు.

ఇంట్లో జీతగాణ్ణి పిలిచి కోటమ్మను బావికాడికి పిల్చుకరమ్మని చెప్పి పంపాడు.

"ఏమో, చాలా రోజులకు రమ్మన్నాడు. ఏమన్నా కనికారం కలిగిందేమో? " అనుకుంటూ బయల్దేరి వెళ్లింది కోటమ్మ.

బావి గడ్డన కూర్చోనున్నాడు ముసలయ్య. వెళ్లి ఎదురుగా నిలబడింది.

"యేమమ్మీ. నామింద రోసపడితివా? పోనీలే. బిడ్డె యెట్టుండాది? " నవ్వుతూ ప్రేమగా పలకరించాడు.

"బాగానే ఉండాది" తలొంచుకునే చెప్పింది.

"నాకు పుట్టింది కదా. ఎందుకు బాగుండదు? " బట్టతలను ఎడమచేత్తో నిమురుకుంటూ బొర్రమీసాలు కదిలేటట్లు, పండ్లు యికిలించి మరీ నవ్వాడు.

నల్లటి ముఖంలో తెల్లటి పండ్లు ముత్యాలా

మెరిసిపోతున్నాయి. ఆ మాట, ఆ నవ్వు అమెకు రుచించలేదు. అందుకే "ఏమో రమ్మంటివవంట. అది సెప్పు. బిరీనా పోవాల. పాప యేడస్తా వుంటాది" తొందరించింది.

"పోవచ్చులేమ్మే. ఏమీ లేదు. ఈ మామిడి తోటలో దద్దిలం వుండాది గదా. అందులో మా స్నేహితులకు యిందు ఏర్పాటు చేసినా. వడ్డించేవోళ్లు ఎవురూలే. అట్ల సాయం చేస్తావో ఏమో అని పిలిపిస్తి. అంతే. యింగేమీలే"

"డిన్నరంటే... ఎంతసేపుంటుంది? "

"ఎంతోసేపు యాడుంటుంది? అన్నీ రెడీగా ఉండాయి. ఇంక వడ్డించేదే. నువ్వు అందిస్తే సాలు. వోళ్లే వడ్డించుకుంటారు. వొగ గెంటలో అయిపోతుంది" సరేనంటూ వప్పేసుకుంది.

ఆమె వప్పుకున్నందుకు మనసులోనే ఆనందించసాగాడతను.

"తోపులో దద్దిలం చూసినావు గదా"

"ఆఁ... చూసినా"

"సరే. నువ్వు పదా. నేను మిషనొదిలి కాళ్లూ, చేతులూ కడక్కొస్తా" అంటూ లేచి మిషన్ షెడ్లోకి వెళ్లిపోయాడు.

ఇక చేసేదిలేక ఆ గడ్డపవతలున్న మామిడి తోటలోకి నడచి, దద్దిలం చేరుకుంది. అప్పటికే చీకటి దట్టంగా అలుముకుంటోంది. దద్దిలంలో హరికేన్ లాంతరు వెలుగుల్ని చిమ్ముతోంది.

అప్పటికే ఆఫీసర్లిద్దరూ పీకల్దాకా తాగి ముక్కలమురగా తిని వున్నారు.

"ఆ... రా... పాపా... రా... దా...దా..." ఆమెను చూడగానే లోపలికి ఆహ్వానించారు. అది సుమారుగా అయిదంకణాల బండ్లమిద్దె. తలుపు లేదంతే.

ముసలయ్య బాయికాడికొచ్చినప్పుడు అందులో విశ్రాంతి తీసుకుంటూ వుంటాడు. అప్పుడప్పుడూ కూలికి వచ్చిన ఆడవాళ్లతో అక్కడే తన కోరిక తీర్చుకుంటూ వుంటాడు...

లోపలికి అడుగు పెట్టింది కోటమ్మ.

అక్కడ... మధ్యలో ఒక టేబుల్. దానికిటు అటుగా రెండు కుర్చీలున్నాయి. గోడకు ఒక వారగా ఒక పట్టెమంచం...

ఆ టేబుల్ పైన ఖాళీ చేసిన బిర్యానీ పొట్లాలు, రెండు విస్కీ సీసాలు, విస్కీ నింపిన రెండు గాజు గ్లాసులు వున్నాయి. యింకా ఏవో పొట్లాలు... వాటినుంచి ఒక వైపు కమ్మటి మసాలా వాసన... మరోవైపు ఘాటయిన వెగటువాసన...

"అప్పుడే తినేసినారే. యింక నన్నెందుకు రమ్మన్నట్లో..." అనుకుంది - లాంతరు వెలుగులో వాటిని పరిశీలిస్తూ...

అక్కడ వాళ్లిద్దరు... తను... యింకెవ్వరూ లేరు.

అందుకే కొంచెం అనుమానపడింది. 'అయినా ముసలయ్య చెప్పింది చెయ్యకపోతే ఎలా? కాదంటే బతకనిస్తాడా' అనుకుంటూనే ఓ పక్కన వదిగి నిలబడింది.

ఆ యిద్దరిలో ఒకతను పైకి లేచాడు. ఆమెను సమీపించాడు.

"అబ్బ. ఎంత అందంగా ఉండావే. పల్లెల్లో కూడా యింత అందగత్తెలుంటారని యిప్పుడే తెలుస్తోంది..."

మత్తులో నత్తినత్తిగా మాట్లాడుతూ వెళ్లి ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"అయ్యో. వదులు. ఏం పనిది? " అంటూ దూరంగా జరిగింది.

"ఏం. నీకు ములసయ్య చెప్పలేదా? " యింకో అతను ప్రశ్నించాడు. తాగుతున్న సారాగ్లాసు పక్కన పెడుతూ.

"ఏమని? " తిరుగు ప్రశ్న వేసింది కోటమ్మ.

"మా కోసం ఒక అమ్మాయిని పంపిస్తానన్నాడు. ఆ విషయం చెప్పలేదా నీకు" మరో అతను తూలుతూ అన్నాడు.

ఆ మాట వినగానే ఒక్క క్షణం బిత్తరపోయింది. ఆ తర్వాత అసలు విషయం అర్థమైపోయింది కోటమ్మకు.

"దుర్మార్గుడు. నవ్వుతూ రమ్మని ఇంత పని చేస్తాడనుకోలే. నన్ను వీళ్లకు తార్చాలని చూసి

నాడు డాఫర్ నాకొడుకు" మనసులోనే అను కుంది. ఆమెకు కోపం ముంచుకొచ్చేసింది.

రెండో అతను లేచి వెళ్లి "అది కాదే పిల్ల. మాగిన టమోటా పండులా మురిపిస్తున్నావే. నీ రుణం ఉంచుకోంలే. డబ్బు లిస్తాం. ఎంతసేపు. కొంతసేపు అట్ల కండ్లు మూసుకో. అంతే" అంటూ ఆమె భుజంపైన చేయి వేశాడు.

ఇక ఓర్చుకోలేక పోయింది కోటమ్మ. తన శక్తినంతా కూడదీసుకుని ఈడ్చి చెంపన ఒక్కటిచ్చింది.

అంతే ఆ దెబ్బకు ఆ వ్యక్తి రెండు చుట్లు తిరిగి పడబోయి నిలదొక్కుకున్నాడు. గూబ పగిలి పోయినట్లనిపించింది. అతను బిత్తరపోయాడు. ఆ దెబ్బతో రెండో అతను భయపడిపోయి దూరంగా పోయి నిలబడ్డాడు. వాళ్ళకు మత్తు దిగిపోయినట్టనిపించింది.

"వొరే. నన్ను నమ్మించి ఈడికి రప్పించు కొని ఈ మాదిరి ప్రవర్తిస్తారా. మీరేం ఆఫీస ర్లురా. తాగి ఆడదాని సుఖం కోసరం కుక్కల మాదిరి వెంపర్లాడతా వుండారు. మీ బతుకూ వొగ బతుకేనా... యిద్దో నేనిదే సెప్తావుండా. నన్నొదిలేయండి లేకుంటే... రేపు పొద్దన్నే నేరుగా పొయ్యి మీ పై ఆఫీసర్లకు సెప్తా. యింకా మాట్లాడితే కలెక్టరు కాడికిపోతా. మిమ్మల్ని జైల్లో తోయిస్తా, మా కులపోళ్ళకు చెప్పి మీ అంతూ, నన్ను పంపించినోని అంతూ తేలుస్తా... జాగర్త"

అంటూ వాళ్ళ ముఖాన కేకరించి ఉమ్మేసి హెచ్చరించి వచ్చేసింది. ఆమెకు దద్దిలం ముందరే ఎదురు పడ్డాడు ముసలయ్య. ఆమె అలా ఆవేశంగా వెళ్ళిపోవడం చూసిన ముస లయ్య జరగరానిదేదో జరిగిపోయిందనుకొని దద్దిలంలోకి అడుగు పెట్టాడు.

అతణ్ణి చూడగానే... పేట్రేగిపోయారు వాళ్ళు.

"తుc... యిడియట్. యిష్టంలేని దాన్ని ఎందుకు పంపినావు? అది మా ముఖం మింద ఉమ్మేసి, కొట్టి వెళ్ళిపోయింది" అన్నా డొకడు.

> మీరేం ఆఫీసర్లురా. తాగి ఆడదాని సుఖం కోసరం కుక్కల మాదిరి వెంపర్లాడతా వుండారు. మీ బతుకూ వొగ బతుకేనా... యిద్దో నేనిదే సెప్తావుండా. నన్నొదిలేయండి లేకుంటే...

"వెళ్ళిపోవడమే కాదు. ఈ విషయం రేపే పైఅధికారులకు చెప్తుందంట. కలెక్టరుకు ఫిర్యాదు చేస్తుందంట" అన్నాడు యింకో అతను.

"మనల్ని జైలుకు తోయించి, మా అంతూ, నీ అంతూ తేల్చే స్తుందంట" అన్నాడు మొదటి ఆఫీసరు.

"అదే గనక జరిగితే మనం చచ్చినట్లే..." అన్నాడు రెండో ఆఫీసరు.

"ఈ విషయం ఏ పత్రికోడైనా విన్నాడో, కలెక్టర్‌దాకా ఎందుకు? కోర్టు లేకనే జైలుకు డైరెక్టుగా వెళ్ళి పోతాం"

"అందునా అత్యాచారం చేసేవోళ్ళకు కఠిన మైన శిక్షలున్నాయి"

"లైఫ్ వేసినా వేసేస్తారు"

"అప్పుడు మా పెండ్లాం బిడ్డలేం గావాల? "

"నిన్ను నమ్ముకోని వచ్చినందుకు మంచి శాస్తే జరిగింది"

"ఈ విషయం ఊర్లో తెలిస్తే యింకేమన్నా వుందా? "

"వీళ్ళు ఇన్స్‌పెక్షనని బొయ్యి రేప్ కేసులో తగులుకున్నారంటూ జనం కోడై కూస్తారు"

ఒకరి తర్వాత ఒకరు తమ బాధను, భయాన్ని వ్యక్తం చేశారు.

ఆఫీసర్లు అలా అనేసరికి తల తీసేసినంత అవమానమేసింది ముసలయ్యకు.

"ఇంత ప్రాబ్లం వస్తుందనుకోలేదు. ఇప్పుడేం చేయాలి? " తీవ్రంగా ఆలోచించాడు ముసలయ్య.

"నువ్వేం చేస్తావో మాకు తెలీదు. ఈ విషయం బయటకు పొక్కకుండా చూడు. మా మాన మర్యాదలిప్పుడు నీ చేతిలోను, ఆ అమ్మాయి చేతిలోను వున్నాయి"

"నువ్వే పంపించినావు. మమ్మల నువ్వే కాపాడాల్సిందే"

"ఆమె కాళ్ళే పట్టుకుంటావో, చేతులే పట్టు కుంటావో లేదా యింకేమన్నా చేస్తావో మాకు తెలీదు. ఈ చిక్కులో నుంచీ మమ్మల బయ టెయ్యి. చచ్చి నీకడుపున పుడతాం"

"అది మొత్తానికి బతికుంటే మాత్రం ఎప్పుడో వొగప్పుడు బయటపెట్టే తీరుతుంది"

"దాని వాలకం అట్లానే వుండాది చూస్తో వుంటే..." బాధగా చెప్పారు.

వాళ్ళ బాధను, జరిగిన అవమానాన్ని చూసి ముసలయ్య తట్టుకోలేకపోయాడు. "మీకేం భయం లేద్సార్, అది మా పల్లె బసివి. దాని కత నేను జూసుకుంటాను. మీరు నిశ్చింతంగా వుండండి... కానీ నా బిల్లులు..."

"ముందు ఇది సూడవయ్యా పెద్దమనిషీ. నీ బిల్లులు, క్లయిములు, ఆ తర్వాత" అంటూ అక్కడి నుండి వెళ్ళిపోయారు వాళ్ళు.

కోటమ్మ మీద కోపంతో పండ్లు పటపట కొరుకుతూ ఉండిపోయాడు ముసలయ్య.

* * *

ఆ మరురోజు సాయంత్రం... యింటి ముందర అరుగుపైన కూర్చొని దీర్ఘంగా ఆలో చిస్తున్నాడు ముసలయ్య.

అతని ముఖం అవమానంతోను, కోపం తోను కందిపోయి కనిపిస్తోంది.

అప్పుడే పొలం కాడినుంచీ ఎద్దుల్ని తోలు కొని వచ్చి గొడ్లకొట్టంలోకి వెళ్ళి వాటిని గాటిలోకి కట్టేసి వచ్చాడు కిష్టయ్య.

"వొరే కిష్టా, ఇలా రారా" అన్నాడు.

"అయ్యా!" అంటూ వెళ్ళి చేతులు కట్టుకొని నిలబడ్డాడు. అతని ముఖంలో కోపం చూసి తనేమైనా తప్పు చేశానేమోనని ఒక్కక్షణం ఖంగుతిన్నాడు.

"నువ్వు బొయ్యి, పెద్ద జీతగాడుండ్లా మల్లప్ప, వాణ్ణి యిట్ల పిల్చకరా"ఆజ్ఞాపించాడు.

సామాన్యంగా ముసలయ్య పెద్ద జీతగాణ్ణి పిలవడు. అతణ్ణి పిలిచేది దౌర్జన్యాలు, కొట్లాటలు వంటి పనులకే. అందుకే ఈరోజు ఏదో జరగబోతోందనుకుంటూ అక్కణ్ణుంచీ యింటికి వెలుపలున్న మరో గొడ్ల చావిడికి వెళ్ళి, అక్కడ వేరుచెనక్కాయలు మిద్దెపైకి పోయిస్తున్న పెద్ద జీతగాడు మల్లప్పను పిల్చు కొచ్చాడు.

"వొరే కిష్టా. నువ్వు బొయ్యి నీ పని చూసుకో పో" అన్నాడు ముసలయ్య.

అయినా ఏం చెబుతాడోనని ఓ చెవి అటు వైపే వేసి ఉంచాడు.

"వొరే మల్లిగా... ఆ బసివి కోటమ్మ నిన్న రేత్రి మా ఆఫీసర్లను బెదిరించింది. జైలుకు పంపిస్తానని శపథాలు పలికిండాది. అది బతికుంటే అంత పనీ చేస్తుందేమో... ఈ రోజు రేత్తిరికి దాన్ని సంపేయండి. సంపేసి, యింతకుముందు సచ్చిపోయిన బుడ్డమ్మ ఉరి పోసుకున్న చింతల తోపులోనే అదే చెట్టుకేసి యాలాడదీసేయండి. యిందా డబ్బులు. తీసుకోండి... జల్సా చేసుకోండి" అంటూ డబ్బుల కట్టను విసిరివేశాడు.

సంతోషంగా డబ్బులందుకొని బొడ్లో దాచు కుంటూ

"అయ్యా... అదింక సచ్చినట్లే అనుకోండి. తెల్లారే గుండికి దాని శవాన్ని చూస్తారు"

అంటూ తన కండల్ని కదిలించుకుంటూ వెళ్ళిపోయాడు మల్లప్ప.

* * *

అప్పటికి సరిగ్గా రాత్రి తొమ్మిది గంటలు కావస్తోంది.

పల్లెలో ప్రజలు అప్పుడే నిద్రకుపక్రమిస్తు న్నారు.

కిష్టప్ప ముసలయ్య ఇంట్లో పని ముగించు కొని పరుగున వచ్చాడు.

"మామా... గుండెకాయల మామా. ఓ ఆదెమ్మత్తా" అంటూ రొప్పుతూ గుండెకాయ

## మంచి నిద్ర కోసం...



కొంతమంది 'మంచి నిద్ర పోయి ఎన్నో ఏళ్లయిందని', మరి కొంత మంది 'సకల సౌభాగ్యాలున్నాయి గానీ, కంటి నిండా కునుకు కరువైం దని' వాపోతుంటారు. ఈ నిద్రలేమి సమస్యపై కాలిఫోర్నియా వైద్య శాస్త్ర వేత్తల బృందం పరిశోధనలు జరిపి ఆ సమస్యతో బాధపడే వారికి కొన్ని సూచనలు ఇస్తోంది. ఈ సూచనల ప్రకారం-

మనం నిద్రించే పడక గది విశాలంగా, నిద్రించే పక్క అనుకూలంగా ఉండేలా చూసుకోవాలి. నిద్రించడానికి, నిద్ర లేవడానికి క్రమం తప్పకుండా రోజూ ఒకే సమ యాన్ని పాటించాలి. కెఫీన్, నికోటిన్‌ల వాడకం తగ్గించాలి. రాత్రి వేళల్లో నిద్రించడా నికి రెండు గంటల ముందే ఆహారం తినాలి. పడుకునే ముందు తేలికగా జీర్ణమయ్యే చిరుతిండి తినొచ్చు. ప్రతి రోజూ వ్యాయామం చెయ్యటం వల్ల మానసిక ఒత్తిడి తగ్గి సుఖవంతమైన నిద్ర పడుతుంది. పడుకోబోయే ముందు గోరు వెచ్చని పాలుగానీ, హెర్బల్ టీ గానీ సేవించటం, గోరువెచ్చని నీటితో స్నానం చెయ్యటం, పుస్తక పఠనం వంటివి మంచి నిద్రకు దోహదపడతాయి. కాళ్లూపే వ్యాధి, విశ్రాంతి లేమి, తరచు నిద్రా భంగం కల్గిస్తుంటాయి. నిద్ర కోసం మాత్రలు వేసుకోవడం ఓ ప్రత్యామ్నాయమే కానీ అది ప్రమాద హేతువు కూడా.

యోగా చెయ్యటం వల్ల ఈ సమస్యల్నుంచి కొంతవరకు బయటపడొచ్చు.

లోడి ఇంట్లోకి ఆందోళనగా అడుగుపెట్టాడు. అతని వాలకం చూసి "ఏమిరా కిష్టా. ఏం జరిగిందిరా" అంటూ అతణ్ణి అడిగారిద్దరూ.

"కోటమ్ముండాదా?" ఆయాసంతో రొప్పు తూ అడిగాడు.

"ఆс వుండాది. కోటమ్మా..." అంటూ అరి చింది ఆదెమ్మ.

చుట్టింట్లో పడుకొని పాపను నిద్ర పుచ్చు తున్న కోటమ్మ గబగబ లేచి అక్కడికి వచ్చింది.

"కోటమ్మా... ఆ ముసలయ్య నిన్ను సంపే దానికి మనుషుల్ని పంపించేసుండాడు. పెద్ద జీతగాడు మల్లప్ప ఈ రోజు రేత్తిరికే నిన్ను సంపేస్తానని దుడ్డు తీసుకొని, వాడి మను షుల కోసరం పోయిండాడు. నా మాటిను. నువ్వింక ఈ ఊర్లో వుండొద్దు. వెళ్ళిపో" కంగారు కంగారుగా చెప్పాడు.

ఆ మాట వినగానే ఆదెమ్మ "ఇంకేం జేసే దిరా తండ్రో. ఇంక నా బిడ్డకు దిక్కెవుర్రా నాయనో" ఏడుపు మొదలుపెట్టింది.

"అత్తా! అట్ల యాడవద్దు. ముందు ఆ యమ్మిని ఈ ఆపితి నుంచీ తప్పించే మార్గం యోచించు" అన్నాడు.

"అవును. ఇప్పుడు యాడస్తా కూసుంటే బిడ్డను పోగొట్టుకుంటాం" అని భార్యకు ధైర్యం చెప్పాడు గుండెకాయలోడు.

కోటమ్మకు ఏం చేయాలో ఏమీ పాలుపో లేదు.

"తాను ఆఫీసర్లను అవమానించాననే, పగ పట్టింటాడు... ఇప్పుడేం చేయాలి...?" ఆలో



చిస్తూ నిలబడిపోయింది.

గబగబ ఇంట్లో ఉన్న డబ్బులన్నీ కోటమ్మ చేతికిచ్చాడు గుండెకాయలోడు.

కోటమ్మ బట్టల్ని క్షణంలో మూటగట్టి ఒక చేతిసంచిలో వేసిచ్చింది ఆదెమ్మ.

కోటమ్మకు ఏం జరుగుతోందో అంతా అయోమయంగా తోచింది. తన ప్రమేయం లేకుండానే ఏదో జరిగిపోతోందనిపించింది.

"కిష్టా... నాయనా... ఇవి చేతులు కావు. నా బిడ్డను నువ్వే కాపాడాల. నువ్వే తీసక పొయ్యి యాడన్నా పంపించి, దాని పాణం కాపాడు" చేతులు పట్టుకొని యేడ్చింది ఆదెమ్మ.

"అవున్రా కిష్టయ్యా. మాకు చేతులూ, కాళ్ళూ ఆడడంలే. వెన్నుపూస లేనోళ్ళం. సన్నాబన్నోళ్ళం. వచ్చేవాళ్లను ఎదిరించే శక్తి మనకెక్కడిది. ఎట్లయినా నువ్వే దారి సూపించు. ఈ ఆపితి తప్పించు" వేడుకున్నాడు గుండెకాయలోడు.

"సరే. ధర్మవరం నుంచీ వచ్చే బండికి యిప్పుడింకా టైం ఉంది. టేసును కాడికి పోతే ఆ బండెక్కించేస్తా. అది నేరుగా పాకాల్లో ఆగి అట్టే తిరప్తికి పోతాది. కోటమ్మా... నువ్వు నేరుగా తిరప్తి కొండకెళ్ళిపో... ఆ తర్వాత నీకెట్ల తోస్తే అట్ల జెయ్యి. ఇంక రా పోదాం" అన్నాడు.

ఆమెకు ఆలోచించుకునే టైం కూడా లేకుండా అయిపోయింది.

"నా బిడ్డె. నా బిడ్డె..." అంటూ వలవలా ఏడ్చింది కోటమ్మ.

"తల్లీ... నీ బిడ్డెను మా ప్రాణం మాదిరి సూసుకుంటాం. పో. దానికేమీ భయంలే. మేం వుండాం పోతల్లీ. పోయి పాణం కాపాడుకో" అంది ఏడుస్తూ ఆదెమ్మ.



"కోటమ్మా. జాగు చేసేదానికిలే. రా. ముందు ఎవ్వరికంటా పడకుండా పోవాల. రా... ఇంటెనక దారిగుండా పోదాం రా" అంటూ చేయి పట్టుకుని లాక్కుపోయాడు కిష్టయ్య.

అలాగే ఆ చీకట్లో కోటమ్మను తీసుకుని స్టేషన్ సమీపించాడు. అప్పుడే ట్రయిన్ రాకను సూచిస్తూ కొట్టిన బెల్ గణగణ మంటూ వినిపించింది.

'బెల్లు కొట్నారు. బ్లాకయినట్టుండాది. ఇంచుమించుగా బండి పీలేరు కాడికి వచ్చేసుం టుంది. నీతో నన్ను చూస్తే వోళ్ళు నన్నూ సంపేస్తారు. ఈడికొచ్చినట్టు ఎవరికీ తెలీదు. వోళ్లకు తెలిసే లోపల బండొచ్చేస్తాది. నీకేం భయం లేదు. ఇంక పో" అంటూ బ్యాగు చేతికిచ్చాడు. దాంతోబాటు తాను దాచుకున్న రెండు వందలు తీసి ఆమె చేతికిచ్చాడు.

"యాడున్నా నివ్వు సుఖంగా వుంటే అంతే సాలు" గాద్గదికంగా అన్నాడు కిష్టయ్య.

అతని సహాయాన్ని, అభిమానాన్ని తట్టుకో లేకపోయింది కోటమ్మ.

'ఎప్పుడూ తనను చూసి మెలికలు తిరిగి పోతూ సిగ్గుపడిపోయి బిడియపడే కిష్టయ్య లో ఇంత మంచితనం వుందా?' తీవ్రంగా ఆలోచించసాగింది.

"కిష్టయ్యా. ఎందుకు నీకు నాపైన అంత అభిమానం. నీకు నాకూ ఏమి రుణం?" కళ్ల నీళ్ళు పెట్టుకుంటూ అంది.

"కోటా... నువ్వంటే నాకు చిన్నప్పటి నుంచే ఇష్టం. బుద్ధి తెలిసిన నాటినుంచీ కలిసి తొక్కుడు బిల్లలు ఆడుకున్నాం. వానా గుంత లాడినాం. కుచ్చు కుచ్చు పుల్లా డినాం... దాంకలాబూచి ఆడినాం... ఒక జట్టుగా ఆడినాం... ఒక జట్టుగా తిరిగినాం. కడాకు ఆలూ మొగుడి ఆట గూడా ఆడినాం. అందుకే నీ మాటంటే నా కిష్టం. నీ ఆత్మాభి మానమంటే ఇష్టం. నీ మంచితనం, నీ సొగసు అన్నీ నాకిష్టమే. అందుకే నీవంటే నాకు వల్లమాలిన అభిమానం, ప్రేమ మా ఇంట్లో ఎటో వొగట్ల వప్పించి నిన్ను మనువా డదామనుకున్నా. కానీ, అంతలో నిన్ను బసి విని జేసి ముద్దరేసిరి... అయినా పెండ్లి చేసు కుందామనుకున్నా. నీకు బిడ్డె పుట్టె. అయినా గూడా నువ్వు వప్పుకుంటే పెండ్లి జేసుకుందా మనుకునే వుండాది... కానీ..." ఆపైన చెప్ప లేకపోయాడు.

అతని ప్రేమ ఆమెను కరిగించివేసింది. ఇన్ని రోజులూ అతనంటే ఉన్న చిన్నచూపు గుండెలో నుంచీ తొలగిపోయింది. అతని ప్రేమతో నిలువెల్లా తడిసిపోయింది. ఉక్కిరి బిక్కిరి అయిపోయింది.

"అయ్యో కిష్టయ్యా... రాయేదో రత్నమేదో తెలుసుకోలేకుండాపోయినాను. అయినా ఈ మాట ముందే చెప్పింటే ఎవురడ్డపడిన్నా నిన్నే చేసుకోనుందును కదా" అంటూ బోరున విల పించింది కోటమ్మ.

"యెట్ల జరగాల్సింది అట్లే జరగతాది... ఇంత జేసినవాడి దెగ్గిర నేనింక ఏం చేయను. రేపట్నుంచీ ఇంక ఆ పక్కకే పోను... సరే... బిరీనా పదా..." అంటూ తొందరించాడు.

అతనివైపే చూస్తూ వెళ్లలేక ఒకడుగు ముందుకేసి మళ్ళీ వెనక్కి వచ్చి ఒక్కసారి అతన్ని గాఢంగా కౌగిలించేసుకుంది. ఈ

హఠాత్సంఘటనకు ఒక్క క్షణం తత్తరపడ్డాడు కిష్టయ్య.

ఆమెను విడదీసి కళ్ల నీళ్లతో వీడ్కోలు చెప్పాడు.



16

బండి రాకను సూచిస్తూ రెండో బెల్ గణ గణా మ్రోగింది.

రెక్కమాను వంగింది.

రెక్కమాన్లో ఎర్రలైటు మాయమై పచ్చలైటు వెలిగింది.

స్టేషన్లో ఆమె కోసం ఎదురుచూస్తున్నాడు మణి.

అలా గంటసేపట్నుంచీ ఎదురుచూస్తూనే వున్నాడు. రానురాను అతనిలో నిరాశ చోటు చేసుకుంటున్న సమయంలో... దూరం నుంచీ కోటమ్మ వస్తూండటం చూసి ఎగిరి గంతేశాడు. ఎంతో సంబరపడిపోయాడు... ఎవరైనా తెలిసినవాళ్ళు ఉన్నారేమో అనుకుంటూ ఒక్కసారి ప్లాట్‌ఫారమంతా చూశాడు.

అది చిన్న స్టేషన్ కావడంతో అయిదారుగురు కంటే ఎక్కువమంది ప్రయాణికులు లేరు. వాళ్ళలో తెలిసినవాళ్లెవరూ లేకపోవడంతో చాలా సంతోషించాడు.

ఒక్కసారి స్టేషన్లో వెయిటింగ్ హాలువైపు చూశాడు. అదొక చిన్న గదిలాంటిది. దాంట్లో తనతోపాటు వలస వచ్చిన తన ఊరివారు కొందరు గాఢనిద్రలో ఉన్నారు.

కోటమ్మ యింకా దగ్గరకొచ్చేసింది.

ఆమెను చూసి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు మణి.

"కోటమ్మా... నాకు శ్యానా ఆనందంగా వుండాది. నీకే లోటు రానీయను. పువ్వుల్లో పెట్టుకొనిదా సూసుకుంటాను"

ఏవేవో వాగ్దానాలు చేసేస్తూ చేతిలోని బ్యాగు అందుకున్నాడు. ముసలయ్య గొడవలోపడి మణి విషయమే మరిచిపోయింది.

"ఏదో తమాసకనుకున్నే గానీ... ఈ అరవోడు నా కోసరమే చూస్తావున్నిట్టుండాదే. ఏమి ధైర్నంరా అరవోడా నీకు..." అనుకుంటూ అప్రయత్నంగానే చేతిలోని సంచీని అందించింది. అంతకుమించి ఏమీ మాట్లాడలేదు. అసలు మాట్లాడాలని అనిపించనూ లేదు. మౌనంగా ఉండిపోయింది.

"నువ్వు వస్తావనీ ముందే రెండి పేరు టికెట్టు కొనిపెట్టిని" అంటూ జేబులో నుంచీ రెండు టికెట్లు తీసి చూపించి మళ్ళీ జేబులో పెట్టేసుకున్నాడు.

వాళ్ళు అలా నడుస్తుండగానే, తనకు తానే బరాబరులు పలుక్కుంటూ వచ్చి స్టేషన్లో ఆగింది రైలు.

ఇద్దరూ ఓ కంపార్ట్‌మెంట్‌లో ఎక్కి కూర్చున్నారు. రెండు నిముషాల తర్వాత తిరిగి రైలు కదిలింది. ఆ పైన విశాల ప్రపంచంలోకి పరుగులు తీసింది.

పాకాలలో బండిదిగి, అప్పటికే రెడీగా ఉన్న చిత్తూరు బండెక్కేశారిద్దరూ. ఆ రైలు బండి చిత్తూరు చేరేసరికి రాత్రి రెండు గంటలయింది.

బస్టాండుకు చేరుకుని తెల్లారగానే వేలూరు బస్సెక్కి వంటమాను దగ్గర దిగారు కోటమ్మ, మణి".

అప్పటికి బాగా తెల్లారిపోయింది...

అప్పుడే ఎర్రటి అగ్నిగోళంలా, తూర్పుకొండల గర్భాన్ని చీల్చుకుని వస్తున్న నెత్తురు గడ్డలా... ఆకాశంలోకి దూసుకువస్తున్నాడు సూర్యుడు.

మణి సంచి చేతబట్టుకుని కబుర్లు చెబుతూ ముందు నడుస్తున్నాడు. కోటమ్మ ఆ పరిసరాల్ని చూస్తూ అతని వెంట నడుస్తోంది.

ఎంతదూరం చూసినా... బీళ్ళు. అక్కడ

క్కడా ఏవేవో తుప్పచెట్లు, రాళ్ళు రప్పలు, చిన్న చిన్న గుట్టలు తప్ప ఏమీ కనిపించడం లేదు. దారి పక్కన తొండాకులు, తుప్పచెట్లలో బాగా బలిసిన బల్లులు కనిపిస్తున్నాయి. వాటన్నింటినీ చూస్తుంటే కోటమ్మకు విచిత్రంగా అనిపించింది. తానొక కొత్త లోకంలోకి ప్రవేశించినట్లుగా భావించుకోసాగింది.

ఇద్దరూ ఊరు చేరేసరికి ఉదయం ఏడు గంటలు దాటింది.

అదొక చిన్నపల్లె, అన్నీ పూరిండ్లే ఉన్నాయి... వాటిలో సగం తాటాకుల గుడిసెలు.

ఉత్తర దక్షిణం వ్యాపించి ఉన్న వీధి మొగదల అడుగు పెట్టారిద్దరూ. అక్కడ వీధిలో కొందరు మనుషులు నింపాదిగా తిరుగుతున్నారు. అందులో సగం మంది మగాళ్ళకు చొక్కాలు లేవు. కొందరు రవికెలు లేని ఆడవాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళు చీరనే పైన కూడా చుట్టుకొని ఉన్నారు. చాలామంది నల్లగా, చప్పిడి ముక్కుల్తో, వికారంగా జుట్లు పెంచుకుని ఉన్నారు.

చాలామంది వీళ్ళని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

రెండు గుడిసెల్ని దాటుకొని వెళ్ళిన తర్వాత ఓ గుడిసెను చూపించి "యిదే మన వీడు (ఇల్లు)" అన్నాడు మణి.

అది బీగం వేయబడి ఉంది.

బ్యాగు దించి నేలపైన పెట్టి, మొలతాడుకు కట్టుకొని ఉన్న తాళంచెవి విప్పుకొని, బీగం తీసి లోపలికి అడుగు పెట్టాడు మణి.

"లోపలికి వా (రా)" అంటూ ప్రేమగా పిలిచాడు.

కోటమ్మ యింట్లోకి అడుగు పెట్టింది.

పరిశీలనగా ఒక్కసారి ఇల్లంతా చూసింది.

బాగా పాతబడిపోయి ఉన్న కప్పు. అందులోనే ఒకవైపుకు చిన్న అటక, దానిపైన ఏవేవో కొన్ని వస్తువులు. ఆగ్నేయం మూల రెండు పొయ్యిలు, వాటి పక్కనే ఒక దండెం, దాని పైన ఏవో కొన్ని బట్టలు.

'తమ స్థితిలాంటిదే. మెరుగయిందేమీ కాదు' అని మనసులోనే అనుకుంది కోటమ్మ.

"నువ్వు ఈడదానే వుండు, నేనుదా అంగటికి పొయ్యి కూర సెలవ తెలుస్తును" అని బ్యాగు లోపల పెట్టి గబగబా బయటికివెళ్లి, మరికొద్ది సేపటికే కొన్ని పొట్లాలు చేతబట్టుకొని వచ్చాడు మణి.

ఆ తర్వాత కోటమ్మను పెరట్లోకి తీసుకుపోయాడు. అక్కడ... యింటికి కొంచెం ఎడంగా మట్టితో చేసిన ఒక నీళ్లతొట్టి, ఒక జల్జారి బండ... స్నానం చేసినప్పుడు పోయిన నీళ్లకు పెరిగిన ఒక పెద్ద మునగ చెట్టు, రెండు పొడవైన బొప్పాయి చెట్లు, వాటి కింద రెండు కనకాంబరం చెట్లు, ఒక చెండుమల్లె చెట్టు అప్పటికే పూలు పూసి ఉన్నాయి. వాటి పక్కన వెడల్పాటి ఆకులతో మొకాటెత్తు పెరిగివున్న దుంపరాష్ట్రం చెట్లు... పచ్చి పసుపు వాసనను వెదజల్లుతున్నాయి.

ఆ చెట్ల గుంపు కెదురుగా కొంత దూరంలో మరో పాతబడిన తాటాకుల గుడిసె, దాని గోడకానుకొని ఆ చెట్ల వైపుకు జల్జారి బండ కనిపించకుండా, చాటు కోసం ఏర్పాటు చేసిన ఒక తడికె.

"ఈ వీడు కూడా ... మనదే" అన్నాడు, ఆ గుడిసెను చూపిస్తూ మణి. అతని దృష్టిలో అదొక అదనపు ఆస్తి.

"ఆహాఁ..." అంది కోటమ్మ.

"ఊరికి ముందర... బాయి ఉండాది. కడవ తీసకపొయ్యి తన్నీరు (మంచినీళ్లు) తెస్తును. సాపాటు (అన్నం) నేసుకోవాల గదా" అంటూ మళ్లీ యింట్లోకి తీసుకువచ్చి ఆమెకు అక్కడ ఉండమని, కడవ తీసుకుని బయలుదేరాడు.

"హేయ్ మణీ, యారుడా (ఎవర్రా) అంద పుదుస్సు (కొత్త) మడిసి"

అరవం, తెలుగు కలిపి నోట్లో వేసి దంచుతూ ప్రశ్నించాడు చొక్కాలేని పక్కింటి పరంజ్యోతి.

"యారు? అవళ్దానా? (ఎవరు? ఆమే) నా మడిసి దానే" అంటూ గబగబా వెళ్ళిపో

యాడు మణి.

అప్పటికే ఊర్లో "సుబ్బరమణిగాడు ఎవర్నో అమ్మాయిని లేపుకొచ్చాశాడన్న వార్త ఇడగబో సిన సున్నపురాయిలా పొక్కిపోయింది.

"అయ్యో, అలివేలు వస్తే... వీడి కతె యిసార్నయి పోవును"

"వాండు వోరు పైత్తికారి (పిచ్చివాడు) వొరు ముతాలె. లేకుంటే పనికోసం ఉత్తర దేశం పోయినాడుగదా. మరి ఇట్లదా సేసునా?"

"యింతకీ ఆ పుదస్సు మడిసిది ఎందవూరు (ఏ ఊరు) తెలసలేదే!" రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

మణి నీళ్ళు మోసుకు వచ్చి, రెండు కడవలు తొట్టిలో పోసి, మూడోసారి నీళ్ళ కడవను యింట్లో దించాడు.

యింట్లో ఒకవైపున్న చిన్న వాడలాంటి ఆకారంలో నుంచీ కొంచెం బియ్యంతీసి, తనే వంట చేశాడు.

అంతలోపల మణి సూచనమేరకు కోటమ్మ పెరట్లోకి వెళ్ళి తడికె చాటు చేసుకుని స్నానం చేసి వచ్చింది. మణి కూడా ఒక ఎర్రసబ్బు తీసుకొని వెళ్ళి స్నానం చేసి వచ్చాడు. చెనగ్గింజల ఊరిమిండి చేశాడు.

అప్పటికి సమయం పది గంటలయింది.

ఇద్దరూ వండిన అన్నం సత్తుగిన్నెల్లో వడ్డించుకుని, ఊరిమిండి వేసుకుని తిని, నట్టింట్లో చాప పరచుకొని, ఆనందంగా పడుకున్నారు.

కన్నమ్మగా మారిన కోటమ్మ ఆ ఊర్లో కన్నమ్మగానే చెలామణి అయింది. ఆమెకు ఆ ఊర్లో వారం రోజులు ఆనందంగా గడిచిపోయింది... బసివిని ముద్ర నుంచీ సంసారిక స్థాయికి చేరుకున్నందుకు సంతోషపడింది. తనకు ఊరుమ్మడి వేశ్యా వ్యవస్థ నుంచీ ఇలా కాపాడినందుకు మణికి మనసులోనే కృతజ్ఞతలు కూడా తెలుపుకుంది. అయినా ఆమె మనసులో బిడ్డను గురించిన బాధ ముల్లులా గుచ్చుకుంటూనే వుంది.

అక్కడ అందరూ వదిలేసిన అనాథలా ఉన్న ఆ ఇంటినీ, పరిసరాలను ఊడ్చి శుభ్రం చేసింది. పెరట్లో ఉన్న మరో యింటికి కూడా దుమ్ము దులిపి ఊడ్చి నీళ్ళు చల్లి శుభ్రంగా పెట్టింది. ఏంచేసినా, ఎంత చేసినా కూతురు అరుణ రోజూ గుర్తొస్తూనే ఉంది. తనవాళ్ళూ గుర్తొస్తూనే ఉన్నారు.

"ఎలా ఉన్నరో నేనొచ్చేసిం తర్వాత మా వోళ్ళనేమన్నా ఉడకాడిపిస్తా ఉండారో ఏమో? ఆ బోడి గుండు బొర్ర మీసాల ముండా కొడుకు ఇన్ని దినాలూ నా సర్వస్వం కొల్లగొట్టి కడాకు నన్నే సంపేదానికి మళ్ళుకున్నాడు. అట్లాంటోడు మా నాయనకేమన్నా ఆపితి కలిగించినాడేమో? ఆయప్పొగ వెర్రిబాగులోడు. మా సినపాప ఎట్లుండాదో, మా సుబ్బయ్య సిన్నపిల్లోడు. వాడెట్లుండాడో, నా బిడ్డె కసిగందు. పసి గుడ్డును వదిలేసొస్తినే..."

"గుడిసెలో కూర్చొని తీవ్రంగా ఆలోచిస్తోంది కోటమ్మ.

పొయ్యి మీద చట్టిలో చిన్న సంబావు బియ్యం కుత కుతా ఉడుకుతున్నాయి. దగా పడ్డ దరిద్రుడి గుండెలా పొయ్యి సన్నగా మండుతోంది.

మణి యేదో పని మీద పక్కూరికి వెళ్లాడు. యింకా రాలేదు.

"యారుడా (ఎవర్రా) నా సవుతి? నన్నుదా మోసం సెయ్యను వచ్చిండేది. యారుడా? నా బతుకు దా బండ సేసేదానికొచ్చెనా ఏమి?

అయ్యో, కణా! సెల్వా. అమ్మణ్ణీ, పాంజాలీ. యింక మనకు దా దిక్కెవరు?" అంటూ రాగాలు తీస్తూ, రంపు చేస్తూ ఇంటి ముందరికి తల విరబోసుకుని వచ్చిందో స్త్రీ.

ఆ మాటలతో యిహంలోకి వచ్చిన కోటమ్మ ఏమిటోననుకుని ఆశ్చర్యంగా గుమ్మం వైపే చూస్తోంది.

"యారు వళ్లె? యింగెవా?"

(ఎవరు లోపల? యిట్లరా) అరుస్తోంది.

ఆమె యిక్కడెందుకరుస్తోందో ఎవర్ని పిలుస్తోందో కోటమ్మకు అర్థం కావడం లేదు.

"అది యెన్నా పేరు (అది ఏం పేరు)...



భయంగా చూస్తోంది కోటమ్మ.

"యేయ్ కన్నమ్మా... యింగే వా? రాయే నా సవుతీ?"

రెట్టింపు ఆవేశంతో కేక వేసింది ఆ వచ్చిన స్త్రీ.

ఆమె చూస్తూండగానే సంకన ఆరు నెలల బిడ్డతోను, మరో చేత నడిపించుకుంటూ మూడేండ్ల పాపతోను సుడి గాలిలా ఇంట్లోకి దూసుకు వచ్చిందా స్త్రీ.

ఆ ఊపుకి హోరు గాలికి అల్లల్లాడే చిగురుటాకులా వణికిపోయింది కోటమ్మ.

"యిదేదో ప్రమాదం ముంచుకొచ్చేసినట్టుందే". కోటమ్మ అంతరాత్మ హెచ్చరించింది.

ఆమె వైపు ఒక్కసారి బెదురు చూపులు చూసింది.

ఆ వచ్చిన స్త్రీ చింపిరి తలతో, నల్లటి శరీర ఛాయతో, పెద్ద పెద్ద కళ్ళతో పొట్టిగా దిట్టంగా కనిపిస్తోంది. వయసు పాతిక లోపే ఉండొచ్చు. పచ్చటి రవిక, అదే రంగు ముతక చీర, చేతికి ఎర్రటి మట్టి గాజులు, కాళ్లకు తెల్లటి వెండి కడియాలతో, వెనక జారిపోతున్న రింగు రింగుల జుట్టుకు ఎర్రటి రిబ్బను వేసి అపర కాళిలా కనిపిస్తోంది.

"ఆహాఁ... నువ్వుదానే కన్నమ్మ... నా సవుతి. ఏమి మర్లు మందు దా పెడితివే నా మొగుండుకి. నువ్వు ఎందవూరు ఆండదానివే. పేండ మొగం దానా- వాండికయినా బుద్ధి లేకపోతే నీకు ఏమైందే?"

చూసి చూడగానే తిట్టడం ప్రారంభించింది. అప్పటికే ఆడవాళ్ళు, పిల్లలు యింటి ముందర చేరిపోయి ఉన్నారు.

ఈ హఠాత్సంఘటనకు ఆశ్చర్యపోతూ పైకి లేచి నిలబడింది కోటమ్మ.

"వసే కన్నమ్మా, సెప్పుమీ... నన్నూ, ఈ ఆ... కన్నమ్మంట కన్నమ్మ." అంటూ తనకు తానే మాట్లాడుకుంటోందా స్త్రీ.

తోడేలును చూసి బెదిరిన గొడ్డులా భయం

పిలగోళ్ళను ఏం సేస్తువు? యాడ తోస్తువు? నేను యాడదా పోదును? వీళ్ళ గొంతు కర కరా కోస్తివే యభాశారీ... పో... ముందు నా యింటినించి దా పో... ఇది నన్ను వీడు దా (నా యిల్లు)."

చిన్న బిడ్డను నేల మీదకి దించి మీది మీదికి వచ్చింది.

కోటమ్మకు విషయం మెల్లగా అర్థం కాసాగింది.

"సత్తెపెమాణకంగా ఆయనకు పెండ్లయిందని నాకు తెలవదు. నన్ను నమ్ము. అలా తెలిసుంటే నేను రాకనే పోదును. నన్ను నమ్ము."

సర్ది చెప్పటానికి ప్రయత్నించింది కోటమ్మ ఉరఫ్ కన్నమ్మ.

"ఆహాఁ... నేసింది సాలక యింకా... నీతులు దా సెప్తువు! రాయే లమ్మిడీ. యిది నా వీట్టు (ఇల్లు) దా. యెలబారమ్మీ ముందు." భుజం పట్టి తోసింది.

కోటమ్మకు ఏం చేయాలో అర్థం కాలేదు.

పాప భయం భయంగా చూస్తోంది. అదీ తల్లి నోట్లో ఊడిపడినట్టు యింతంత గుడ్లేసుకొని నల్లగా... చూసి చూసి ఏడుస్తోంది.

"తోసినా యింట్లోనే ఉంటావేమీ... ఈనం పానం దా లేదా నీకు, యెలబారేమీ? "

రెచ్చిపోయి మాట్లాడుతూ తాటకిలా ఎగిరి పడింది, శూర్పణఖలా ఉరిమి చూస్తూ కోటమ్మ జడనుపట్టి ఈడ్వడం మొదలు పెట్టింది.

కోటమ్మకు ఏడుపు ముంచుకొచ్చింది.

మణి అయినా వచ్చి అడ్డుకుంటాడని అనుకుంటే సమయానికి అతను కూడా ఆ దరిదాపుల్లో లేడు.

ఆ ఊర్లో తను ఒంటరి. తెలిసినవాళ్ళు, అయినవాళ్ళు లేని ఊరు. తను ఏమీ చేయలేక మౌనంగా భరిస్తూనే విడిపించుకోవడానికి ప్రయత్నిస్తోంది. అది ఆమెకు అనుకోని సంఘటన. కలలో కూడా ఊహించని సంఘటన.

అలివేలు ఉడుంపట్టు పట్టేసింది.

అమె అలా లాగనూ,ఈమె ఇలా లాగనూ, తల నిప్పుల గుండంలో పెట్టినట్లు మంటపెడుతోంది.

అశ్లీలంగా తిడుతూ అలివేలు కోటమ్మను గుమ్మం వరకూ లాక్కొచ్చింది, సరిగ్గా అప్పుడు ప్రవేశించాడు మణి.

"హేయ్ అలివేలూ యిడిసిపెట్టమ్మీ దాన్ని. లేకంటే తన్నుల్దా తిందువు" గట్టిగా కేకేశాడు.

లోపలికి జొరబడి ఆమె చేతుల్లోని కోటమ్మ జుట్టును విడిపించాడు.

"ఆమెది ఏమీ తప్పులేదు. నేను దానే యిష్టంపడి తొడుగుని దా వస్తిని. వాయి (నోరు) మూసుకొనిదా పడుండు. ఆఁ" అన్నాడు.

ఆ మాట విన్న అలివేలు కోటమ్మ జుట్టు వదిలేసింది. మగడు అలా అన్నందుకు ఒక్క క్షణం నివ్వెరపోయింది.

ఆ తర్వాత రొమ్ములు బాదుకుంటూ, జుట్టు పీక్కుంటూ గట్టిగా రోదించసాగింది.

"యింకేమి సేస్తును తాయీ (తల్లీ) వీండు దా నన్ను నిండా ముంచినాడు. ముండ మొగుడు స్వామీ. నాకింక దిక్కుదా యారుడా అప్పా (తండ్రీ). నేను యేమిదా సేస్తును? యాడదా పూడుస్తును? "

అలాగే నట్టింట్లో కూలబడి నెత్తీనోరు కొట్టుకుంటూ ఏడవసాగింది అలివేలు.

గుక్కబెట్టి ఏడుస్తున్న సెల్వంను ఎత్తి సంకన పెట్టుకున్నాడతను. బిక్కు బిక్కున చూస్తున్న పాప పాంజాలిని మరోచేత్తో పట్టుకున్నాడు.

"యిద్దో అలివేలూ, నీకూడా సెప్తుండా, యింకదా కన్నమ్మను యేమన్నా అంటివి సూడీ, నిన్నుదా నిలువునా నరికి పారేస్తును జాగర్త!"

అంటూ అలివేలు నోరు మూయించాడు. వీధిలో కొచ్చాడు. గుమి కూడివున్న జనాలను చూసి పొమ్మని కసురుకున్నాడు.

ఏడ్చి ఏడ్చి అలసిపోయిన అలివేలు ఏడుపు ఆపి "యిద్దో యెనా (ఏమీ) ఈ వీట్లో (ఇంట్లో) వుంటే నానుదా (నేను) వుండాల

లేదా అదయినా వుండాల. అంతే, ఆనా (ఆపైన, లేదంటే) నాను బిడ్డల్ని తీసుకొని మా పుట్టింటికిదా పూడుస్తును" అంటూ వార్నింగిచ్చింది.

మణికి మెదడు మొద్దు బారినట్లనిపించింది. అతనికి ఏమీ పాలుపోవడంలేదు.

అలివేలు వుండుండి రాగాలు తీస్తోంది. మరోవైపు తిడుతూనేవుంది. అలా ఆ ముగ్గురూ ఒకే యింట్లో... ఎంతసేపు ఉన్నారో వాళ్లకే తెలీదు.

పిల్లలు ఏడ్చీ ఏడ్చీ నేలపైనబడి అలాగే నిద్రపోయారు.

ఏడ్వడంవల్ల కోటమ్మ కళ్లు వాచాయి. ఎన్ని కష్టాలొచ్చినా ఆమె జీవితంలో ఎప్పుడూ ఏడ్చి ఎరుగదు. అట్లాంటిది ఆ రోజు గుండె పగిలేలా ఏడ్చింది. కడుపు చెరువయ్యేలా ఏడ్చింది. చివరికి బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు మణి.

కోటమ్మ బట్టలు, బ్యాగు తీసుకున్నాడు.

"కన్నమ్మా... నీ వా" (నీవు రా) అంటూ ఆమెను చేయిపట్టి లేపి తీసుకువెళ్లి పెరట్లో ఉన్న మరో గుడిసె దగ్గరకు తీసుకెళ్లాడు.

చిలుకు వేసివున్న తలుపు తీసి లోపలికి వెళ్లి, ఆమె బట్టలు అందులో పెట్టాడు.

"కోటా... నాకు ముందే పెండ్లిదా అయిందని నీకు సెప్పలేదు. అది నాను సేసిన తప్పుదా. నన్ను మన్నించమ్మీ. నువ్వు యాడదా పోవద్దు. నీవంటే నాకు నిండా ప్రణయందా. యిదు (ఇది) నీ వీట్టుదా. వుండిపో. నీకు కావాల్సినవి నానుదా సమకూరుస్తును. ఇంకో మాట. ఇంకమీద యిక్కడ నీ పేరు కన్నమ్మదానే. నేను ఊర్లో అందరికీ అట్టదానే సెప్పినా" అని అనునయంగా చెప్పి వచ్చేశాడు.

కోటమ్మ ఆ యింట్లో అలాగే కూలబడిపోయింది. తన దుస్థితికి వెక్కి వెక్కి యేడ్చింది... ఆ ఏడుపుతోబాటు ఆలోచనలు ఆమెను కబళించాయి.

"నేనేం పాపం జేసినా? అంటరానిదానిగా

## అదే నాభయం

ఆనంద గజపతిగారు కొత్తగా కొనుక్కున్న కారులో దాసుగారిని ఎక్కించుకుని ఘాట్ రోడ్డులో రయ్యిమంటూ వెళ్తున్నారు.

'కొంచెం నెమ్మదిగా పోరాదా రాజా వారూ?' అన్నారు దాసుగారు.

'వేగానికి జడిసిన్నట్లున్నారే. వాహనం నడుపుతున్నది నేనైనప్పుడు నిశ్చింతగా ఉండక భయమేల?' అన్నారు రాజావారు దర్పంగా.

'నా భయమంతా అందుకే మహాశయా' అన్నారు దాసుగారు.



ఆయన చమత్కారానికి రాజావారు పొట్టచెక్కలయ్యేలా నవ్వారు.

పుట్టడమే తప్పా? మరి అలా పుట్టినంత మాత్రాన ఎవ్వరికీ యిలా జరగడం లేదు కదా. నాకే ఎందుకిట్లా జరగతా వుండాది? ఊర్లో వున్నింటే ఆ ముసలయ్యగోడు సంపిండు. సరే అని ఈడికొస్తేనేమొ ఈ అరవోడికి ముందే పెండ్లయింది. ఆ యిసయం దాచిపెట్టేసి ప్రణయమూ, వాడి పిండాకూడు అంటా నన్ను ఈడికి తీసకొచ్చేసినాడు. అప్పటి పరిస్థితిలో రాక తప్పలా... వచ్చిందానికి ఈ మణిగోడు నన్ను దెచ్చి ఈ అరవదేశంలో పడేశ. నా ఊరు మారిపాయ. దానికితోడు యిప్పుడు నా తల్లిదండ్రులు నాకు బొడ్డుకోసి పెట్టిన నా పేరునూ మార్చేశ.

సరే. యిప్పుడేం చేయాల? అలివేలు తిట్టిందనీ, కొట్టిందనీ ఎక్కడికి పోవాల? అమాయకురాలు. పాపం. న్యాదర బిడ్డలు. అది మాత్రం ఏం చేస్తుంది. దాని స్థానంలో




## మతిమరుపు మహిళ

మరుపు అనేది మనుషులను దూరం చేస్తుంది. అవకాశాలనూ, అందలాలనూ అందకుండా చేస్తుంది. మతిమరుపు మారాజులు మనలో ఎందరో ఉంటారు. మఎరుపనేది ఓ వరం! కష్టాలు, కన్నీళ్ళు, మానసిక వత్తిళ్ళు, కలహాలు మర్చిపోవడానికే కదా మా మద్యపానం అంటూ తమకు తాము సమర్థించుకుంటారు మందుబాబులు. మనసు గాయాలను, కష్టాలను మరిచిపోతే మంచిదే గానీ కన్న బిడ్డలనో, వారి పేర్లనో మర్చిపోయే వారెక్కడైనా ఉంటారా? అంటే ఉంటారనే చెప్పవచ్చు పెనీగ్రోస్‌కు చెందిన 49 సంవత్సరాల వేండాజోన్స్ అనే

## వాహ్

దీర్ఘాయుష్మాన్ భవ అని కన్నవారు ఎంత ప్రేమగా దీవించారో లేక కనిపించని ఏ దేవుడు కాసింత దయతలచి, కూసింత అమృత బిందువును అద్దీ అద్దనట్లుగా అతడి నాలుక నద్దాడో గానీ ఆయనగారు మాత్రం నిజంగానే సుదీర్ఘకాల జీవనంతో రికార్డు సృష్టించేశాడు. ఆరోగ్యం ఉంటే ఆనంద జీవనమే కాదు, సు...దీర్ఘ జీవనం సాధ్యమేనని కాలాన్ని బజాయించి మరీ చాటాడాయనగారు. అందుకే కాబోలు ఆరోగ్యమే మహాభాగ్యమన్నారు పెద్దలు. ఇంతకీ ఆ పెద్దాయన పేరు బెనిటో మార్టనెజ్.

క్యూబా 'స్టార్' అయిన ఆ పెద్దాయన జన్మస్థలం హైతీ అట. ఆయన 1880లో జన్మించాడని బిబిసి పేర్కొంది. 126 సంవత్సరాల సుదీర్ఘకాలం జీవించిన మార్టినెజ్ ఏనాడూ సోమరిగా గడపక చివరి రోజుల వరకు చాలా చురుకుగా పనిచేస్తూ హుషారుగా ఉండేవాడు. కష్టపడడం ఆయన జీవన రహస్యమట. అంతేకాదు కూరగాయలంటే బోలెడంత ఇష్టంగా ఆరగించేవాడట. ఏదో కాసింత మద్యం, కాసిన్ని సిగార్లతో సరిపెట్టుకుంటూ ఆరోగ్యాన్ని కాపాడు

## మా వలపే మాసిపోనిదీ...

ఒక చిలకమ్మకు, ఒక గోరింకకు ప్రేమంట అని పాడితే అందులో వింతేముంది... సహజమేగా అంటారు. 'అదే ఒక గాడిదమ్మకు, ఒక బాతయ్య వలపు కుదిరెనంట' అని గానం చేస్తే ఊరుకోండి, విడ్డూరం కాకపోతేనూ అని కొట్టిపారేస్తారు. మరీ అంత కొట్టిపారెయ్యాల్సిన పనేం లేదులెండి. ఇది నూటికి నూరుపాళ్లు నిజం. ఎక్కడంటారా? జర్మనీలో. అక్కడ ఒక గాడిదమ్మ, ఒక బాతుదొరతో గుండెలోతు ఘాటు ప్రేమలో కూరుకుపోయింది. ఆ బాతు దొర పేరు హానిబల్. గాడిదమ్మ పేరు హీడి. హానిబల్‌ను తోటి పక్షులతోపాటు ఉంచితే దురుసుగా తిరగబడుతూ, నానా యాగీ చేయడంతో దాన్ని విడిగా ఉంచారు. అక్కడే దానికి హీడితో పరిచయం కలిగింది. పరిచయం కాస్తా పెరిగి పెరిగి ప్రణ

మహిళామణికి విపరీతమైన మతిమరుపు. ఈమెకు ఐదుగురు కూతుళ్ళున్నారు. ఆల్వైన్‌కు 18, గ్రౌస్‌కు 16, రియాన్‌కు 14, లౌరీకి 13, వెర్నాన్‌కు 12 యేళ్ళు. వాళ్లందరి పేర్లూ ఆమెకు ఓ పట్టాన గుర్తుండవు. గుర్తుకొచ్చినా ఒక పేరుతో మరొకరిని పిలుస్తుంది. ఏ ఆసుపత్రికో, మరో చోటికో వెళ్తే పిల్లల పేర్లు, పుట్టిన తేదీలు అవసరమైతే మొదట్లో బుర్ర గోక్కుని ఆలోచనల్లో పడేది. చివరికి ఆమెకీ ఓ బల్బు వెలిగింది. పిల్లల పేర్లూ, వారి పుట్టిన తేదీలనూ తన భుజంపై పచ్చ బొట్లు పొడిపించుకుంది. అవసరమైనప్పుడు తన భుజానికేసి ఓ చూపు చూసి గడగడా వాళ్ల పేర్లు, పుట్టిన తేదీలు చెప్పేస్తుందట వేండాజోన్స్ "పచ్చ పొడి పించుకున్నప్పటి నుండి ఓ సమస్య తీరిందనుకోండి..." అని నవ్వేస్తోందట వేండా. అంతే కాదు! "ఇన్నాళ్ళూ పిల్లల పుట్టిన రోజులకు వాళ్ళే గుర్తు చేస్తేగానీ గిఫ్టులు కొనేదాన్ని కాదు. ఇప్పుడా బాధా లేదం డోయ్! మా చిట్టితల్లుల పుట్టిన రోజులకు ఓ రెండ్రోజులు ముందే బహుమతులు కొనిస్తు న్నాను" అంటోందట కళ్ళలో మెరుపులు మెరిపిస్తూ.




## దీర్ఘాయుషుడు

కునేవాడు. పైగా ఆజన్మ బ్రహ్మచారి.

ఎప్పుడూ కులాసాగా, దిలాసాగా ఉంటూ, స్థానికంగా ఉండే వృద్ధుల ఇళ్లకు తరచుగా వెళ్లి వాళ్లను పలకరించి వచ్చేవాడు. తన ఇంటి ఆవరణలో మొక్కలు పెంచేవాడు. చివరికి ఆ వయసులో డాన్సు క్లాసులకు కూడా వెళ్లేవాడు. వృద్ధులను ఆరోగ్యవంతులుగా తీర్చిదిద్దే క్యూబా ప్రభుత్వ ప్రచారంలో మార్టినెజ్‌కు ఎంతో ప్రాధాన్యం ఉండేది. 1925లో మార్టినెజ్ 45 ఏళ్ల వయసులో ఉండగా వ్యవ సాయ కార్మికుడిగా క్యూబా వచ్చాడట. హైతీ నుంచి అతడి జనన ధ్రువీకరణ పత్రం లేదా బాప్టిజం వివరాలు సేకరించడానికి క్యూబా ప్రభుత్వం ప్రయత్నించింది గానీ ఫలితం లేకపోయింది. ఆ కారణంగా అధికారికంగా మార్టినెజ్ ప్రపంచ వయోవృద్ధుడిగా కాలేకపోయాడు గానీ వృద్ధుల్లోకెల్లా వృద్ధుడిగా అతడికి తగిన గౌరవమే లభించింది. అంతటి వృద్ధుడూ, పాపం, ఇటీవల పంచభూతాలలో కలిసిపోయాడు.

---

యబంధమై కూర్చుంది. ఇప్పుడు వాటి ఘాటు బంధానికి, గాఢా నుబంధానికి అందరూ నివ్వెరపోతున్నారు. అవి రెండూ క్షణమైనా ఎడబాయక కలిసే తిరుగుతూ, కలిసే తింటూ, కలిసే పడు కుంటూ మాసిపోదు మారిపోదు ఎన్నటికీ మా వలపు అని పాడు కుంటున్నాయట. అంతే కాదండోయ్, ఏ మగగాడిదైనా హీడి దగ్గ రకు రాబోతే హానిబల్ అసూయా, ద్వేషాలతో దానిమీద విరుచు కుపడుతోంది. హీడి కూడా తోటి గాడిదల పట్ల ఏ మాత్రం ఆసక్తి చూపక రోజంతా, ప్రతిక్షణం హానిబల్ వెన్నంటే ఉంటోంది. సజాతో... విజాతో... ఏదైతేనేం అదీ అసలైన ప్రేమంటే! అదీ అసలైన జంటంటే!



నేనున్నా అంతే జేసిందును. ఆ మాటకొస్తే యింకా ఎక్కువే చేసిందును. ఏ ఆడదయినా తాళి గట్టిన మొగుణ్ణి పంచుకోనొస్తే ఊరికే వుంటుందా? ... ప్చ్"

ఆలోచించి ఆలోచించీ ఆ రాత్రి అన్నం లేకనే అలాగే పడి నిద్రపోయింది కోటమ్మ.




రోజులు భారంగా గడుస్తున్నాయి.

రానురాను ఆమె పేరు కన్నమ్మగా స్థిరపడి పోయింది. ఆమె కూడా తన పాత పేరు కోటమ్మను దాదాపుగా మరచేపోయింది.

ఆ ఊర్లో ఆమె యిప్పుడు మణి ఉంపుడుగత్తెగా ఆ పల్లె జనజీవనంలో కలిసిపోయింది.

వీలయినప్పుడల్లా, ఆ చుట్టుపక్కల గ్రామాల్లో రైతులకు కూలీ పనులకు పోతూ కాస్తో కూస్తో సంపాదిస్తూనే వుంది.

మణి, అలివేలుకు తెలియకుండా ఆమె గుడిసెకు వస్తూపోతూనే వున్నాడు. ఆమెకు కావాల్సినవి సమకూరుస్తూనే వున్నాడు.

అతని పిల్లల్ని ఆమె చేరదీసి పండగలకి, పబ్బాలకీ కొత్త బట్టలు కొనిపెడుతోంది. మిఠాయిలు, పప్పులు కూడా పెడుతోంది. సైకిల్‌పైన ఐస్ అమ్మే సలీంబాషా వచ్చిన ప్రతిసారీ ఐసులు కూడా కొనిపెడుతోంది.

"కన్నమ్మాజీ! నేను వచ్చిన ప్రతిసారీ ఐసులు కొంటావ్. అది నాకు చాలా సంతోషం అవుతుంది" అంటుండేవాడు సలీంబాషా.

అయినా అలివేలుకు ఆమెపైన కోపం పోనేలేదు. అవకాశం దొరికినప్పుడల్లా పోటు మాటలు అంటూనే ఉంది. కుక్కపైనో, కోడిపైనో సాకుపెట్టి తిడుతూ సాధిస్తూనే ఉంది.

"లజ్జలేని జీవనందా. ఏమి సేస్తుము? మూంతిమీంద తుపుక్కున ఊంచినా బుద్ధి రాలేదు. జ్ఞానం లేని జన్మదా. అది మడిసిదా అయితే తెల్సును. అది బెమ్మ పిశాచి. వీట్టిలో నాయి (ఇంటిలో కుక్క)దా. కొట్టినా పోవాదు (పోదు). తిట్టినా పోవాదు. ఎట్టదాతాయి కడుపులో జల్మమెత్తినో యేమొ? "

నోటికి వచ్చినట్లు తిడుతూనే ఉండేది.

కన్నమ్మ ఒక్కసారి కోపంగా చూసి, మౌనంగా తల వంచుకుని యింట్లోకి వెళ్లిపోయేది.

"దేనికి తక్కువైనా, రోషందా తక్కువలే. పాడు జల్మ" మూతి మూడు చుట్లు తిప్పుతూ శాపనార్థాలు పెట్టేది.

ఆ మాటలు వినిపించకుండా తలుపేసుకుని కూర్చునేది కన్నమ్మ.

ఒకరోజు ఉదయాన... తడికె కవతల జల్లారి బండమైన కన్నమ్మ స్నానం చేస్తోంది.

అదే సమయంలో, అలివేలు స్నానం చేయడానికి ఎర్ర సబ్బు చేత బట్టుకొని, చీరను భుజాన వేసుకుని వచ్చింది.

"కొంపంతా దీని పరందా అయిపూడ్చినాది. పొక్కు (చూడు) జల్లారి బండ కూడా దీని యప్పగంటుదా అయిపోయిండాయె"

తిట్టుకుంటూ తిరిగి వెనక్కి వెళ్ళిపోయింది అలివేలు.

కన్నమ్మ మనసు చివుక్కుమంది. కోపం ఉచ్చికెక్కింది. అయినా మౌనంగా స్నానం చేయడంలో మునిగిపోయింది.

కొంతసేపు తర్వాత మళ్ళీ వచ్చింది అలివేలు. కన్నమ్మ స్నానమింకా పూర్తి కాలేదు.

"నాకుదా అంటూ సొంటూ ఏమీ లేదేమీ? యిల్లంతా ఏకం సేస్తువే మాదిగదానా. దొరసానిదా దిగింది మా వీట్టికి. ఏమ్ లమ్మిడీ! యెంతసేపుదా సేస్తువే. బిరీనా అయిపిచ్చామే. లేకంటే పొరక దెబ్బలుదా తిందువు" అంది రోషంగా అలివేలు.

అలివేలు అలా రెచ్చగొడుతుంటే తట్టుకోలే

కపోయింది కన్నమ్మ.

"హేయ్. అలివేలూ. ఏమట్లంటావ్? కొంచెం మరేదగా మాట్లాడు" చీర చుట్టు కుంటూ కోపంగా అంది కన్నమ్మ.

దాంతో కాలుకాలిన పిల్లిలా పైకి లేచింది అలివేలు. యింకా రెచ్చిపోయింది.

"ఏమిదా కూస్తువే. లేసొచ్చిందానివి, అంట రానిదానివిదా. మా వీట్లోదా జొరబడిపోతివి. నీకుదా ఏమి మరియాద వుండాది" పైపైకి పోయింది అలివేలు.

అప్పటికే చీర కట్టుకోవటం పూర్తి చేసిన కన్నమ్మ "యేందే. మాటి మాటికీ లేసొచ్చిం దానా లేసొచ్చిందానా అంటూ బగిశీనంగా అంటావు. నేనేమీ లేసిరాలే. నీ మొగుడు నాకు మాయమాటలు చెప్పి తొడక్కొచ్చేసి నాడు. నువ్వొఖ్ఖ ఆడదానివేగదా. నన్నెట్ల తిడతావ్. వాన్నిబొయ్యి అడుగు" దెబ్బకు దెబ్బన్నర అన్నట్లు సమాధానం యిచ్చింది.

"ఏమే. నా మొగున్ని వాడూ వీడూ అంటా వా? కేవళంగా మాట్లాడతావా? హేయ్ నీవెంత? నీ బతుకదా ఎంత?"

నోటికి ఎంత వస్తే అంత మాట అనసా గింది అలివేలు.

"అలివేలూ. నోరు పారేసుకోవద్దు. మరే దుండదు. సెప్తావుండా" హెచ్చరించింది కన్నమ్మ

"ఊరికే వుండను. ఏమిదా సేస్తువు? సెయ్యి. సూస్తును" మీదిమీదికి పోయి ఏకంగా జుట్టు పట్టుకుంది.

"నీయబ్బడాలా? యిడే ఎంటికిలు. యిడూ" అంటూ కన్నమ్మ విడిపించుకోవడా నికి ప్రయత్నించింది. కానీ అలివేలు విడువ లేదు. పైగా యింకా గట్టిగా గుంజసాగింది.

భగభగమంటూ తలమండ సాగింది కన్న మ్మకు. ఇక ఓర్చుకోలేకపోయింది.

తన శక్తినంతా చేతుల్లోకి తీసుకుని ఒక్కటి చ్చింది. అంతే. అలివేలు చెంప చెళ్ళుమంటూ శబ్దం చేసింది. చెంప బూరె ఉబ్బినట్టు ఉబ్బింది.

ఒక చేత్తో చెంప తడుముకుంటూ "ఓ తాయీ! స్వామీ. ఈ నా సవుతి నన్ను సంపే శరా దేముడా. స్వామీ. తాయీ" అంటూ ఏడుపు లంకించుకుంది అలివేలు.

వీధిలో ఎవరితోనో మాట్లాడుతున్న మణికి ఆ అరుపులు వినిపించనే వినిపించాయి.

'ఏం జరిగిందో సామీ' అనుకుంటూ వేగం గా అక్కడికి వచ్చాడు మణి. అతన్ని చూడ గానే యింకా రెచ్చిపోయింది అలివేలు.

"ఓయల్లో...యింక నాకుదా దిక్కెవురు?"

ఏడుస్తూ, పాటలా రాగాలు తీస్తూ మరీ చెప్పింది. జరిగిందానికి రెండు లేనిపోనివి కలిపి మరీ చెప్పింది.

ఏ కారణం లేకుండానే నీ ఉంపుడుగత్తె నా జుట్టు పట్టి లాగిందని చెప్పింది. చెంపను పట్టి కొట్టిందని చెప్పింది. నేలన పడేసి తన్నిందని చెప్పింది. ఏది తోస్తే అదంతా చెప్పింది. లేనిపోనివి నూరిపోసి మరీ చెప్పింది.

అవన్నీ వింటున్న కన్నమ్మ నిశ్శబ్దంగా చూస్తూ వుండిపోయింది.

భార్య మాటలతో మణికి కోపం వచ్చింది.

"ఏమే కన్నమ్మా. అలివేలు చెప్పింది నిజం దానా?" గర్జిస్తున్నట్లు అరుస్తూ అడిగాడు.

అంత కోపం అతనిలో తనెప్పుడూ చూడ లేదు. మొదటిసారి అతని కళ్లలో నిప్పులు చెరిగే కోపాన్ని చూసింది. బెదిరిపోయింది.

"అది చెప్పిందాంట్లో నిజం కొంచెమే" నింపాదిగా అంది. ఆమె వాలకం చూసి మణికి యింకా కోపం వచ్చింది.

"కొట్టావా లేదా? అది చెప్పు?" గద్దించి అడిగాడు.

"కొట్టింది నిజమే. కానీ అట్ల కొట్టే పరిస్థితి అదే కలిగించింది" బెదురుతూనే సమాధానం చెప్పింది.

"నా పెండ్లాన్ని కొట్టే అధికారం నీకెవరు దా యిచ్చినారే, ఎంత తిమురుదానే నీకు. తప్పుసేసి మళ్ళా ఎదిరించిదా మాట్లాడ

## కామధేనువు దగ్గరకే!

వీధిలో వెళ్లున్న దాసుగారికి రాజావారు ఎదురయ్యారు.

'పొద్దున్నే కవి వృషభం ఎక్కడికో సంచారానికి బయలుదేరిందే?' అన్నారు రాజావారు కొద్దిపాటి వ్యంగ్యంగా.

కవి వృషభం అని పైకి గౌరవిస్తున్నా.. ఆయనను ఎద్దుతో పోల్చానన్న సంతోషం రాజావారి మాటల్లో ధ్వనించింది.

'ఇంకెక్కడికి వెళ్తాం. తమలాంటి కామధేనువు వద్దకే' అంటూ తిప్పికొట్టారు ఆదిభట్లవారు. కోరిన కోర్కెలు తీర్చే కామధేనువు గౌరవ వాచకమైనా తనను ఎద్దుతో పోల్చిన రాజాగారిని ఆవుతో పోల్చి తనదే పైచేయని నిరూపించారు దాసుగారు.



తావ్..." అంటూ జుట్టు పట్టుకొని ఎక్కడపడితే అక్కడ కొట్టసాగాడు.

ఈ హఠాత్పరిణామానికి కన్నమ్మ నిరుత్తరురాలైపోయింది. మౌనంగా భరించింది.

అలివేలు తాను ఆగింతం చేస్తే మొగుడికి బుద్ధొస్తుందనుకున్నది. కన్నమ్మను కొడితే బాగుండునని కూడా అనుకున్నది. కానీ ఇంతలా కొడతాడనుకోలేదు. అందుకే "వేండా (వద్దు) వేండా" అంటూ అడ్డుపడ్డది.

అయినా మణి కోపం ఆగలేదు. ఎక్కడినుంచో వచ్చింది. అగ్ని సాక్షిగా పెండ్లాడిన తన భార్యను కొడుతుందా అన్న కోపం అతనిది.

"ఇంక నీకు యిక్కడదా సీట్లేదుపో..." అంటూ ఆమె బట్టల్ని, సంచిని విసిరి వీధిలోకి వేసేశాడు. ఆపైన ఆమెను చేయి పట్టుకొని లాక్కొచ్చి వీధిలోకి నెట్టేశాడు. కన్నమ్మ ఏమీ చేయలేని అశక్తురాలైపోయింది. ఏం చేయడానికీ, ఎక్కడికి పోవడానికీ పాలుపోలేదు. ఆమెను చూసి అందరూ పకపకా నవ్వారు. సిగ్గుతో చచ్చిపోయింది. మెల్లగా వంగి తన బట్టల్ని, బ్యాగును ఎత్తి సంకలో పెట్టుకుంది.

అలివేలుకు లోపల సంతోషంగా వుంది. అందుకే ఏమీ మాట్లాడ్డం లేదు.

"అయో! అది మాదిగిదంట. మొన్న ఆ మణి గోడుదా ఎవ్వరికో సెప్పినాడంట"

"వాండికి ఏమిదా పోయ్యే కాలండా. పెద్దింటోళ్ళకు మన వీట్లోకి దా రానిస్తుమా. మన వస్తువులు తాకనిస్తుమా"

"యెన్నా అన్నాలం (అన్యాయం) యిదూ (ఇది)?"

"వాండిని చూసుకొని వూర్లో అందరు మొగోండ్లు యిట్లా పండ్లుదా సేస్తురు"

"వూరినించీదా యెల్లగొట్టండి దాన్ని"

రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

కొందరు చీదరించుకుంటున్నారు. కొందరు తిడుతున్నారు. నోటికి వచ్చినట్లు అంటున్నారు.

అవమానంతో మౌనంగా తల వంచుకుని అలాగే నిలబడిపోయింది కన్నమ్మ.

అప్పుడే పొరుగూరికి వెళ్లి ఐస్ అమ్ముకొని వస్తున్న సలీం భాషా దూరం నుంచీ ఆ సంఘటనను చూస్తూ వుండిపోయాడు.

కొంతసేపటికి కాస్త తేరుకుని తిరిగి రెండడుగులు వెనక్కి నడిచి తన యింటి గుమ్మంలో అలాగే కూలబడిపోయింది కన్నమ్మ

* * *

అదే రోజు...

కన్నమ్మకు, అలివేలుకు గలాభా జరిగిన రోజు.

ఎవర్నయితే తనవాడని కోటమ్మ నమ్మి వచ్చి కన్నమ్మగా మారిందో... అదే మనిషి

తనను తిట్టి, ఈడ్చి వీధిలోకి తోసి వెళ్లిపొమ్మన్న రోజు... ఎలా వెళ్లాలో, ఎక్కడికి వెళ్ళాలో దిక్కుతోచక తన ఆత్మాభిమానాన్ని చంపుకుని పొమ్మన్న వాళ్ల పంచన్నే పడి వుండి పోయిన రోజు...

రాత్రి సందేళ పొద్దున, యింటికో మనిషి చొప్పున నడివీధిలో చేరిపోయారు.

కొందరు అరవయాసలో తెలుగును మాట్లాడుతుంటే మరికొందరు పూర్తిగా తమిళంలోనే మాట్లాడుతున్నారు.

"యన్నాడా సమాచారం? "

(యేమిరా విశేషం")

పక్కనున్నతన్ని ప్రశ్నించాడింకో చొక్కాలేని పెద్దమనిషి.

"అదేప్పా పెటియారు! (పెద్ద మనిషీ) మన మణిదా వుండాడు సూడీ.. వాండుదా ఉత్తర దేశం పలస్తరందా పూడిసిండినాడు గదా. వాండు వొరు పెద్దింటి ముండని లేపుకొనిదా వచ్చూడ్శినాడు"

సమాధానం చెప్పాడతను.

"తాయి! అంత పనిదా సేసినాడా? " ఎన్నడూ వినని వింత రహస్యం విన్న వాడిలా ముక్కు మీద వేలేసుకున్నాడా చొక్కా లేని బాపతు.

"సరిడా! ఎన్నాంగూ! యిప్పుడు జరిగేపనిదా సూడండి"

హెచ్చరించాడింకో చిరిగిపోయిన చొక్కా తొడుక్కున్న పెద్దాయన.

"ఏమి లేదప్పా మణివుండాడే... అలివేలు మొగుండు సుబ్బరమణి. వాండుదా ఉత్తర దేశం పనికిదా పోయి వొగ మాదిగపిల్లని పిల్చకొచ్చేసినాడే... అది మాట్టాడేదానికి, పెటియారు పంచాయితీగా పెట్టినాడు. జనందా వచ్చిరి. ఆమా"

పంచాయతీని ప్రారంభిస్తూ అసలు విషయాన్ని ప్రస్తావించాడు యింకో పెటియారు కులపెద్ద.

"అయ్యో అంత పనిదా సేసినాడే. తప్పు కాదా ఏమీ? ఎప్పుడైనా మన మాలవాండ్లు మాదిగ వాండ్లల్లో సంబంధం కలుపు కుంద్రా ఏమీ? యిది నేరం కాదేమిడా? "

"ఎన్నాడా నేరం? సర్కారు వాండు మన రెండు కులంలని ఎస్సీ వాండ్లు అని వొగిటిగానే గదా సేసినాడు? "

"యింక వాండ్లకు మనంకు దా తేడా యన్నా? "

"తేడాలేకేమి? వాండ్లని మన వీట్లోకిదా రానియ్యము. వాండ్ల వీట్లో మనందా సాపాటు (అన్నం) తినము. మన గ్లాసులు, సామాన్లను వాండ్లేను తాకనియ్యము. వాండ్లకు సేతుల్లోదా నీళ్ళు పోస్తుము"

"అంతదా. మనంకు రైతులు అట్లదానే వీధిలో నిలబెట్టిదా నీళ్ళు పోస్తురు కదా"

"అవును వాండ్లకంటే మనం తక్కువ మన కంటే ఈ పెద్దింటి వాండ్లుదా యింకా తక్కువ"

"యెన్నాప్పాయిదూ. దేశంమనల్నిదా అంటరానోళ్ళంటుంది. మనం వీండ్లని అంటరానోళ్ళమంటివి. యెన్నాంగూ.. యిది తప్పుదా"

ఓ అభ్యుదయ వాది అరిచాడు.

"బో సెప్పి నావులేరా ముఠాలే. నీ యెన్నాడా సొల్లుదు (నువ్వు ఏమిట్రా చెప్పేది? )? వాండ్లను మనం తాకుదుమా. అది అనాశారందా"

ఓ చింపిరి తల సాంప్రదాయవాది విరుచుకుపడ్డాడు.

"డే...ఎన్నాడా యిాదూ. పెద్దోళ్ళు సెప్పనీ."

"ఎన్నాంగూ పెద్దోళ్ళు, పెటియార్లూ నాయం సెప్పండి? "

ఒక మాసిన లుంగీకట్టుకున్నతను అన్నాడు.

"ముందు యిది నిజమా? అబద్ధమా? మణిగాన్నిదా అడగండి. వాండు ఏమి సొప్తాడో సూడండి"

తలో మాట అనసాగారు.

విచారణ ప్రారంభమైంది.

"డేయ్! (రేయ్) మణీ! ఎన్నాడాయిదూ? నువ్వ ఒరు పుదుస్సు (ఒక కొత్త) ఆండదాన్నిదా తెచ్చుకుంటివి. సెరి అదీ నీ సొంత

యిసయందానే. కానీ ఆపుడుస్ను పొన్ను (పిల్ల) పెద్దింటి మడిసిదా నా ఏమీ? "

దబాయించుతూ అడిగాడు ఓ పెటియారు. అంతవరకూ ఓమూలన మౌనంగా నిలబడి వున్న మణినోరు విప్పాడు.

"నిజమే" అన్నాడు మెల్లగా.

"సెరి యింక నువ్వుదా వాయిముడురా (నోరు మూసుకోరా)" మధ్యలో అడ్డుకున్నా డింకొక గడ్డం పెరిగిన మనిషి.

"యిదిదా సమాచారం. యింక నాయ్యందా సెప్పంది". అన్నాడింకొక గోచీ మాత్రమే కట్టు కున్న వ్యక్తి

"సెప్పేదేముండాది? ఆయమ్మినిదా, రేపే ఊరెల్లగొట్టాల. అపరం వోణ్ణిదా కులానికి ఎలేయాల. అంతదా"

తన నిర్ణయం చెప్పాడొక పెద్దమనిషి.

"ముందు వాండి నిర్ణయందా అడుగ దాము. ఎన్నాంగూ? "అన్నాడు మరో పెద్దమ నిషి.

"యెన్నాడామణీ! దాన్ని వదుల్తువా. అప రం కులానికిదా దూరమవుతువా...సొల్లు? "

అడిగాడు కులపెద్ద.. పెద్ద పెటియార్.

మౌనంగా ఆకాశంలోకి చూస్తూ నిట్టూ ర్చాడు మణి. ఆకాశంలో చుక్కలు మనిషి కున్న కోటి ఆశల్లా మిణుకు మిణుకుమంటు న్నాయి. అప్పటికే నెలవంక పడమటి దిక్కుకు వాలిపోయి వుంది.

"ఎన్నాడా మౌనం? కులానికి దూరందా సేస్తే, మంగలోడుదా రాడు. సాంకలోడు గుడ్డలు ఉతకడు. ఊరు బాయిక్కి తన్నికి (నీళ్లకు)దా రానియ్యరు. తెరియుమా? "

"అంతదానే కాదప్పా అందరితోబాటుగా కూలిపనులకు దా రానియ్యము. నువ్వూ నీ పెండ్లాము, పిల్లవాండ్లు పస్తుదా వుంట్రు. పసి (ఆకలి) ఎక్కువై మలమలా మాడిదా సస్తురు. ఆc."

మరో పెటియారు గర్జించాడు.

"ఎన్నాడా? సైత్తికారీ! నీ నిర్ణయందా సొప్పు."

యింకో అతను వత్తిడి తెచ్చాడు.

"సెరి. తప్పుదా సేస్తిని నాది రొంబా నేరందా. మీయిష్ట ప్రకారమే సేస్తును"

తన నిర్ణయం కూడా చెప్పేశాడు మణి.

పగలు జరిగిన సంఘటనతో దిగులు పడి పోయి ఆ ఇంటి ముందరే కూర్చొని ఉన్న కన్నమ్మకు ఆ మాటతో నెమ్ము తిరిగి పోయా యి. అలాగే చూస్తుండిపోయింది.

"నువ్వు ఏంచేస్తువో మాకుదా తెలవదు. రేపటి లోపల దాన్నిదా ఊర్లో లేకుండాదా సెయ్యి. అంతే. ఎన్నా? "

అంతిమ తీర్పు చెప్పేశాడు పెద్ద పెటి యారు.

"సరే" అన్నాడు మణి.

అంతటితో ఆ పంచాయతీ ముగిసింది. ఎవరిండ్లకు వాళ్లు వెళ్లిపోయారు. మణి ఆలో చిస్తూ యింటికి చేరుకున్నాడు.

సరిగ్గా అప్పటికి అర్ధరాత్రి దాటింది.

ఈ పయనం ఎటు?

18



కన్నమ్మ నడుస్తోంది.

గుండెలో నిప్పుల కుంపటిని, సంకలో తన బట్టల సంచినీ మోసుకుంటూ వేగంగా నడు స్తోంది.

ఆ రాత్రి పంచాయతీలో కులపెద్ద పెద్ద పెటియారు తీర్పుకి కట్టుబడి తనను వెళ్లిపొ మ్మన్నాడు మణి.

అలివేలు సంతోషించింది.

కన్నమ్మ ఏడ్చింది. ఇది అన్యాయం అంటూ ఆక్రోశించింది.

తనగోడు ఆ పరాయి దేశంలో ఎవరిం

టారు. అందరూ తనను శత్రువులాగే చూస్తున్నారు. తనెవరికి చెప్పుకుంటుంది?

ఆలోచిస్తూ నడుస్తోంది.

వెనక్కి తిరిగి కూడా చూడడంలేదు. అలా చూడడానికి ఆమె మనసు ఇష్టపడడం లేదు.

ఆమె నడుస్తోంది. మనసులో ఆవేదన తగ్గడంలేదు. ఎక్కడికి పోవాలో ఏంచేయాలో పాలుపోవడంలేదు. చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు.

'ఇప్పుడేం చేయాలి? ఎక్కడికి వెళ్లాలి" తీవ్రమైన ఉద్వేగంతో ఆలోచించ సాగింది.

వెనక ఎవరో వస్తున్నట్లు అలికిడయింది. ఆc ఎవరోలే అనుకుంది.

"కన్నమ్మా!" ఎవరో పిలిచినట్లయింది.

ఎవరబ్బా అనుకుంటూ అప్రయత్నంగానే వెనక్కి తిరిగింది. ఎదురుగా ఉన్న మనిషిని చూసి ఆశ్చర్యపోయింది.

ఎవరయితే తనతో రాద్ధాంతం చేసిందో, ఎవరయితే తను ఆ ఊరొదిలి రావడానికి కారణమయిందో ఆ మనిషి... అలివేలు... ఎదురుగా నిలబడి ఉంది.

"కన్నమ్మ, నన్నుదా సెమించు. నేరం నాదిదా. నువ్వు నిండా మంచి దానివి. ఆ విషయం నాకు నల్లా (బాగా) తెలుసును. నాను ఏం చేస్తును. నేనూ ఆడదాన్నిదా. నా మొగుండు వట్టి అంబేద. రేపు నీకంటే బాగుండే యింకో ఆండది పరిచయమైతే, మళ్లా యిట్లదానే చేస్తుడు. నాకూ... నా మొగుండు, సంసారం, నా పిలగాండ్లు అనిదా వుండునుకదా... నన్ను సెమించు."

వంగి కాళ్ళు పట్టుకోబోయింది.

కన్నమ్మ కోపమంతా కరిగిపోయింది. గుండెలో బాధంతా దిగి పోయింది.

"ఛీ... ఛీ. లే అలివేలులే. నువ్వు నాకంటే పెద్దదానివి. అట్లా చెయ్యకూడదు. దీంట్లో నీ తప్పేమీ లేదు. నీవూ అందరిలాంటి ఆడదానివే కదా. నీకూ నీ సంసారం, పిల్లలూ, నీ బతుకూ అని ఉంటుంది కదా. నీ సంసారంలోకి రావాలనుకోవడం నాదే తప్పు. కానీ మీ ఆయనకు ముందే పెండ్లయిందని నాకు తెలీదు. విధి లేని పరిస్థితిలో మీ ఊరికి రావాల్సి వచ్చింది. నువ్వే నన్ను క్షమించాలి" కళ్ళ నీళ్లు కార్చుకుంటూ అంది కన్నమ్మ.

"అమ్మా, తంగీ (చెల్లీ). నాకూ యిప్పుదా తెలిసిందీ. నా మొగుండు వాడు దా సెప్పి నాడు... నీకు మాయ మాటలు సొప్పి యింటికి తీసుకొని వచ్చినాడని నిండా అర్థం అయిండాది"

అలివేలు ముఖంలో పశ్చాత్తాపం కనిపించింది.

ఆమె నిజం తెలుసుకున్నందుకు కన్నమ్మ చాలా సంతోషించింది.

"పోనీలే అలివేలు. నోరారా తంగీ అన్నావు. అది చాలు. ఇంక నువ్వు నిశ్చింతగా మణితో కాపురం చేసుకో" అంటూ ఒకడుగు ముందుకు వేసింది కన్నమ్మ.

"కన్నమ్మా. వొరు నిమిషం" అని అలివేలు ఆమె చేయి పట్టి ఆపి గబగబా పైట కొంగు ముడి విప్పసాగింది.

కన్నమ్మ ఆమెనే పరీక్షగా చూస్తోంది.

విప్పిన కొంగు ముడిలో నుంచీ బాగా మడత పెట్టి ముడివేసి ఉన్న ఇరవై రూపాయల నోటు తీసి కన్నమ్మ చేతిలో పెట్టింది.

ఆమె అభిమానానికి కన్నమ్మ కళ్లు మరోమారు చెమర్చాయి.

"వద్దు అలివేలు వద్దు. నువ్వే ఉంచుకో. నా జ్ఞాపకార్థం నువ్వు గాజులు తొడుక్కో. లేదా పాపకి ఒక గౌను కొనిపెట్టు" అని మళ్లీ ఆ యిరవయ్యా ఆమె చేతిలోనే పెట్టేసి, ముందుకు నడిచింది కన్నమ్మ.

కళ్ళ నీళ్లతో ఆమెనే చూస్తూ అలాగే నిలబడి పోయింది అలివేలు.

ఇప్పుడు కన్నమ్మ గుండెలో మండుతున్న నిప్పుల కుంపటి చల్లబడినట్టయింది. అంతవరకూ నెత్తి పైన మోస్తున్న భారమేదో తొలగిపోయినట్లనిపించింది.

వేగంగా నడుచుకుంటూ... ఊరి పొలిమేర దాటింది. ఒంటిమాను బాట పట్టింది.

నడి నెత్తిన సూర్యుడు, ఆమె మనసులాగే భగభగ మండిపోతున్నాడు. శరీరం చెమటలు కక్కుతోంది.

అయినా ఆమె ఆగడం లేదు. పోతూనే ఉంది.

చాలా సేపు నడిచిన తర్వాత దూరంగా ఒంటిమాను, తనలాగే ఒంటరిగా నిలబడి ఉన్నట్టు స్పష్టంగా కనిపించింది.

రోడ్డుమీద ఓ బస్సు వేలూరు వైపుకు హార్న్ యిచ్చుకుంటూ దూసుకుపోయింది.

"ఇన్ని రోజులూ నాకు ఆశ్రయమిచ్చిన ఊరు... ఆదరించిన ఊరు. కడాకు అవమానించి, వెళ్లగొట్టిన ఊరు" అనుకుంటూ ఒక్కసారి వెనక్కి తిరిగి చూసింది. దూరంగా చింత చెట్ల మధ్య స్పష్టా స్పష్టంగా కనిపించసాగింది ఊరు. ఆ ఊరి కాలిబాట నుంచీ సైకిల్ తొక్కుకుంటూ వేగంగా వస్తున్నాడు ఓ వ్యక్తి.

అదేదీ పట్టించుకోకుండా ముందుకు నడుస్తోంది కన్నమ్మ.

కొంతసేపటికి ఆ సైకిల్ వ్యక్తి దగ్గరయ్యాడు.

పక్కగా వచ్చి సైకిల్ ఆపి ఆమె వైపు చూశాడు.

ఆమె ఉలిక్కి పడింది.

ఆతను ఐస్ బాషా. సలీం బాషా.

"హెక్కడికీ పోతుండావ్ కన్నమ్మాజీ" అంటూ పలకరించాడు.

ఒక్క క్షణం మౌనంగా తల వంచుకుని నిలబడ్డది.

బాషా సైకిల్ దిగి, హ్యాండిల్స్ పట్టుకున్నాడు.

"కన్నమ్మా! నీకీ బాధ నాకీ తెలుసు. నేను నీకీ సాయం సేస్తును" అంటూ వెనక బాక్సులో ఉన్న పుల్లయిసునొకదాన్ని తీసి "ముందు అయిస్ తీసుకో" అంటూ అందించాడు.

"వద్దు, వద్దు" అంది అయిష్టంగా కన్నమ్మ.

"దేకోజీ. మనుషులు... అందరూ వొక్క మాదిరిగానే ఉండరు. నన్ను నమ్ము. డర్ నక్కో. తీసుకో. ముందు నాదీ అయిస్‌కీ రుచి సూడు. దిల్ సల్లబడతాది" అంటూ బలవంతం చేసి అయిసు చేతికిచ్చి తినమన్నాడు.

కన్నమ్మ ఇష్టం లేకపోయినా అయిసు తీసుకుని చప్పరించసాగింది. ఆ అయిస్ ప్రభావంతో నోరంతా చల్లగయింది.

"యిప్పుడు సెప్పు. నీకీ వచ్చిన కష్టం ఏమి?" అడిగాడు సలీం బాషా.

"ఏమీ లేదు. నేను మా ఊరికి వెళ్ళిపోదామనుకుంటున్నాను" అబద్ధం చెప్పింది.

తను ఎన్నడూ సొంత ఊరికి పోదు. ఆ విషయం తెలిసే చెప్పింది.

"డర్ నహీ... నిజం సెప్పు. నీకు నేను తప్పక సాయం సేస్తును" మళ్లీ అన్నాడు.

"లేదు సలీం. మా ఊరికి పోతున్నా"

"నేను పల్లెనించీ వస్తున్నాను. జరిగిందీ హేమిటో నాకు సమజయింది" ఆ మాటనేసరికి కన్నమ్మ ఏమీ చెప్పలేకపోయింది.

"ఇంక హిప్పుడు. హెక్కడికీ పోతావు గానీ... మా యింటికి



పోదామురా" అన్నాడు.

"వద్దు సలీం. ఇప్పుడే అనుభవించాను. నీకు పెండ్లయిందో లేదో నాకు తెలీదు" అంది కన్నమ్మ.

"నిఖా చేసుకుంటావా? " కొంటెగా ఆమె కళ్లలోకి చూస్తూ అన్నాడు.

ఛీ. ఈ మొగాళ్లంతా ఇంతేనేమో. ఒంటిగా ఆడది కనిపిస్తే చాలు. ముగ్గులోకి లాగాలని చూస్తారు. అందునా ఒకసారి కాలు జారిన ఆడది ఓటు పోయిన కుండలాంటిది... చుల కనగా చూస్తారు... పట్టి పట్టి చూస్తారు మన సులోనే అనుకోసాగింది.

"కన్నమ్మా.. బోలోc" అన్నాడు.

"నేనొస్తే...నీకు గనక పెండ్లయ్యి వుంటే... నీ పెండ్లాం నిన్ను సంపుతాది" అంది.

"నాకెవరూ లేరు. ఒకణ్ణే. ఐస్‌లమ్మి బతికే వాణ్ణి. నీకే ఇబ్బందీ వుండదు. మరి నాతో వస్తావ్? "

మళ్ళీ ఒక్క క్షణం మౌనం వహించి



ముందుకు నడవసాగింది. ఆమె చేతిలో ఐస్ సగం కరిగి ఉంది. బాషా సైకిల్ తోసుకొని ఆమె వెంట నడవసాగాడు.

"చెప్పు" అంటూ తొందరించాడు.

"అక్కడ నన్ను బాధ పెడితే" అనుమానం వ్యక్తం చేసింది.

"హక్కడ నీకీ ఏ బాధా వుండదు. నాదీ మాటా నమ్ము" భరోసాగా అన్నాడు.

"తను ఇక ఎక్కడికి వెళుతుంది? అందుకే ఏదో ఒకటి చేయాలి? ఎక్కడికో ఒక చోటికి వెళ్లాలిగదా? " తీవ్రంగా ఆలోచించసాగింది.

అయిస్ మరి కాస్తా కరిగింది.

"ఏమి ఆలోచిస్తున్నావ్. నీదీ మాటా మాకీ సెప్పు. నయితో... అయిసూ అమ్మేకి పోతాన్" అన్నాడు.

"నన్ను బాగా చూసుకుంటావా? " ఒక నిర్ణ యానికి వచ్చినట్టు అడిగింది.

"నీకీ ఏమీ భయం లేదు. బాగా చూసుకుం టాన్" అన్నాడతను.

చప్పరిస్తున్న అయిస్ పూర్తిగా కరిగిపో యింది. చేతిలో మిగిలిపోయిన పుల్లను దూరంగా పారేసింది. అయిస్ చప్పరించడం మూలాన కాబోలు ఆమె శరీరంతోబాటు మనసు హాయిగా వుంది.

"సరే. వస్తాలే. పద" అంది.

వెనకా ముందు ఏమీ ఆలోచించలేదు. ఇప్పటి పరిస్థితిలో, ఈ పరాయి స్థలంలో తనకొక ఆదరువు కావాలి. అంతే అను కుంది.

సలీంబాషా చాలా సంతోషించాడు.

"నువ్వు నా దెగ్గిరే ఉండిపో... నాకూ ఎవరూ లేరు. నీకీ యిష్టమైతే నిఖా చేసు కుంటాను. లేదా నువ్వు వప్పుకుంటే... నీకీ వీసా తెప్పిస్తాన్. కువైట్‌కీ పంపి స్తాన్. కువైట్‌కో లేదా సౌదీకో పోయా వో... నీకీ డబ్బుల్ కొదవలేదు. హక్కడ కుప్పల్ కుప్పల్ డబ్బులు ఇస్తురు"

ఇలా దారి పొడుగునా ఏవేవో కబుర్లు చెప్పాడు. తన మాట వింటే పువ్వుల్లో

పెట్టి పూజిస్తానన్నాడు. బాగా నమ్మబలి కాడు...

ఇద్దరూ నవ్వుకుంటూ ఒంటిమాను దగ్గరికి చేరుకొని బస్సెక్కేశారు.

* * *

సలీం బాషాది చిత్తూరుకి కొంత దూరంలో ఉన్న తురకపేట. ఆ పేటలో అయిదంకనాల బండలమిద్దె అతనిది. చిన్న ఇల్లు. ఒంటరి సంసారం. ఆ యింట్లోనే సలీం మనిషిగా ఆరు నెలలు గడిపేసింది. అక్కడ హిందూ సంప్రదాయాలు వదిలేసి ముస్లిం సంప్రదాయాల్ని అలవరచుకుంది. బిరియానీ వండడంలోను మంచి నైపుణ్యం సంపాదించింది. సలీం బాషా ఆమెకు ఒక బురఖా కూడా కుట్టించాడు. అతని సాహచర్యంతో ఉర్దూ కూడా నేర్చుకుంది.

ఆ తర్వాత కొద్ది రోజులకు కువైట్ పంపిస్తానని చెప్పి పాస్‌పోర్ట్ కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. వీసా కోసం ఎంక్వయిరీలు చేయసాగాడు. ఎలాగయినా సరే ఆమెను కువైట్ పంపేయాలనే పట్టుదలతో ఉన్నాడు సలీం బాషా.

అలాంటి సమయంలోనే అతని దూరపు బంధువునంటూ మస్తాన్‌బీ అనే నడివయస్కురాలు ఊర్లో దిగింది.

ఆమెకు వంటినిండా నగలే.

చెవుల నిండా రింగుల్లాంటి నగలు. మెడలో పెద్ద పెద్ద బిళ్లల హారాలు. ముత్యాల దండలు. వేలి వేలికీ ఉంగరాలు. చేతుల నిండా బంగారు గాజులు. ఒక చేతి రెట్టకు బంగారు కడియం... ఆమె ఒక ఎత్తయితే, బంగారం మరో ఎత్తుగా కనిపిస్తోంది.

విశాలమైన పాలభాగం, పెద్ద పెద్ద బుగ్గలు, వెడల్పాటి కండ్లు, పెద్ద ముక్కు, పొడవాటి జుట్టు... ఖరీదయిన చీరె, జాకెట్టు...

నోటినిండా తాంబూలంతో, కాస్త పొట్టిగా, పొట్ట కొంచెం పెద్దదిగా, బలిష్టంగా, ఆరోగ్యంగా కనిపిస్తున్న కాళ్లు, చేతులు. చామనఛాయతో ఎంతో నిండుగా కనిపిస్తోంది మస్తాన్‌బీ.

ఆమె ప్రతి మాటలోనూ, ప్రతి కదలికలోనూ, ధనం మూలంగా కలిగిన గాంభీర్యం, దర్పం, అహం కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి.

అయితే ఆమె తాంబూలం నమిలేటప్పుడు, నవ్వేటప్పుడు ఓ విధమైన అపసవ్యత ఏదో ప్రస్ఫుటమవుతూనే వుంది.

ఆమె వచ్చిన సందర్భంగా సలీం భాషా పెద్ద హడావుడి చేశాడు. మాంసం తెచ్చాడు. కన్నమ్మతో కలిసి బిరియానీలు, పిండివంటలు చేసి పెట్టాడు.

"ఆమెను మంచి చేసుకుంటే నీ జీవితం పూలబాటే... ఆమెలాగే నీ వంటినిండా నగలేసుకోవచ్చు సుఖంగా జీవించచ్చు" అని ఎన్నెన్నో కబుర్లు చెప్పాడు. ఆమె గొప్పతనం గురించి, సిరిసంపదల గురించీ, ఆమె మంచితనం గురించీ ఎంతో గొప్పగా చెప్పాడు.

అయినా కన్నమ్మ వాటిపైన ఆశపడలేదు. కానీ తనకూ ఓ సొంత వ్యక్తిత్వం స్వేచ్ఛ, గౌరవం వుండే జీవితం వుంటే చాలనుకుంది.

మస్తాన్‌బీ రెండురోజుల తర్వాత ఊరికి బయలుదేరింది. ఉన్న ఆ రెండు రోజులూ వాళ్లు చూపించిన అభిమానానికి, ఆతిథ్యానికీ ఎంతో సంతోషించింది మస్తాన్‌బీ.

"భయ్యా. సలీం! కన్నమ్మ మంచి బిడ్డ. ఎప్పుడయినా మా యింటికి తీసకరా. బిడ్డ ముంబాయ్ సిటీ చూస్తుంది. హేమంటావ్" అంది మస్తాన్‌బీ.

"దీదీ. మేం బొంబాయి వస్తాములే. కానీ దీన్కి ఏదయినా వీజా ఏర్పాటు చెయ్" ఎంతో వినయంగా అడిగాడు.

"తప్పకుండా చేస్తాన్ సలీం. నువ్వు పాస్ ఫొటో చూడు. అలాగే కన్నమ్మవి ఆట్ ఫొటో నాకీ పంపించు. నేను బందీ వీజానో ఏదో ఒకటి తెప్పిస్తాను" అని భరోసా యిచ్చి బస్సెక్కి వెళ్ళిపోయింది.

మస్తాన్‌బీ వెళ్లిన నెలకు ముంబాయి

నుంచీ ఉత్తరం వచ్చింది. అక్కడికి వెళ్ళాక కన్నమ్మ కోసం కువైట్‌కు ట్రై చేసిందనీ, కానీ కువైట్‌లో పరిస్థితి బాగా లేదనీ, కావాలంటే సౌదీకి ఒక నెలలో వీజా తెప్పిస్తాననీ, నెలకు పదివేల దీనార్లు జీతమనీ తెలియజేసింది ఆ ఉత్తరంలో మస్తాన్‌బీ.

అంతేగాకుండా ఫ్లైయిట్ చార్జీలకు, వీసాకు అయ్యే ఖర్చు తానే సాయం చేస్తాననీ, దాన్ని ఉద్యోగంలో చేరినాక రెండు మూడు విడతలుగా తీర్చాలని కూడా రాసింది. దానికిష్టమైతే ఫొటోలు వెంటనే పంపమని కూడా రాసింది.

ఆ ఉత్తరం చూసుకొని సలీం బాషా తెగ ఆనందపడిపోయాడు. ఏది ఎలా ఉన్నా, కన్నమ్మకు కూడా కాస్త ఆనందంగానే అనిపించింది.

ఆ రోజే కన్నమ్మను చిత్తూరు తీసుకెళ్ళి ఫొటోలు తీయించాడు.

"అక్కడ ఉర్దూ మాట్లాడాల్సి వుంటుంది. అందుకని సాయిబులకయితే మంచి గౌరవం కూడా వుంటుంది. నీ పేరు మారుస్తాను" అని చెప్పి ఆమెకు కన్నమ్మకు బదులుగా 'హసీనా బేగం' అని పేరు మార్చాడు.

ఆ పేరుతోనే పిలిచాడు. ఆ పేరుతోనే అందరికీ పరిచయం చేశాడు.

తీసిన ఫొటోలు రెండు జత చేసి మస్తాన్‌బీకి పెద్ద ఉత్తరం రాశాడు సలీం బాషా.

ఆ ఉత్తరానికి బదులు ఉత్తరం మరో నెల తర్వాత వచ్చింది. ఆ ఉత్తరం అందుకొని ఎగిరి గంతేశాడు సలీం.

కన్నమ్మను కౌగలించుకున్నాడు. ముద్దులు పెట్టాడు. పైకెత్తుకొని గిరగిరా తిప్పాడు.

"వీజా. బందీ వీజా... వచ్చేసింది. ఇంక నీకీ తిరుగులే. సౌదీలో ఏక్ సేట్‌కీ వంట మనిషిగా పోతావ్. నెలకి దస్ హజార్ దీనార్లు- సంబళం..." వివరంగా చెప్పాడు.

ఆమె ప్రతి మాటలోనూ, ప్రతి కదలికలోనూ, ధనం మూలంగా కలిగిన గాంభీర్యం, దర్పం, అహం కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. అయితే ఆమె తాంబూలం నమిలేటప్పుడు, నవ్వేటప్పుడు ఓ విధమైన అపసవ్యత ఏదో ప్రస్ఫుటమవుతూనే వుంది

ఆ వార్త విన్న కన్నమ్మ ఉరఫ్ హసీనా బేగం కూడా చాలా ఆనందించింది.

"హసీనా వచ్చే ఆదివారం... మనం సిత్తూర్‌కి పోయి బస్సెక్కుతాం. తిరుప్తిలో దిగి రేణిగుంటకీ పోతాం. హక్కడ నుంచీ బొంబాయికీ, సీదా ట్రయిన్ పోతుంది. దాన్కి పోతాం. మనము వస్తున్నట్లు ఫోన్లో మస్తాన్‌బీ దీదీకి సెప్తాం, స్టేషన్‌కి రమ్మని"

తమ ప్రయాణ విశేషాలు చెప్పాడు.

"హక్కడికి పోయిన వెంటనే విమానంకి సీటు దొరకదు. అంతవరకూ దీదీ యింట్లో వుంటాం. ఏరోజు సీటు దొరికితే ఆ రోజు నిన్ను విమానం హెక్కిస్తాం" అంటూ సౌదీకి వెళ్ళే విషయం కూడా చెప్పేశాడు. అతని ఒక్కో మాటా ఓ తేనె బిందువులా తియ్యగా అనిపించింది. మోడుబారిన చెట్టును చిగురింపచేసే అమృత బిందువులా అనిపించింది.

ఆ ఆనందంతోనే వారం గడిచిపోయింది.

ఆ ఆదివారం రానే వచ్చింది.

సలీంబాషా చిత్తూరుకు వెళ్ళి ఒక పెద్ద సూట్‌కేసు కొనుక్కొచ్చాడు. దానినిండా బట్టలు సర్దాడు. చార్జీలకు ఎలాగో డబ్బులు కూడా సర్దుకున్నాడు.

ఆ రోజు ఉదయానే స్నానపానాదులు ముగించుకుని అంత టిఫిన్ చేసుకుని తినేసి, బోకులు కడిగేశారు.

"హసీనా. నీకీ ఏమీ భయంలేదు. మూడు సమచ్చరాల్ సౌదీలో ఉంటే స్సాలు. లచ్చల్ లచ్చల్ డబ్బుల్. ఆ డబ్బుల్తో మనం సిత్తూర్లో ఇల్లు కట్టుకుంటాం. మంచి చెప్పులు షాప్ పెట్టి వ్యాపారం చేసుకుంటాం"

భవిష్యత్తు గురించి తన ఆశల్ని గురించి చెప్పాడు. నిజమే కదా. అలాగే చేయొచ్చులే

అనుకుంది హసీనా బేగం.

అన్నీ సర్దుకుని ఇంటికి తాళం వేసి చిత్తూరు బస్సెక్కి తిరుపతిలో దిగారు. తిరుపతిలో ఒక మంచి హోటల్లో భోజనం చేసుకుని రేణిగుంటకు వెళ్ళారు. అక్కడ బొంబాయి వెళ్ళే రైలు ఎక్కేశారు.

అలా హసీనా బేగంగా మారిన ఆమె ఆ ఊరినీ, ఆ జిల్లానీ, చివరికి ఆ రాష్ట్రాన్నే వదిలి దూరంగా మరో కొత్త నేలపైన కాలు మోపడానికి బయలుదేరి వెళ్ళిపోయింది.

* * *

సరిగ్గా అప్పుడే కొక్కురకో అంటూ తొలి కోడి కూసింది.

చెప్పడం ముగించింది హసీనా.

ఆమె కళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

ఆ కథ విన్న ఓబులవ్వ కళ్ళు కూడా చెమర్చాయి.

"అయితే నాకో అనుమానం తల్లీ" అడిగింది ఓబులవ్వ.

"ఏమిటి? " పైటతో కళ్ళు తుడుచుకుంటూ అంది హసీనా.

"అడగనా? "

"అడుగు"

'మరయితే ఆ కోటమ్మవు నువ్వేనన్నమాట'

"అవును..."

"ఆ ఆదెమ్మ మనమరాలు నీ కూతురే"

"అవునవ్వా అవును"

కూతురు గుర్తుకు వచ్చి వలవలా ఏడ్చింది.

దూరంగా తొలికోడి మలిసారి కూసింది.

"సరే యిప్పుడేం చేయాలనుకుంటున్నావు? నీ కూతుర్ని చూసేదానికి పోతావా? " అంత బాధలోను ఆసక్తిగా అడిగింది ఓబులవ్వ.

"అవునవ్వా! ఈ రోజుతో ఈ అజ్ఞాతవాసం పూర్తయింది. రేపట్నుంచే ఇక్కడ నేను చేయాల్సిన పనులు ప్రారంభిస్తాను. కలికిరిలోను పని పూర్తయింది. ఇక్కడ పరిస్థితులు ఎట్లా వుండాయో తెలుసుకునే దానికే ఈ గుడిసెలో తలదాచుకున్నా. నీ మేలు మరవలేను" అంది హసీనా ఉరఫ్ కోటమ్మ.




"కాలగమనంలో ఓడలు బండ్లవుతాయి. బండ్లు ఓడలవుతాయి అంటారు. కొందరికి కట్టెలమ్మే చోట పూలు అమ్మే పరిస్థితి, ఇంకొందరికీ పూలమ్మిన చోట కట్టెలమ్మే దుస్థితి కలుగుతుందంటారు. కానీ ఈ మనుషుల మనసుల నిండా స్వార్థం, కుట్ర, కుతంత్రం, మోసం, ద్వేషం వంటి మలినాలు కూరుకుపోతున్నాయి. మనుషులు తమ శరీరాల నిండానే కాదు, మనసుల నిండా కూడా కల్మషాన్ని నింపుకుంటున్నారు.

అందుకే చాలామటుకు ఓడలు స్టీమర్లవుతున్నాయి. బండ్లు విమానాలవుతున్నాయి. కానీ ఓడలు బండ్లు కావడంలేదు. కట్టెలమ్మే చోట్ల పూల మార్కెట్లు వెలుస్తున్నాయి. ఆ ప్రదేశాల్లో పూలమ్ముకునే జనాలే ఎక్కువైపోతున్నారు. కానీ పూలమ్మిన చోట కట్టెలమ్ముకునే దుస్థితి ఏ కొందరికో. ఆ కొందరికీ పూలమ్మిన చోటే కట్టెలమ్ముకునే నికృష్ట స్థితే వుంది. ఆ చోటే కాటికి చేర్చేవారు కూడా కరువైపోయే పరిస్థితుల్లో వాళ్ళు జీవిస్తుంటారు. తన జీవితంలోనూ అదే కదా జరిగింది" కోటమ్మ ఎప్పుడూ ఆలోచించే విషయం అది.

చాలా ఏండ్ల తర్వాత... ఆ రోజు ఉదయం తిరిగి ఆ ఊర్లో అడుగు పెట్టింది. ఊర్లోని ఇండ్లని పర్యవేక్షిస్తూ నడుస్తోంది.

ఊర్లో ఇండ్లు అలాగే వున్నాయి...కానీ అవన్నీ చాలా పాతవైపోయినట్లు కనిపిస్తున్నాయి. వచ్చేటప్పుడు పొలాలు చూసింది. సంక్రాంతి మాసంవల్ల కాస్తా పచ్చగా ఉన్నా... వాటికీ తగిన వర్షాలు పడినట్లు లేదు. అందు

కే కాబోలు అవి ఆరోగ్యంగానూ, సమృద్ధిగాను వున్నట్లు కనిపించడంలేదు... కొన్నిచోట్ల బీళ్ళు వదిలేసిన పొలాలు కనిపించాయి. ఊర్లో ఒక ప్పుడు గొర్రెలు, మేకలు, పశువులు వీధినిండా కనిపించేవి. ఇప్పుడూ వీధుల్లో ఒకటో రెండో పాలగొడ్లు తప్ప పశు సంపద దాదాపు శూన్యంగానే కనిపిస్తోంది. కరుకు నీడలు ప్రస్ఫుటంగానే కనిపిస్తున్నాయి.

అలా చూసుకుంటూ ఊరు దాటింది. దళి తవాడలోకి అడుగుపెట్టింది. వయసు తెచ్చిన పెద్దరికం, జీవితం నేర్పిన అనుభవం ఆమెను ఒక ప్రశాంతమూర్తిగా మార్చాయి.

అక్కడ... తెలిసిన ముఖాలు తగ్గిపోయి కొత్త ముఖాలెన్నో దర్శనమిచ్చాయి. పల్లె జనాలలోను పెద్దగా మార్పులేదు. అప్పటిలా గానే మగవాళ్ళు దుప్పట్లు కప్పుకొని పనీ పాట లేక యిళ్ళముందర వగర్చుతూ కూర్చొని ఉన్నారు.

కాకపోతే పల్లెకు కరెంటు వచ్చింది. ప్రత్యే కంగా ఓ బోరింగు వచ్చింది. ఆ రెండు మార్పులు తప్ప మరి ఏ మార్పులూ కనిపిం చడం లేదు.

ఆమె మనసునిండా తన వాళ్ళను చూసు కోవాలనే తపన. తన కూతుర్ని అక్కున చేర్చుకుని, చివరి రోజుల్లో ఇక్కడే వుండిపోవా లన్న ఆశ. అమాయకురాలయిన తన తల్లికి చేదోడుగా నిలవాలన్న ఆశ...

ఆమెను తిరిగి పల్లెకు రప్పించాయి.

నేరుగా తమ యింటికి వెళ్ళింది.

తమ యింట్లోను ఏ మార్పులేదు. ఇల్లు అప్పుడు ఎలా ఉందో ఇప్పుడూ అలాగే వుంది.

ఆమెనెవరూ గుర్తు పట్టినట్లు లేదు...

"ఎవరు యింట్లో?" అంటూ కొట్టంలో అడుగు పెట్టింది.

పళ్ళు రాలిపోయి, తల నెరిసిపోయి, వంగిన శరీరంలో వణుకుతూ వచ్చిందో ముసలావిడ.

వచ్చి "ఎవరు కొడకా నువ్వు. ఏం గావల తల్లీ?" తన ముసలి కళ్ళను చికిలించి చూస్తూ అడిగింది. ఆ మాటలు కూడా వణు కుతూనే వెలువడుతున్నాయి.

కోటమ్మ ఆమెను గుర్తుపట్టింది.

ఆమె తన తల్లి... ఆదెమ్మ.

"అమ్మా నేను మీ కోటమ్మను" తల్లిని చూసిన ఆనందంలో పొంగుకొచ్చిన దుఃఖం తో ముందుకు అడుగేస్తూ పలకరించింది.

"ఆఁ.. కోటమ్మవా?" కళ్ళపైన అరచేయి పెట్టుకొని మరీ చూసింది ఆదెమ్మ.

కోటమ్మ కళ్ళు ధారాపాతంగా వర్షిస్తు న్నాయి.

మంచి దుస్తుల్లో, నగలలో పట్నం దొరసా నిలా ఉన్న కోటమ్మను నమ్మలేనట్లు చూసిం ది ఆదెమ్మ. ఇంకాస్త పరిశీలనగా చూస్తే నీర సంగానూ, కాస్త జబ్బు మనిషిలాగాను కూడా కనిపించింది కోటమ్మ.

నమ్మలేనట్లు వింతగా చూస్తూనే ఉంది ఆదెమ్మ.

"నేనేనమ్మా... నీ పెద్దకూతుర్ని కోట మ్మను" మళ్ళీ తనే పలకరించింది.

"అయ్యో తల్లీ నువ్వా! ఎంత మారిపోయి నావమ్మా. నువ్వసలు బతికే వున్నావా తల్లీ, నేనింకా ఎవురో అనుకున్నానమ్మా. రా... లోపలికి రా"

కూతుర్ని చూసుకున్న ఆనందంలో ఉక్కిరి బిక్కిరైపోతూ కోటమ్మను చేయి పట్టుకొని గుడిసె లోపలికి తీసుకుపోయింది. చాప పరచి కూర్చోబెట్టింది.

కోటమ్మ ఆ యింటిని ఎంతో ఆప్యాయంగా పరిశీలించసాగింది. ఆ యింట్లో ఏ మార్పు లేదు. కాకపోతే అప్పటికంటే యింకాస్త పాత బడిపోయి కనిపిస్తోంది. అంతే.

"నీళ్ళు తాగతావా తల్లీ" ప్రేమగా అడిగింది ఆదెమ్మ.

"వద్దులేమ్మా. మళ్ళ తాగుతాను" అంది కోటమ్మ.

"యిన్నేళ్ళు యాడుంటివి తల్లీ?" కళ్ళారా కూతుర్ని చూసుకుంటూ అడిగింది.

## మంచి నిద్ర కోసం...



అనారోగ్యంతో ఆస్పత్రి పాలవటం ఎవ్వరికీ ఇష్టం ఉండదు. కాని తప్పని పరిస్థితుల్లో ఆస్పత్రిలో చేరాల్సి వస్తే వ్యాధి తగ్గి, త్వరగా బయట పడాలనే అందరూ కోరుకుంటారు. మరి అందుకు ఏం చేయాలి.

ఆస్పత్రి గదులు సూర్యరశ్మి, వెలుతురు, గాలి బాగా వచ్చే విధంగా ఉండాలి. ఇలాంటి గదుల్లో ఉండే రోగులకు నెప్పి తగ్గించే మందులు తక్కువ మోతాదులోను, చీకటిగా ఉండే గదుల్లో ఉండే రోగులకి ఎక్కువ మోతాదులోను అవసరమవుతున్నాయని ఇటీవల రోబెస్టర్ యూనివర్సిటీ నిపుణులు కనుగొన్నారు. సూర్యరశ్మి శరీరంలో సెరోటినిన్ విడుదల కావడానికి తోడ్పడుతుంది. ఆ సెరోటినిన్ వల్ల నెప్పులు త్వరగా తగ్గుతాయని వారు కనుగొన్నారు. అలాగే మంచి నిద్ర వ్యాధిని తగ్గించడానికి తోడ్పడుతుంది. కాని ఆస్పత్రుల్లోని శబ్దకాలుష్యం రోగులకు నిద్రాభంగం కల్గిస్తుంటుంది. అలాంటప్పుడు చెవుల్లో దూది కాని, శబ్దం తగ్గించే హెడ్ ఫోన్స్‌గాని వాడాలి.

ఆలోచనలు తగ్గించుకుని, మనసుని ప్రశాంతంగా ఉంచుకుంటూ, వైద్యులకు, వైద్య సిబ్బందికి సహకరిస్తే త్వరగా వ్యాధి తగ్గి ఆస్పత్రి నుంచి బయట పడవచ్చని నిపుణులు సూచిస్తున్నారు.

"యాడేడనో వున్నానులే గానీ... నాయనేడీ..? "

ఆ పరిసరాల నన్నింటినీ కళ్ళతోనే అన్వేషిస్తూ అడిగింది.

ఆ మాట వినగానే భళ్ళున యేడ్చేసింది ఆదెమ్మ.

"ఏమైందమ్మా!" ఓదార్చడానికి ప్రయత్నించింది కోటమ్మ.

"ఇంకా యాడ మీ నాయనమ్మా! ఆయన బొయ్యి పదేండ్లయి పాయ..." పైటతో కళ్ళనీళ్ళు తుడుచుకుంది.

"ఆఁ... నాయన సచ్చిపాయనా!" గాద్గదికంగా అడిగింది.

"అవునమ్మా. తాగి తాగీ సచ్చిపాయ"

ఇద్దరి మధ్య కొన్ని క్షణాలు మౌనంగా దొర్లాయి.

"సినపాప? " తెపరిల్లి అడిగింది కోటమ్మ.

"సినపాపను రొంపిచెర్ల దెగ్గిరిచ్చినాము. ఆయమ్మికేం ఫరవాలే బాగానే వుండాది. యిద్దరు బిడ్డెలు గూడా... వాళ్ళూ పెద్దంత అయినారు..."

"అబ్బోడు సుబ్బయ్య? "

"అబ్బోనికీ పెండ్లయి పూడిసిందిలే. వాడికీ బిడ్డలే. ఎడపిల్లలు. కల్లూర్లో సెప్పుల షాపు పెట్టుకోని వాడి బతుకు వాడు యేదో ఈడస్తా వుండాడు. అప్పుడప్పుడూ అంతో యింతో పంపిస్తా వుండాడు. జీవనం యెళ్ళిపోతా వుండాది"

"సరే... అరుణమ్మ..." అంతవరకూ అణుచుకున్న ఆతృత ఆమె మాటల్లో ధ్వనించింది.

అరుణ మాటెత్తుకునే సరికి వెక్కివెక్కి ఏడ్చింది ఆదెమ్మ. ఆమె వాలకం చూసి ఏదో జరగరానిదే జరిగివుంటుందని అనుమానపడింది కోటమ్మ.

"చెప్పమ్మా. ఏమైంది నా బిడ్డెకు? " ఆందోళనగా అడిగింది.

"ఏమీ కాలేదమ్మా. బాగానే ఉండాది. పెద్దంత బిడ్డయింది. పెండ్లి జేయాల.. కానీ"

"ఏం లేదమ్మా. మొన్నా మద్దెన ఆదేందో మాయ రోగమంటనే. మెదడువాపు రోగమో ఏదో, అది సోకి పల్లెలో ముగ్గురు, ఊర్లో యిద్దరు సిన్న బిడ్డెలు సచ్చిపోయిరి. దీని కంతా కారణం అమ్మోరు, ఆ అయితమ్మ ఆగ్రహంపైన వుండడమేనన్నారు. ఎవుర్నన్నా ముద్దరేసి దేవతకిచ్చి పెండ్లి జేసేస్తే... శాంతిస్తుందన్నారు. దానికెవురూ వప్పుకోలే. కాడకు వొగదినం మద్దిస్తం పెట్టుకుని, బసివిదాని కూతుర్నీ బసివినిగా మార్చాలంటా పట్టు పట్టారు. మాకు ఎనుకూ ముందూ ఎవురుండారు. ఏం బలం వుండాది... ఆ కార్యం... రేపాదోరమే జరిపిస్తారంట. సమయానికొచ్చి నావు తల్లీ" వివరంగా చెప్పింది ఆదెమ్మ.

ఆ వార్త వినగానే ఆమె గుండె ఒక్కసారి పగిలిపోయినట్టయింది. ఏదయితే జరగకూడదని ఇన్ని రోజులూ అనుకుందో అది జరగడానికి సిద్ధంగా వుంది. ఏ వార్త అయితే వినకూడదనుకుందో అదే వార్త వినవలసి వచ్చింది.

"నా బిడ్డెను ముద్దరేసి వదిలేదానికి వీళ్ళెవురు?" అంటూ ఆమె అంతరాత్మ ఆక్రోశించింది.

"నాకు పట్టిన గతి నా బిడ్డెకు పట్టకూడదు. దాన్నాపే దానికే నేనొచ్చినా. ఎట్లయినా సరే. నా బిడ్డను ఈ ఊబిలోకి తొయ్యకుండా చూడాల. ఆ నరకంలో పడకుండా చూడాలి" ఆవేశంగా అంది కోటమ్మ.

ఆదెమ్మ ఆమెవైపే దిగులుగా చూస్తూ కూర్చుంది.

"ఇంతకూ నా బిడ్డ ఎక్కడా?" అడిగింది.

ఆ మాట పూర్తయ్యీ కాకనే కట్టెల మోపు నెత్తిన పెట్టుకుని వచ్చింది ఓ ఇరవయ్యేళ్ళ కుందనపు బొమ్మ.

ఎగాదిగా చూసింది కోటమ్మ

ఆ బొమ్మ మబ్బుల్లో చందమామలా మెరిసి, పెరట్లోకి వెళ్ళిపోయింది.

"ఈ బిడ్డె నేడనో చూసినట్టుందే" అనుకుంది కోటమ్మ.

ఎక్కడ చూశానా అనుకుంటూ తీవ్రంగా ఆలోచించింది.

ఆ బొమ్మ కాళ్ళు, చేతులు, ముఖమూ కడుక్కొని తువ్వాలుతో తేమ తుడుచుకుంటూ యింట్లోకి అడుగుపెట్టింది. ఎదురుగా కూర్చొని వున్న మరో కొత్త మనిషిని చూసి ఆశ్చర్యపోతూ ఎవరన్నట్లు ఆదెమ్మ వైపు చూస్తూ నిలబడ్డది.

"ఆఁ.. గుర్తుకు వచ్చింది. ఆ బిడ్డే ఈ బిడ్డె. తాను ఈ ఊరొచ్చిన రెండో రోజున... పీలేరు బస్టాండ్లో ఓ కుర్రాడితో చూసిన బిడ్డె. ఆ రోజు సాయంత్రమే సినిమా చూసుకొని తనతోబాటు బస్సులో పులిచెర్ల వరకు ప్రయాణం చేసి ఆ రోజు అతనితో బాటు చీకట్లో మాయమైపోయిన బిడ్డె. ఏ బిడ్డెను చూసి, 'ఈ బిడ్డె నా బిడ్డయితే ఎంత బాగుంటుందని' అనుకుందో అదే బిడ్డె... యింతకీ ఈ బిడ్డే నా కూతురు కాదు గదా?" ఆ బొమ్మనే చూస్తూ మనసులోనే అనుకోసాగింది కోటమ్మ.

ఆదెమ్మ ఒక్కక్షణం అలాగే యిద్దర్నీ మార్చి మార్చి చూస్తూ వుండిపోయింది.

'ఆ అమ్మాయి అచ్చం కోటమ్మ నోటిలో నుంచీ అప్పుడే ఊడి పడినట్లుంది...' చిన్నప్పుడు కోటమ్మా యిట్లేగదా వుండింది. కోటమ్మ లాగా ఈ బిడ్డ మంచి కష్టజీవి. అన్ని పన్లు చేస్తుంది" అనుకుంటూ.

"మియమ్మ తల్లీ, కోటమ్మ బతికేవుండాది. యిన్ని దినాలకు నిన్ను చూసేదానికి వచ్చిండాది" అంది ఆదెమ్మ.

"ఇంత వయసయినా ఎంత బాగుండాది మాయమ్మ" అనుకుంది అరుణమ్మ కోటమ్మను చూస్తూ.

"అచ్చంగా నా పోలికే. తీర్చి దిద్దినట్లుండాది నా బంగారు తల్లి" అనుకుని లోలోపలే మురిసిపోయింది కోటమ్మ.

సిగ్గుపడుతూ అలాగే నిలబడి ఉంది అరు

ణమ్మ.

"రా తల్లీ. నేను మీయమ్మను రా..." చేతులు రెండూ ముందుకు చాపి పిలిచింది.

అరుణమ్మ మెల్లగా వెళ్ళి తల్లి పక్కన కూర్చుంది.

ఆమెను తాకగానే అన్ని సంవత్సరాలుగా అణచి పెట్టుకున్న మాతృత్వం ఒక్కసారిగా పొంగుకొచ్చింది కోటమ్మకు. అమాంతం అలాగే తన రెండు చేతులతో నిధిని పొదు వుకున్నట్లు పొదువుకుని అక్కున చేర్చుకుంది అరుణమ్మను.

"ఏడాది వయసులోపే నిన్ను వదిలేసిపో యిన కర్మురాల్ని తల్లీ...నన్ను క్షమించమ్మా" అంటూ అరుణ శిరస్సును ముద్దాడింది. తనివితీరా బిడ్డను చూసుకుంది. కళ్ళారా చూసుకుంది. తల నిమిరి ముఖాన్ని తన రెండు అరచేతుల్లోకి తీసుకుని బుగ్గలపైన ముద్దులు పెట్టి గుండెకు మరోసారి హత్తు కుంది. కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.

ఆవేళకు కోటమ్మ ఊర్లోకొచ్చిన విషయం తెలుసుకున్న ఆడవాళ్ళు కొంతరు ఆమెను చూడడానికి యింట్లోకి జొరబడ్డారు.

## 20

ఆ రోజు రాత్రి... చుట్టింట్లో ముగ్గురూ పడుకుని ఉన్నారు. ఆదెమ్మ హాయిగా నిద్ర పోతోంది. అరుణమ్మా నిద్ర పోతోంది. కానీ కోటమ్మకు నిద్ర రావడం లేదు. ఏవేవో ఆలో చనలు... ఎన్నెన్నో సంఘటనలు... బుర్రను తినేస్తున్నాయి.

"ఆడదానిగా అంటరాని కులంలో పుట్టిన తను ఎన్ని కష్టాలు పడింది. ఎన్ని అవమా నాలు భరించింది.

తను పూర్తిగా మగవాడి చేతిలో మోసపో యింది. అడుగడుగునా మోసపోయింది. దారుణంగా మోసపోయింది.

మూఢ నమ్మకాల కాలవాలమైన ఈ ఊరి జనాల వల్లా ముద్దరేయించుకుని బసవి కోట మ్మగా ముసలయ్య చేతిలో ఓడిపోయింది. ఆ తర్వాత తల్లిదండ్రులు పెట్టిన కోటమ్మ పేరూ ఆ అరవ మణిగాడి చేతిలో కన్నమ్మగా మారి పోయింది. చివరికి ఆ కన్నమ్మ పేరూ పోయి హసీనాగా మాళ్ళీ ఆ సలీంగాడి చేతిలో మళ్ళీ ఓడిపోయింది.

మొదట నా కన్నవాళ్ళు, నా వాళ్ళు కాకుండా పోయారు. ఆ తర్వాత నా ఊరూ నాది కాకుండా పోయింది. ఆ పైన తల్లిదండ్రులు పెట్టిన నా పేరూ నాకు కాకుండా పోయింది. చివరికీ నా జీవితమే నాది కాకుండా పోయింది. అన్నింటికంటే దారుణం నా శరీ రమే నాది కాకుండా పోయింది. ఈ దేశంలో ఇలా ఆడదాని జీవితం, శరీరం... ఒక వ్యాపార వస్తువుగా మారిపోవడం ఘోరమైన విషయం కాదా... ఏమిటి ఈ అన్యాయం? ఎవ్వరూ అడిగేవాళ్ళే లేరా? ఇది ఇలాగే సాగిపోవాల్సిందేనా?" తీవ్రంగా ఆలోచించసా గింది... ఆ ఆలోచనలు అలా సాగి ఇలా సాగే సలీం చుట్టూ తిరిగాయి.

సౌదీ అనీ బందీ వీజా అనీ తనను బొంబాయి తీసుకెళ్ళి మస్తాన్‌బీ ద్వారా అక్కడ ఒక వ్యభిచార గృహానికి అమ్మేసి బందీ చేసేశాడు సలీం బాషా.

ఆ మస్తాన్‌బీ అసలు వాడికి బంధువే కాదనీ, అదీ వీడూ కలిసి ఒంటరిగా దొరికిన ఆడవాళ్ళ నెందరినో నమ్మించి, మాయ మాట లు చెప్పి వ్యభిచార గృహాలకు అక్కడ అమ్మే స్తున్నారనీ తెలుసుకోవడానికి ఎన్నో రోజులు పట్టలేదు. అయినా తనేం చేసింది. తప్పించు కునే వీలులేక, వాళ్ళు పెట్టే హింసలు భరించ లేక ఆ బందిఖానాలో ఏ దిక్కూ మొక్కూ లేక వచ్చిన వాళ్ళ కోరికలు తీరుస్తూ ప్రతి వాడికీ వళ్ళప్ప జెప్పేసి పద్దెనిమిదేండ్లు గడి పేసింది. తప్పించుకునే వీలు లేనప్పుడు యిక తనేం చేస్తుంది. అక్కడ అంతో యింతో డబ్బులు కూడా మిగిలించుకుంది. వంటికి రోగాలూ అంటించుకుంది. చివరికి ఎలాగో తప్పించుకుని యిన్ని ఏళ్ళకైనా రాగ లిగింది. ఆ రావడం కూడా చాలా విచి త్రంగా జరిగింది.

మొదట్లో లొంగకుండా ఉండడానికి, తప్పించుకోవడానికి చేసిన యత్నాలన్నీ బెడిసి కొట్టడమే కాక వాటి ఫలితంగా ఒళ్లంతా అంగుళం ఖాళీ లేకుండా చీరుకుపోయి ఎన్నెన్ని చిత్ర హింసలు అనుభవించాల్సి వచ్చిందో లెక్కలేదు. చివరికి అన్నిటికీ స్వస్తి చెప్పి ఆ పాప కూపంలో ఉన్న వాళ్ళతో కలిసిపోక తప్పలేదు.

న్నాడోసారి. అప్పటినుంచి యజమానురాలి కంట బడకుండా అప్పుడప్పుడు వచ్చి హసీనాతో గడిపి పోతుండేవాడు.

షేర్‌ఖాన్ బాగా మాలిమి అయ్యాక అక్కడినుంచి తప్పించమని అడిగింది. కానీ దాని వల్ల జరిగే హాని, అనర్థం గురించి ఏకరువు పెట్టాడు. అది అసాధ్యం. ఆ మోటాదానికి చాలామంది పెద్దలతో సంబంధం ఉంది.



మాఫియా ముఠాలు, రాజకీయ నాయకులు, పోలీసులు వంటి అందరితో సంబంధాలున్న ఓ యాభై ఏళ్ళ స్త్రీ నడిపే ఆ నరక కూపంలో ఒక్కొక్కరికి ఒక్కో చిన్న గది కేటాయించారు. ఆ భవనమే లోకం. అక్కడికొచ్చే వారికి ఒళ్ళప్పగించడమే ఉద్యోగం అయిపోయింది.

దాదాపు అరవై డెబ్బై మంది ఉన్న ఆ పాప కూపానికి నరరూప రాక్షసుల్లాంటి ముగ్గురు కాపలా. వాళ్లలో షేర్‌ఖాన్ అనేవాడు హసీనాను బెదిరించి, బలవంతంగా కోరిక తీర్చుకు

వాళ్లలో సగం మంది ఆమె కస్టమర్లే. ఈ ఏరియాలో ఆమెకు చాలా మంది బ్రోకరు నాకొడుకులున్నారు. వాళ్లంతా వెయ్యి కళ్ళతో నిన్ను చూస్తుంటారు. నువ్వు పాతాళంలో దాక్కున్నా వదల్దు. చివరికి అవసరమైతే శాల్తీనే లేపేస్తుంది" అంటూ చెప్పడంతో చేసేది లేక తన దుస్థితికి కుమ్మి కుమ్మి ఏడ్చేది. అయినా తప్పని దౌర్భాగ్యపు బతుకుతో క్రమంగా రాజీ పడిపోయింది.

అలా ఆ పాపకూపంలోనే యిన్నేండ్లు మగ్గిపోయింది. ఇక ఈ నరకంలోనే తన జీవితం

ముగిసిపోతుందేమోనని బెంబేలు పడుతూనే ఉండేది.

ఈ మధ్య కాలంలో తనను అక్కడ పడవేసిన జాన్‌బీ ఓ అయిదారుగురిని అక్కడ తోసి వెళ్లిపోయింది. తనున్నప్పుడు అక్కడ అలా చేరిన చివరి అమ్మాయి తెలుగమ్మాయి.

ఒకరోజు... అర్ధరాత్రి కింద దృఢకాయుల అరుపులు వినిపించడంతో విటులు లేని అందరూ తమ తమ గదుల ముందరికి వచ్చి నిలబడ్డారు.

కింద హాలులో ఒక అందమైన అమ్మాయిని కొరడాతో కొడుతున్నాడో దృఢకాయుడు. షేర్‌ఖాన్‌తో బాటు మరో యిద్దరు, ఆడ రౌడీల చుట్టూ నిలబడి ఉన్నారు.

యజమానురాలి కళ్ళు చింత నిప్పులు కమ్ముతున్నాయి. ఆమె నములుతున్న జర్దా కిళ్లీ ఎంగిల్ని, మరో యువతి చేతిలో ఉన్న మట్టి పాత్రలో ఉమ్మి ఉమ్మి అరుస్తోంది.

"మారో ఓ గద్దీకో"

కొడుతున్న నల్ల జంతువుగాడు హిందీలో తిడుతున్నాడు.

"చెప్పినట్లినవే బాడకోవ్. లేకుంటే యిక్కడే చచ్చిపోతావ్" అరుస్తున్నాడతను.

"నేను చచ్చినా సరే వప్పుకోను. బయటికి పోతే మీ అంతు చూస్తాను" అంటూ కోపంతో అరచిందా అమ్మాయి.

ఆ మాటలు వినేసరికి ఉలిక్కి పడింది హసీనా. చాలా ఏళ్ళ తర్వాత మొదటిసారిగా అక్కడ తెలుగు మాటలు వింది.

"అంటే ఈ అమ్మాయి తెలుగమ్మాయన్న మాట. ఆ బాషాగాడు మళ్లీ ఎవర్నో బుట్టలో వేసుకుని తీసుకొచ్చి ఈ కూపంలో పడేశాడు" అనుకుంది.

ఆ కొడుతున్న నల్ల జంతువు మానవత్వం అనేది ఏ కోశాన వ్యక్తం కానంత పైశాచికంగా దెబ్బ మీద దెబ్బ వేస్తున్నాడు బలంగా.

చూస్తున్న వాళ్ళంతా వణికిపోతున్నారు.

ఆ దెబ్బలకు తట్టుకోలేక గజగజ వణికిపోతూ అరిచే శక్తిని కూడా కోల్పోయిందా అమ్మాయి. ఇక చచ్చిపోతుందేమోననిపించింది. ఎవ్వరూ ఆపడం లేదు.

ఇక సహించలేకపోయింది హసీనా. గబగబ మేడ దిగివచ్చి

"నక్కో భాయ్. నేను నచ్చచెబుతాను. ఊరుకోండి" అంది. ఆ నల్ల జంతువు కొట్టడం ఆపి యజమానురాలి వైపు చూశాడు.

ఆమె సరే అన్నట్లు కళ్లతోనే సైగ చేసింది.

హసీనా ఆమెను పొదివి పట్టుకొని పైకి లేపింది. శరీరమంతా రక్తం వోడుతున్న ఆమెను . తన గదికి తీసుకెళ్లి సపర్యలు చేసింది. ఆ యువతి కాస్త తేరుకున్నాక,

"మీదే వూరు? " అని ప్రశ్నించింది.

"మాది అనంతపురం జిల్లా. కదిరి దగ్గర ముడిగుబ్బ మా ఊరు" చెప్పింది విజయ.

ఆయింట్‌మెంట్ ప్రభావంతో ఆమెకు కొంచెం ఉపశమనం కలిగింది కాబోలు. ఏడుపు ఆపింది. ఏడుపు వల్ల వస్తున్న ఎక్కిళ్ళు ఆగిపోయాయి.

తను ఊహించని రీతిలో ఇక్కడ తెలుగు మాట్లాడే స్త్రీని చూసి విజయ ఆశ్చర్యపోయింది.

"సరే. ఈ పాప కూపంలోకి యెట్లొస్తివి? " తిరిగి ప్రశ్నించింది హసీనా.

"మా ఊర్లో మాకు సేద్యాలుండాయి. అయితే వర్షాలు లేక ఎప్పుడూ కరువే. మా నాయనకు మేము ముగ్గురం... ఆడపిల్లలం. మా అక్కను కలికిరిలో యిచ్చిండారు. అక్కడ నేను పది వరకూ చదువుకున్నే. మా చెల్లెలు నాకంటే అయిదేండ్లు చిన్నది. మా ఊర్లోనే ఉంది. మా నాయన మా యక్క పెళ్ళికీ, మమ్మల సాకేదానికీ అప్పులు జేశ. ప్రతి సంవత్సరమూ తొలేటి వానల్ని నమ్ముకోని చేన్లు దున్నుకుండేది. అప్పో సొప్పో జేసి, పంట పెడితే ఆ పంట ఎండిపోయేది. రాను రాను అప్పులు పెరిగినాయే గానీ జరుగుబాటు కాలే. ఆ అప్పులు తీర్చలేక మా నాయన యెసన పడి చస్తా ఉన్నాడు. నేను కూలిపనికి పోతావుంటి. ఆ కూలి పనికి

వస్తా పోతావుంటే, ఆ పని చేయిస్తావుండే మేస్త్రీ నామింద మొఖుసు పడి, నాకు కూలి పని దినామ్ము చూపిస్తా వుండె. అందరికంటె రెండు రూపాయలు ఎక్కువ కూలీ కూడా యిస్తా వచ్చె. వొగదినం నువ్వు ఊc అంటే పెండ్లి జేసుకుంటాననె. నేనూ సరేనంటి. వాడి మాయ మాటలు నమ్మి వొగదినం పెట్టే బేడా సర్దుకోని వచ్చేస్తి. వాడు నన్ను ముందుగా తిరప్తికి తీసుకపాయ. ఆడ వారం ఉన్నం, బెంగుళూరుకు తీసకొచ్చె ఆడ కొన్ని దినాలు గడిపె. ఆ తర్వాత వాడిపైన నాకు నమ్మకం పోయి నన్ను పెండ్లి చేసుకుంటావా? లేదా? ఏమి నీ కత అంటా నిలదీస్తి. ఈ దినం అటో యిటో తేల్చేయి. లేకంటే నేరుగా పోలీసు స్టేషన్‌కు పోతానంటి. దాంతో వాడు సిత్తూరుకు నన్ను తీసుకొచ్చి వొగ లాడ్జిలో దించె. అక్కడ వొగా యప్ప సలీం బాషా అంటా వొగ నేస్తుడంటూ నా దెగ్గరికు వొగ పెద్దాయన్ను తీసకొచ్చె ఆ పెద్దా యన బాగా నడివయసులో ఉంటాడులే. ఆయనా, వీడు నన్ను తీసుకోని ట్రైనెక్కి బొంబాయిలో దింపి, ఇద్దో వీళ్లకు నన్ను అమ్మేసి వెళ్ళిపోయినారు" భోరున ఏడుస్తూ చెప్పింది విజయ.

సరే. ప్రస్తుతానికి ఏమీ చేయలేం. నువ్వు వాళ్లు చెప్పినట్టు విను. నువ్వు ఏం చేసినా వాళ్లు వదిలి పెట్టరు. చంపనన్నా చంపేస్తారు గానీ నీ గోడు వినరు"

"ఓహో. ఆ సలీంగాడు యింకా ఈ యాపారం వదల్లేదన్నమాట" అనుకొని "నన్నూ ఆ సలీంగాడే ఈడ దోసేసి పోయినాడు" అంటూ తనెలా ఆ భవంతిలోకి వచ్చి పడిందీ వివరించింది హసీనా.

"సరే. ప్రస్తుతానికి ఏమీ చేయలేం. నువ్వు వాళ్ల చెప్పినట్టు వీను. నువ్వు ఏం చేసినా వాళ్ల వదిలి పెట్టరు. చంపనన్నా చంపేస్తారు గానీ, నీ గోడు వినరు" అంది తను.

"అయితే యింకెట్లక్కా!" అమాయకంగా అడిగింది విజయ.

"ప్రస్తుతానికి రాజీ పడాల్సిందే"

"ఈ పాపపు పని నేను చెయ్యలేను"

"ఏందట్టంటావ్! ఎవ్వన్తోనో లేసొచ్చినప్పుడు నీకు పాపం అనిపించలేదా? " కాస్త కోపంగానే అంది హసీనా.

ఆ మాటతో విజయ తనను వాటేసుకుని యింకా ఎక్కువగా యేడ్చేసింది.

"యేడవద్దు. ఊరికే ఉండు. యేదో ఉపాయం యోచిద్దాంలే." అనునయించింది హసీనా.

రెండు రోజులు గడిచిపోయాయి.

మూడోరోజు షేర్‌ఖాన్ వచ్చాడు. విజయను తీసుకెళ్ళి మరో గదిలో ఉంచాడు.

ఆ సమయంలో "యింక వారం టైమియ్యండి. ఆమెకు నేను సర్దిచెప్తాను" షేర్‌ఖాన్‌తో చెప్పింది తను.

"సరే. ఎలాగో ఈ వారం రోజులు యజమానురాలు ఏమీ అనకుండా చూస్తాను. ఆపైన అది ఎవ్వరూ చెప్పినా వినదు!" అన్నాడు షేర్‌ఖాన్.

రెండు రోజులు బాగా ఆలోచించి, ఒక నిర్ణయానికొచ్చింది.

ఆ రోజు రాత్రి, ఆమె కోసం ఏ విటుడూ రాలేదు. కానీ అర్ధరాత్రి రహస్యంగా షేర్‌ఖాన్ వచ్చాడు. తలుపు తట్టాడు.

నిద్దర లేచి తలుపు తీసింది తను.

ఆ సమయంలో జుబ్బా వేసుకుని, లుంగీ కట్టుకుని వుంది తను.

షేర్‌ఖాన్ తనను ఎగాదిగ చూసి తలుపు మూసి గడియ పెట్టి "ఈ డ్రస్‌లో చాలా బాగున్నావ్ హసీనా" అన్నాడు.

తను నవ్వింది.

అతను తనను రెండు చేతులతో ఎత్తి మంచంపైకి తీసుకెళ్ళి, కూర్చోబెట్టి తన పక్కనే కూర్చున్నాడు.

"షేర్‌ఖాన్... నిజంగా నీకు నేనంటే ఇష్టమా? " గోముతనం నటిస్తూ అంది తను.

"అల్లా సాక్షిగా చెబుతున్నా... నువ్వు ఇక్క డికి రాకముందు యిద్దరి ముగ్గురిని బాగా యిష్టపడుతుంటి. నువ్వొచ్చాకా... వాళ్ల దగ్గ రికి పోవడం లేదు. నువ్వంటేనే నాకు చాలా యిష్టం" అన్నాడు షేర్‌ఖాన్.

"అయితే నాదొక కోరిక తీరుస్తావా? "

"చెప్పు"

"కోపం తెచ్చుకోకు. నెమ్మదిగా ఆలోచించి చెప్పు.. యెట్లయినా సరే, యిక్కడి నుంచీ నన్ను, విజయను బయట పడేసే మార్గం చూడు ఇన్నేళ్లలో ఎన్నోసార్లు నిన్నడిగాను. నువ్వు కాదన్నావు. నాకూ వయసు పైబడు తుంది. ఈ ఒక్కసారన్నా నా మొర ఆల కించి నన్ను బయటపడేయి. నీ మేలు ఈ జన్మలో మరచిపోను" అతని చేతులు పట్టు కొని బ్రతిమిలాడింది. హసీనా

చాలాసేపు మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయాడు షేర్‌ఖాన్. చివరకు ఒక నిర్ణ యానికి వచ్చినట్లుగా చిన్నగా తలాడించి "ఒకేసారి... ఇద్దర్నంటే చాలా కష్టం. నిన్ను మాత్రం తప్పించడానికి ప్రయత్నిస్తాలే" అన్నాడు.

రెండు రోజుల్లోపే సమయం చూసి షేర్ ఖాన్ చేసిన సాయంతో ఎలాగో అక్కడి నుంచీ తప్పించుకు వచ్చేసింది తను. ఆ తర్వాత ఎన్నో కష్టాలు పడి పీలేరు చేరుకుని, అక్కడ పోలీసులకు, జాన్‌బీపైనా, సలీంబాషా పైనా రిపోర్టిచ్చింది. తానున్న వ్యభిచార గృహం వివరాలు, అడ్రస్ పోలీసులకు వివరిం చింది. పోలీసులు నాలుగురోజుల తర్వాత ముంబాయికి వెళ్లి రైడ్ చేసి విజయతోబాటు అందర్నీ ఆ ఇంటి నుంచి విముక్తుల్ని చేశారు. ఆ యజమానురాలిని, ఆమె మను షుల్ని, జాన్‌బీని, సలీం భాషాని, ఇతర ఏజం ట్లందరినీ జైల్లో వేశారు. అంతవరకూ తను విజయ యిచ్చిన అడ్రస్ ప్రకారం కలికిరికి వెళ్ళి, విజయ వాళ్ళ అక్క దగ్గరే వుంది.

విజయ నేరుగా ముదిగుబ్బ వెళ్ళకుండా కలికిరిలో తన అక్కగారింట్లో దిగింది. ఆ విజయ కోసమే ఇన్ని రోజులు కలికిరికి తను వస్తూపోతూ వుంది.

పైగా తనకు వచ్చిన రోగాలు పైకి చెప్పుకో లేనివి. అక్కడే డాక్టర్లను కలిసింది. ఎన్నెన్నో మందుల్ని వాడింది. అయినా తన ఆరోగ్యం కుదుటపడలేదు. కలికిరిలో ఉన్న ప్రముఖ ఆయుర్వేద డాక్టర్ ఒకరు యిచ్చే మందుతో అనేకమైన వాయురోగాలు, మరెన్నో యితర రోగాలు నయమయ్యాయని ఎవరో చెప్తే, ఆ మందులు వాడడం కూడా ప్రారంభించింది.

ఇంట్లో నూనెదీపం నిశ్చలంగా వెలుగు తూనే వుంది. కోటమ్మ ఆలోచిస్తూనే వుంది...

ఆ పాపకూపం నుంచీ తప్పించుకుని ఎంతో ఆశతో తన వాళ్ళకోసం యిక్కడికి వస్తే... ఇక్కడ మరో స్త్రీని తనలాగే బసివి నిగా మార్చి ఆమె జీవితాన్ని సర్వనాశనం చేయడానికి రంగం సిద్ధమైపోవడం, అదీ ఆ స్త్రీ తన కూతురే కావడం... కోటమ్మ గుండెను పిండేయసాగింది.

ముసలయ్య నెదిరించి తను బిడ్డను కన్నది తిరిగి బసివిని చేయడానికి కాదు. దీన్ని ఎలాగో ఓలాగు ఎదుర్కోవాలి. ప్రాణాలొడ్డ యినా సరే, ఆ దురాచారం నుంచీ తన బిడ్డను రక్షించుకోవాలి. ఆ ప్రయత్నంలో ప్రాణాలు పోయినా సరే... తను లెక్కచే యదు.

ఒక దృఢ నిశ్చయానికొచ్చేసింది కోటమ్మ.

ఇంట్లో వెలుగుతున్న ఒంటరి దీపం చీక టిలో యుద్ధం సాగిస్తూనే వుంది.

ఇంతలో ఏదో ఏడుపు వినిపించినట్టయి పక్కకు తిరిగింది.

పక్కనే ఉన్న అరుణమ్మ వెక్కి వెక్కి ఏడు స్తోంది. ఆ ఏడుపు విన్న కోటమ్మ ఆలోచ నలు తెగిపోయాయి. వెంటనే లేచి కూర్చుంది.

'అరుణా' అంది ఆప్యాయంగా.

ఆ మాటతో పైకి లేచి కూర్చొని 'అమ్మా'

అంటూ తల్లి వడిలో తల పెట్టి బోరున యేడ్చేసింది అరుణ.

"ఊరుకో... ఏం తల్లీ!" ఆమె తల నిము రుతూ అడిగింది కోటమ్మ.

"అమ్మా. నువ్వే నన్ను కాపాడాల" వెక్కిళ్ళ మధ్య వేడుకుంది అరుణ.

"నేనందుకే కదమ్మా వచ్చింది. నిన్ను ఎట్టి పరిస్థితుల్లోను మాతమ్మ ఆచారానికి బలి కానివ్వను. నా ప్రాణం అడ్డేస్తాను. దిగులు పడొద్దు"

ఓదార్చింది.

అరుణ మౌనంగా వుండిపోయింది.

"పీలేర్లో దీంతోబాటు తిరిగిన ఆ కుర్రాడే మన్న మోసం చేశాడా? అసలు ఆ కుర్రాడె వడు? "మనసులోనే ప్రశ్నించుకుంది కోటమ్మ.

"అది కాదమ్మా... నేనింకెవురికి చెప్పుకో వాల... నీకే చెప్పుకుంటానే" మెల్లగా అంది అరుణ.

"చెప్పురా..." అంది కోటమ్మ

"నాలో ఇంకొగ బాధ కూడా వుండాది? "

"యేందమ్మా అదీ!"

"ఏంలేదమ్మా... ఈ ఊర్లోనే ఓ పిల్లోడూ, నేను ఒకరికొకరు మొఖుసుపడినాము. ఆయ ప్పా నేనంటే శ్యానా యిష్టపడతాడు"

'నేను అనుమానపడింది నిజమే' అనుకుని "ఎవరతను? " అని అడిగింది కోటమ్మ.

"కమ్మపల్లె స్కూల్లో టీచరు పని చేస్తా వుండాడు. పేరు ఉదయ్‌కుమార్" సిగ్గుపడు తూనే చెప్పింది అరుణ.

"మూడు దినాలముందు నీతోబాటు పీలేర్లో సినిమా చూసినాడే... ఆ పిలగోడా? " అంది మెల్లగా కోటమ్మ.

తల్లి మాట వినేసరికి ఉలిక్కిపడింది అరుణ. ఈ విషయం తన తల్లికెలా తెలుసో నని ఆశ్చర్యపోయింది.

ఆమె ఆశ్యర్యాన్ని గమనించిన కోటమ్మ "నాకు తెలుసులేమ్మా" అంటూ పీలేరు బస్టాండ్లో తను వాళ్ళను చూసిన విషయం తెలిపింది.

## గిడుగుతో ఢీ

ఆదిభట్లవారు ఏ విషయం లోనూ ఎవ్వరినీ లెక్కచేసేవారు కాదు. హరికథలు సరసంగా ఉండేందుకు శృంగారరసాన్నీ అడపాదడపా కాస్త ఎక్కువ మోతాదులోనే ప్రయోగించేవారు.

దానిపై వచ్చిన విమర్శలు వ్యవహారిక భాషోద్యమ నాయకుడు గిడుగు రామ మూర్తి పంతులుగారి దాకా పాకాయి.

ఒకసారి దాసుగారు ఎక్కడో తారసపడ డంతో 'ఏమిటి హరికథ పేర బూతులు చెబుతున్నావట? ' అంటూ ముఖంమీదే అడి గేశారు గిడుగు.

'ఆ అవసరం నాకులేదు.. కావాలంటే నీకూ కథ విన్పిస్తా వింటావా? ' తిరగబ డ్డారు దాసుగారు.

'నాకసలే బ్రహ్మాచెముడు ఏం వినపడేదు స్తుంది? 'అన్నారు గిడుగు.

'నీలాంటి బధిరులకు సైతం విన్పించేలా కథలు చెప్పగలడీదాసు..' అంటూ కంచు కంఠంతో ఓ మంచి హరికథ గిడుగువారికి విన్పించి ఆయనతో శభాష్ అన్పించుకు న్నారు దాసుగారు.



"మీరిద్దరూ ప్రేమించుకున్నారా? " తిరిగి అడిగింది.

"అవునమ్మా" చెప్పింది అరుణ.

"ఆ పిల్లోడు నిన్ను నమ్మకంగా పెండ్లి చేసు కుంటానన్నాడా? "

"అవునమ్మా"

"నీ సంగతి తెలిసి కూడా..."

"అవునమ్మా... ఊర్లో వాళ్ళకు భయపడి

గొమ్మునుండాడు. అంతే"

"సరి... కులం... మన కులమేనా?"

"కాదు!"

"మరి అతన్నెట్లా నమ్మినావు?"

"లేదమ్మా. ఆయప్ప చాలా మంచోడు"

కోటమ్మ ఒక్క క్షణం ఆలోచన్లో పడింది.

"అది కాదమ్మా... మన కులం గాదు. నువ్వొక బసివిదాని కూతురివి. ఇన్ని తెలిసీ ఆ పిల్లోడు నీ వెంటే తిరుగుతున్నాడంటే... నమ్మేదెట్లా?" ఆలోచిస్తూనే అన్నది కోటమ్మ.

"లేదమ్మా... ఆయప్పపైన నాకు నమ్మకం వుండాది" అంది అరుణ.

"సరే... ఆ విషయం నా కొదిలేయ్. నువ్వు నిశ్చింతగా పడుకో... నిద్దరపో..." కూతుర్ని పడుకోబెట్టింది.

కోటమ్మ లేచి వచ్చి దీపం ఆర్పేసి తానూ పడుకుంది.

ఆ యిల్లు చీకట్లో కలిసిపోయింది.

ఆదివారం ఇక రెండు రోజులే ఉంది. బసివిదాని గుడిసె కొత్త కప్పుతో తల స్నానం చేసిన కన్నెపిల్లలా కనిపిస్తోంది. పెచ్చులూడి పోయినచోట గోడలకు మళ్లీ మట్టితో సరిచేసి వెల్ల వేయించారు. శుభ్రం చేసి సిద్ధంగా ఉంచారు.

గుడిసె కప్పుకోసం అక్కడ నుంచి ఓబులవ్వను బయటకు తరిమేశాడు. ఆమె వాళ్లందరినీ శాపనార్థాలు పెడుతూ, భోరున ఏడుస్తూ ఊళ్ళోకి బయలుదేరింది.

ఇతర కులాల్లో యాడా లేని ఈ ఆచారాన్ని వొగడన్నా తప్పు పట్టి అడిగిండాడా? ఛీ ఛీ దరిద్రపు జనం... బుద్ధి లేని జనం... అని అదే పనిగా తిట్టుకుంది.

ఓబులవ్వను తరిమేసిన సంగతి తెలిసి కోటమ్మ ఆమెకు ఆశ్రయమిచ్చింది.

కూతురు బతుకు బలి కాకుండా తన ప్రయత్నాలు ప్రారంభించింది.

ఇంటింటికీ తిరిగింది. ప్రతి స్త్రీతోను, ప్రతి ఆడపిల్లతోను వయో భేదం లేకుండా అందరితో కలిసి మాట్లాడింది. ఈ అనాచారాన్ని ఎలాగో ఓలాగు ఆపకపోతే ఇంకా మీ బిడ్డలెందరు బసివినులుగా మార్చబడి నికృష్టంగా చావాల్నో అంటూ వాళ్ళను వేడుకుంది. యింకా ఏమేమో చెప్పింది.

గతంలో ఓబులవ్వ, ఆ తర్వాత బుడ్డమ్మలు ఎలా బలైపోయారో చెప్పింది. చివరికి తను అనుభవించిన బాధల్ని వివరించింది. కానీ వాళ్లలో ఎలాంటి చలనమూ లేదు.

అయినా కోటమ్మ పట్టు విడువలేదు. నిరాశ పడలేదు. ఆడవాళ్ళనందర్నీ ఓ చోట చేర్చింది.

అనుమానం వచ్చిన కొందరు మగవాళ్ళు "ఏమబ్బా ఆడోళ్ళ మీటింగా?" అంటూ ఆరాలు తీశారు.

కోటమ్మ వాళ్లకు చెప్పాల్సిందంతా చెప్పింది.

కానీ ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

ఇట్లాంటి సమయంలో ఆరా కోసం అక్కడి కొచ్చాడొక యువకుడు.

"ఏమ్మో, యేందడ ఆడంగుల మీటింగు. తెలుసుకోని రమ్మని నన్ను బంపినారు పెద్దోళ్ళు" అన్నాడు.

"ఏం లేదయ్యా. మరునాడు అరుణమ్మకు బసివిని జేయాలగదా. మంచీ చెడ్డా మాట్లాడుకుంటా వుండాంగానీ, యింక నువ్వు పో" అంది ఆదెమ్మ.

"సరేలే. సర్పంచి ముసలయ్య సచ్చిపోయింతర్వాత ప్రెసిడెంటయ్యినాడు ఆయన కొడుకు శంకరయ్య. ఆయనకిది తొలి కన్నెరికం... తరతరాలనించీ తన వంశానికొస్తా ఉండే కన్నెరికాలు చేసే ఆశారం ఎట్లయినా నిలుబెట్టుకోవాలని చాలా పట్టుదలగా చేస్తా ఉండాడు దీన్ని. మనమూ దీన్ని ఆయప్ప స్థాయికి తగినట్టుగా ఎంతో గౌరవంగా జేయాల. ఇది దేవుని కార్యం. అందుకని ఈ ఆడోళ్లు ఏమనుకుంటా వుండారో ఏమొ చూసి రారా అంటా పెద్దోళ్లు నన్ను పంపించినారు. కాబట్టి మీరు కూడా ఈ విషయం గుర్తు పెట్టుకోండి" అంటూ హెచ్చరించేసి అక్కడి నుంచి వెళ్ళిపోయాడతను.

ఆడవాళ్ళు ఒకరి ముఖాలొకరు చూసు కుంటూ ఉండిపోయారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

వాళ్ళ వాలకం చూసి కోటమ్మ నిరుత్సాహ పడిపోయింది.

ఆదివారం రానే వచ్చింది.

తెల్లవారేసరికి కొత్త సర్పంచి శంకరయ్య యింటి నుంచి పసుపు చీరా, పసుపు రయికా వచ్చేశాయి.

ఆ రాత్రికే అరుణమ్మను బసివిని చేయాల.

కోటమ్మ నిస్సహాయంగా ఉండిపోయింది. అయినా తన ప్రయత్నం మాత్రం మానుకోలేదు.

"ఆదెమ్మా! బిడ్డెను రెడీ సేయండి. నీ కూతురికి సెప్పు. అదే గదా అంతా సెయ్యాల" అంటూ ఊరి పెద్దలు హెచ్చరించి వెళ్ళిపో యారు.

చుట్టు పక్కల బసివి నులు ఒకరొకరే ఊర్లోకి రాసాగారు.

ఆ రోజు సాయంత్రం ఆరు గంటలకంతా ఆడ వాళ్ళు ఆదెమ్మ ఇంటికి వచ్చేశారు.

అరుణమ్మకు స్నానం చేయించి పసుపు బట్టలు కట్టారు. బాసికం కట్టారు. పెళ్ళి కూతురిలా నలుగులు పెట్టి అలంకరించారు. బుగ్గన దిష్టి చుక్క దిద్దారు. పెళ్ళి కళతో మెరిసిపోతున్న అరుణమ్మ అంద చందాలకు అందరూ ముగ్ధులవుతున్నారు.

కోటమ్మ "నా బంగారు తల్లీ" అంటూ అక్కున చేర్చుకొని శిరస్సు ముద్దాడి వలవలా ఏడ్చింది.

డప్పులు మోగుతున్నాయి. కొమ్ములు ఉరు ముతున్నాయి.

"అబ్బా, నిజ్జంగా బసివిదంటే కోటమ్మేరా. స్వయంగా కూతుర్ని సాంప్రదాయం చెడ కుండా బసివిని చేస్తావుండాది చూడు"

"అంతేగదా. మాతమ్మ కూతురు ఎప్పటిక యినా మాతమ్మే గదా"

"అది తెలిసేనేమో! అన్నీ ముందుండి చేస్తా ఉండాది"

"అవునబ్బా. ఇది దైవ కార్యం. పవిత్రంగా, భక్తిగా చేయాల గదా"

"దేవత పేరుతో బిడ్డె నొదలడం ఎంతో గౌరవం గదా! ఆ బిడ్డె దేవతతో సమానం గదా"

రకరకాలుగా అనుకుంటున్నారు పల్లె వాళ్ళు.

కూతురి మెడలో వణుకుతున్న చేతులతో పెద్ద పూల మాల వేసింది కోటమ్మ.

మెరవణి బయలుదేరింది.

మామూలుగా అయితే దక్షిణంగా అయితమ్మ గుడికి వెళ్ళాలి ఊరేగింపు. కానీ ఉత్తరం వైపుకు బయలుదేరింది.

అరచేతిలో కొబ్బరి బొండంతో, నడుముకు వడిబాల మూటతో ముందు అరుణమ్మ, ఆమె వెనుక కోటమ్మ, ఆదెమ్మ, వాళ్ల వెనుక బసివి నులు, వాళ్ళ వెనుక పల్లె ఆడం గులు... పెళ్ళి నడక నడుస్తున్నారు.

రొంపిచెర్ల నుంచీ వచ్చిన కోటమ్మ చెల్లెలు, తమ్ముడు సుబ్బయ్య భార్య కూడా ఆ గుంపులో చేరిపోయి వాళ్ళతోటే నడుస్తు న్నారు.

'యేందమ్మా? అట్ల తీసకపోతా ఉండారు? "

వృద్ధుడై పోయి ఉన్న కుల పెద్ద ఉత్తన్న అడిగాడు.

"ఊరి ముందర... రాములోరి గుడికి పొయ్యి, స్వామికి మొక్కోని, ఆనైన అయి తమ్మ గుడికాడి కొస్తార్లేన్నా..." అంది ఆదెమ్మ.

"పెండ్లి కాబోయే వధూవరులు గానీ, పెండ్లయిన కొత్త దంపతులు గానీ రాము లోరి గుడికి పోతారు. కానీ బసివిని కాబోయే

ఆడవాళ్ళు ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ ఉండిపోయారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. వాళ్ళ వాలకం చూసి కోటమ్మ నిరుత్సాహ పడిపోయింది. ఆదివారం రానే వచ్చింది

## నెప్పి లేకుండా...



ఆస్పత్రి పేరు చెబితే చాలు... ఎక్కువ మంది పిల్లలు, కొంత మంది పెద్దలు ముఖ్యంగా భయపడేది ఇంజక్షన్ల గురించే. డాక్టర్లు ఏవో మాటలు చెప్పి ఇంజక్షన్ చేసే చోట స్పిరిట్ లేదా లిడోకెయిన్ వంటి చర్మం మొద్దుబ రచే ద్రవాలు పూసి, ఇంజక్షన్లు చేస్తుంటారు. ఆ ద్రవాలు మత్తు కల్గించడానికి ఎక్కువ సమయం తీసుకుంటాయి. అంత సహనం, సమయం లేక వైద్యులు, వెంటనే సూదులు గుచ్చటంతో. నెప్పి అధికంగా ఉంటుంది.

ఇప్పుడు కొత్తగా ఈ సూదుల బాధ తెలీకుండా. ఉండేందుకు 'సోనోప్రెప్' అను పరిక రాన్ని మార్కెట్లోకి ప్రవేశపెట్టారు. ఈ పరికరంతో ఇంజక్షను చెయ్యదలిచిన ప్రదేశంలో ఉంచి, బటన్ నొక్కాగానే అది అల్ట్రా శబ్ద తరంగాలను చర్మంలోకి పంపుతుంది. తర్వాత అక్కడ లిడొకెయిన్ రాయగానే చర్మం దాన్ని వెంటనే పీల్చుకుని, ఆ ప్రదేశం మొద్దుబడటా నికి మార్గం సుగమం చేస్తుంది. "సోనోపెప్ వలన పిల్లలకు ఇంజక్షన్ చెయ్యటం చాలా సులభమయ్యింది" అంటున్నారు అమెరికన్ అనెస్థీషియాలజిస్టు డాక్టర్ జాన్ ఎబెన్‌స్టెయిన్.

త్వరలో భారతదేశపు మార్కెట్లోకి రాబోతోంది సోనోపెప్. ఇహ పిల్లలు ఇంజక్షన్లంటే భయపడకుండా చేయించుకునే రోజు దగ్గర్లోనే ఉంది మరి.

ఆడది పోరాదు"

అన్నాడు వణుకుతున్న కంఠంతో ఉత్తన్న.

"అయినా మన పల్లోళ్లను, ఊర్లో గుడిలోకి రానియ్యరు గదా!"

"బయటినించీ మొక్కోనొచ్చేస్తార్లే" అంది ఆదెమ్మ.

"అయితే సరే. బీరీనా రండి" తొందరించాడు ఉత్తన్న.

సరేనంది ఆదెమ్మ.

అందరూ రాములవారి గుడి దగ్గరకు నడిచారు.

ఊర్లోవాళ్ళు వింతగా చూస్తున్నారు.

అంతవరకూ తను కట్టుకొని ఉన్న తెల్ల లుంగీని సర్దుకుంటూ, జంధ్యాన్ని సవరించు కుంటూ కూర్చోనున్న చిన్న పంతులు సూర్య ప్రకాష్ వాళ్లను చూసి చిరునవ్వులు చిందిస్తూ గర్భగుడిలోనించి బయటికొచ్చాడు.

వీళ్లని చూడగానే "రండి. రండి" అంటూ ఆహ్వానిస్తూ తిరిగి గర్భగుడిలోకి వెళ్ళి మంత్రాలు చదవసాగాడు.

గర్భగుడి ముందరున్న మంటపంలో వేలాడుతున్న గంటను తాకి ఠంగుమనిపించింది కోటమ్మ.

ఆ శబ్దానికీ, వాద్యాల హోరుకీ గుడి పైనున్న పక్షుల గుంపు కీచు కీచుమని శబ్దం చేస్తూ లేచి వెళ్ళిపోయాయి ఎటో...

అదే సమయంలో గుడి వెనుకనుంచీ బాణంలా దూసుకువచ్చాడు ఉదయకుమార్.

అతను కొత్త పట్టు బట్టలతో, మెడలో పూల మాలతో, నొసటన బాసికంతో కొత్త పెళ్ళి కొడుకులా తయారై ఉన్నాడు.

అతని చేతిలో తాళిబొట్టు మిలమిలా మెరిసిపోతోంది. తన పథకం ఫలిస్తున్నందుకు కోటమ్మ లోలోపలే సంతోషిస్తోంది. కళ్ళ నీళ్ళతో కృతజ్ఞతగా చేతులు జోడించింది కోటమ్మ...

కళ్లతోనే వారించాడు ఉదయకుమార్.

మంటపంలో గంట మరోసారి ఠంగు మంది.

సూర్యప్రకాష్ అంతవరకూ వల్లిస్తున్న పూజా మంత్రాలు ఆపి పెళ్ళి మంత్రాలు చదవడం ప్రారంభించాడు.

"మాంగల్యం తంతు..." వేగంగా చదవసాగాడు. అంతే... అందరూ చూస్తూండగానే ఉదయకుమార్ అరుణమ్మ మెడలో తాళి కట్టేశాడు.

అంతవరకూ మోగుతున్న వాద్యాల హోరు ఉన్నట్టుండి ఆగిపోయింది. ఆడవాళ్ళు వింతగా గుసగుసలు పోసాగారు. ముక్కుల మీద వేళ్ళేసుకున్నారు.

ఈ విషయం తెలిసి ఊళ్లో మగాళ్ళు పరిగెత్తుకొచ్చారు. జరగరానిదేదో జరిగిపోయిందని పల్లెవాళ్లు పరుగున వచ్చారు.

"ఇదంతా ప్రీ ప్లాన్" ఎవడో గుంపులో నుంచి అరిచాడు.

"ఈ ఆడోళ్లంతా ముందే మాట్లాడుకున్నిట్టుండాది"

"మనల్ని యామార్చేదానికే ఈ గుడికొచ్చినట్టుండారు"

ఎవరికి తోచిన విధంగా వాళ్లంటున్నారు.

ఈ విషయం తెలుసుకుని ఆఘమేఘాల మీద అక్కడికి వచ్చేశాడు సర్పంచ్ శంకరయ్య.

"దీనికంతా కారణం పాత బసివి కోటమ్మంటనే. ఎవరదీ? " గట్టిగా అరిచాడు అక్కడున్న ఆడవాళ్ళ వైపు చూస్తూ.

"నేనే" అంటూ ఒక్కడుగు ముందుకేసింది కోటమ్మ.

అందరూ భయం భయంగా చూస్తున్నారు.

గుడిలో రాముడూ చిద్విలాసంగా చూస్తున్నాడు.

సీతా లక్ష్మణులూ చూస్తూనే ఉన్నారు.

"ఓహో. నువ్వా! యేందిదంతా? " ప్రశ్నించాడు.

"ఏం. తెలీదా? ఇది పెండ్లి. నా కూతురికీ, టీచరు ఉదయకుమార్‌తో పెండ్లయిపోయింది" అంది కోటమ్మ.

"మీ ఊరి మాతమ్మలకు కన్నెరికం జేసే ఆచారం మా తాతల, ముత్తాతల కాలం నుంచీ హక్కుగా వస్తా వుండాది. దాన్నిప్పుడు నాసినం జేస్తివే" ఆవేశంగా అన్నాడు శంకరయ్య.

"ఈ ఆచారం అనాచారం. యిది పొయ్యినా ఫరవాలేదు" ధైర్యంగా అంది కోటమ్మ.

"అదెట్లా? మీ పల్లె ఆడ బిడ్డలకు ముద్ర రేసి మాతమ్మల జేసే ఆచారం మీదయితే, వాళ్ళకు కన్నెరికం జేసేది మా వంశాచారం. దాన్ని కాదనేదెట్లా? "

"కాదనకపోతే కాట్లోకి పో... నీ వంశాచారంతో మాకేం పనీ? " తల బిరుసుగా అంది కోటమ్మ.

"ఆచారం భ్రష్టు పట్టిస్తివే. యింక అమ్మోరికి కోపం రాదా" అన్నాడు కుల పెద్ద ఉత్తన్న.

"అమ్మోరికి గనక కోపం వస్తే పల్లేం గావాల... ఊరేం గావాల? " అన్నాడొకతను.

"ఏదూమో తగిలి ఊరు ఊరే ఊడ్చకపోదా యెట్లా? " మరో చింపిరి జుట్టతనన్నాడు.

"యేమీ గాదులేరా..." అంది ఆదెమ్మ.

"నేను కన్నెరికం జేయబోయే పిల్లందెచ్చి పెండ్లి జేస్తారా? మీ అంతు జూస్తాను" ఎగిరెగిరి పడ్డాడు శంకరయ్య.

"ఏమీ. నువ్వు కన్నెరికం జేస్తావా? ఎవురికి జేస్తావురా వెధవా"

కోపంగా ప్రశ్నించింది కోటమ్మ.

"నీ కూతురికే" నిర్లక్ష్యంగా అన్నాడు శంకరయ్య.

"చెల్లెలికి కన్నెరికం జేసే అన్నలు ఏ దేశంలోనూ ఉండరు. ఇది నీ చెల్లెలు. తెలుసా? " నింపాదిగా చెప్పింది.

"నీకు పుట్టింది నాకు చెల్లెలెట్లా అవుతాది? "

"ఎట్లవుతుందా? మీ నాయన నేను లొంగ

లేదని, నన్ను బలవంతంగా మాతమ్మగా మార్చి కన్నెరికం జేస్తే ఇద్దో ఈ బిడ్డె పుట్టిం ది" అరుణ వైపు చేయి చూపిస్తూ అంది.

"మా నాయన నీకు కన్నెరికం చేసుండచ్చు కానీ అది మా నాయనకే పుట్టిందనే గ్యారంటీ ఏమీ లేదు. ఎందుకంటే బసివిని ఊరికంతా ఉమ్మడి యాభాశారి"

"తుపుc... ఆపరా తప్పుడు నాయాల. నేను బసివినే గావచ్చు కాదన్లే. కానీ నేనె ప్పుడూ ఈ ఊరికి ఉమ్మడి యాభిసారిని కాలే దురా. మీ నాయనొగన్తోనో గడిపినే. దీన్ని కన్నా, ఈ విషయం ఈ ఊర్లో ఎవర్నడిగినా చెప్తారు. అడుగురా..."

కళ్లెర్రజేసి, సవాలు చేసింది కోటమ్మ.

ఆవేళ ఆమె నోటి ధాటికి ఎవ్వరూ ఆగలే కపోయారు.

శంకరయ్యకు చాలా అవమానం అనిపిం చింది.

"హేయ్! బసివిదానా. నీ అంతు చూస్తా" అంటూ ఒక్కడుగు ముందుకేశాడు శంక రయ్య.

"హేయ్! మా బిడ్డల్ని బసివిన్లుగా మార్చే కొడుకుల్లారా. మేమూ మీ అంతు చూస్తా మురా" అదే స్థాయిలో ఆదెమ్మా అరిచింది.

ఆడవాళ్ళు మౌనంగా చూస్తున్నారు.

"ఆహాc... అంటరాని దానివి. నువ్వే నా అంతు చూస్తావా. సరే. యిప్పుడు దీని మెడలో తాళి తెంపేసి, దీన్ని అయితమ్మ గుడికి ఈడ్చుకపొయ్యి మాతమ్మగా మారు స్తా... ఎవరడ్డొస్తారో చూస్తా" యింకో అడుగు ముందుకేశాడు.

"రేయ్"... అంటూ ఆవేశంగా ముందుకొ చ్చాడు ఉదయభాస్కర్.

"అగ్గ కులస్థుడివైయుండీ వొగ అంటరాని దాని మెడలో తాళి కడతావా. తుc... నువ్వూ వొగ మగాడివేనా?" అతని మొగాన ఎంగిలి ఉమ్మేసి మరీ అన్నాడు శంకరయ్య.

"హారేయ్...నిన్ను...." అంటూ ముందుకు దూకాడు ఉదయకుమార్.

అతని చెంపను బట్టి ఒకటిచ్చి "హారే. మల్లప్పా, వీన్ని పక్కకు ఈడ్చక పోంద్రా" అన్నాడు శంకరయ్య.

ఆ మాటతో మల్లప్పా, మరో వ్యక్తి వచ్చి అతను అరుస్తున్నా పక్కకు లాక్కెళ్లారు.

"అమ్మా, ఈ రోజు దీనికయింది. రేపెంద రికో ఆ ముద్దరేసే దుర్గతి పడుతుంది. దీన్ని మొగోళ్లెవరూ ఆపరు. ఇది మన సమస్య. మన ఆడ బిడ్డల సమస్య. ప్రతి ఆడదాని సమస్య. రండి. ముందుకు రండి. అలా రాక పోతే మీరు మనుషులే కాదు. ఈ దురాచా రాన్ని ఆపండి" రోదిస్తూ అంది కోటమ్మ.

"మీ ఊరి ఆడవాళ్ళంతా లం... ఎవరొ స్తారే అడ్డు" నోటికొచ్చినట్టు మాట్లాడాడు శంకరయ్య.

అయినా మౌనంగానే ఉన్నారు ఆడవాళ్లు.

"అమ్మా తల్లీ. ఎందుకమ్మా మీ బతుకులు. ఏ చలనం లేకుండా, ఏ చైతన్యమూ లేకుండా అడవిలో మానుల్లాగా, నికృష్టంగా ఎందుకు బతుకుతారు. తిరగబడండి. మనం తిరగబ డితే పోయేదేం లేదు. మన బాధలు తప్ప"

"మనందరం ఒక్కటైతే ఈ శంకరయ్య లాంటి దగుల్బాజీలేమీ చెయ్యలేరు. నా మాట వినండి. రండి. కదలండి. ఈ దురా చారాన్ని మట్టు బెట్టండి" ఏడుస్తూ నేలపైన కూలబడింది కోటమ్మ.

అరుణమ్మ అయోమయంగా చూడసా గింది.

"వంటిదానివి. అందునా బసివిదానివి. నువ్వేం చేయగలవే? " అంటూ మరో అడుగు ముందుకేసి అరుణమ్మ మెడలోని తాళిని పట్టుకోబోయాడు.

అంతే! తన శక్తినంతా కూడదీసుకుని ఒక్కటి చ్చింది



అరుణమ్మ.

శంకరయ్య చెంప చెళ్లుమంది. గూబ గుయిమంది. అతని కళ్ళు బైర్లు కమ్మాయి.

అదే దెబ్బ!

ఒకప్పుడు... కోటమ్మ ముసలయ్యను కొట్టిన దెబ్బ! అలివేలు మూర్ఖత్వం పైన పడిన దెబ్బ!

పురుషాధిక్యాన్ని చెళ్లుమనిపించిన దెబ్బ!

కూలబడిన కోటమ్మ పైకి లేచింది.

చప్పట్లు చరుస్తూ పైకి లేచింది.

"శహభాష్ బిడ్డా! చేవ చచ్చిన ఈ ఊరి ఆడోళ్ళకంటే, ఈనం పానం లేని ఈ పల్లె స్త్రీలకంటే, సిగ్గూ సెరమూ లేని ఈ బాశాళ్ల కంటే... మూలుగ చచ్చిన ఈళ్లకంటే... ఈ జనం కంటే నువ్వు వెయ్యి రెట్లు గొప్పదానివి. నా బిడ్డనిపించుకున్నావ్" అంటూ మెచ్చుకోలుగా అంది కోటమ్మ.

యింకా రెచ్చిపోయాడు శంకరయ్య.

"హాసే! నన్నే కొడతావా! నీ అంతు చూస్తాను" అంటూ ఆమె గొంతు పట్టుకోభోయాడు.

అంతే!

"రేయ్!"

భూమి గర్జించినట్లు!

వంద ఉరుములు ఉరిమినట్లు!

వందల గొంతులు ఒకేసారి!

"రేయ్!"

"మా బిడ్డెను, తాకేదానికి నీకేమధికారం వుందిరా? " ఓ ఆడదాని గొంతు గర్జించింది.

"ఎవర్రా మమ్మల్ని బసివిని చెయ్యమని శాసించి న్నాయాలు" మరో స్త్రీ గొంతు ఖంగుమంది.

"మారేదగా పో... వెళ్ళిపో... యింకోసారి ఈ ఆచారాన్ని నిలబెట్టాలని చూశావా



జాగర్త!"

ఆ గుంపులోని మరో కంఠం బొబ్బరించింది.

"యింకెప్పుడూ మా పల్లె ఆడోళ్ళ జోలికి రావద్దు"

"ఆచారం, కన్నెరికం అంటా కలవరించొద్దు. అట్ల కలవరించినారా కాళ్ళు తీసేస్తాం"

"నిలవునా నరికేస్తాం"

జనసముద్రం ఘోషించింది. ఒక్కసారిగా ముందుకు కదిలింది. అతని చుట్టూ కోట!

మానవ శరీరాల కోట!

మహిళల కోట!

ఆ కోటలో చిక్కి ఉక్కిరి బిక్కిరైపోయిన శంకరయ్య...తోక ముడిచాడు. ప్రాణభయంతో అందర్నీ తోసుకుంటూ పరిగెత్తాడు. కోటమ్మ సంతోషంగా చూస్తూ ఉండిపోయింది.

మల్లప్పను, అతని మిత్రుణ్ణి కాళ్లతో తన్ని పెనుగులాడీ వాళ్ళ పట్టునుంచి తప్పించుకుని పరుగెత్తుకొచ్చి "అరుణా" అంటూ నిలబడ్డాడు ఉదయ్‌కుమార్.

గుడిలో గంట మరోసారి మోగింది.

ఉన్నట్టుండి వాద్యాలు మిన్నుముట్టాయి.

సూర్యప్రకాష్ తిరిగి మంత్రాలు ప్రారంభించి హారతి తీసుకొచ్చాడు.

22

"పెదనాయనా! అయితమ్మ గుడిని ఎవురో తోసేసి ముక్కలు ముక్కలు చేసేసినారు. శిలలు గూడా యాడనో యేసేసినారు. సిగర సెట్టును మొదుటికి నరికేసినారు. దాన్ని కూడా ముక్కలు ముక్కలుగా నరికేసి తుండ్లు తుండ్లు జేసేసినారు"

ఓ పల్లె యువకుడు పరిగెత్తుకుంటూ వచ్చి ఆయాస పడిపోతూ చెప్పాడు.

"నిజమా" అన్నాడు ఉత్తన్న.

"అవును పెద్దయ్యా! ఆడోళ్లొచ్చే లోపల నువ్వు సెప్పినట్లే గుడిలో దీపం పెడదామని పోయినా. సూస్తే, అట్లయిపోయిండాది"

కాస్తా తెపరాయించుకుంటూ చెప్పాడు.

అంతలో ఊరికి చివర మంటలు లేచాయి.

"అయ్యో! ఊరంటుకునింది. ఒరేయ్. పదండ్రా" అంటూ అరిచారెవరో...

అందరూ అలా చూశారు.

చివర వున్న బసివి గుడిసెకెవరో అగ్గి పెట్టేశారు.

అది ధగధగా మండుతోంది.

చిటపట శబ్దాలు చేస్తూ మండిపోతోంది.

ఆ మంటల్లో అది కాలి బూడిదవుతోంది.

అందరూ అటువైపుకు పరిగెత్తారు.

గుడిలో అరుణమ్మ, కోటమ్మ, ఉదయకుమార్, సూర్యప్రకాష్ మరికొందరు ఆడవాళ్ళు మాత్రమే మిగిలినారు. అదే సమయంలో...

"కోటా! బాగుండావా? " అన్న పిలుపు వినిపించింది. తిరిగి చూసింది కోటమ్మ.

ఎదురుగా... కిష్టయ్య...

సగం నెరిసిన జుట్టుతో నవ్వుతూ నిలబడి వున్నాడు.

అదే సిగ్గు... అదే బిడియం... ఇరవై ఏండ్లప్పటిలాగానే... మెలికలు తిరిగిపోతూ... అతని చేతిలో గొడ్డలి వుంది. అతని శరీరమంతా మసి అంటుకొని వుంది.

గుర్తుపట్టింది కోటమ్మ.

"కిష్టయ్యా. ఏందిది? ఏం జరిగింది? " ఆతృతగా అడిగింది.

"నువ్వు ఇరవయ్యేండ్ల తర్వాత ఈ ఊరికొచ్చి, ఈ పల్లెకెంతో మేలు చేస్తివి. మరి నీ కోసరం నేనూ వొగ మంచి పని చేసినా" ముసిముసిగా నవ్వుతూ అన్నాడు.

"ఏం పనీ...? "

"అదే... మనూరి ఆడబిడ్డల్ని యాడయితే దేవతకిచ్చి పెండ్లిచేసి ముద్దరేస్తారో ఆడ... ఆ దేవత పేరుతో అయితే బసివిని జేసి వదిలేస్తారో ఆడ... ఆ దేవతను లేపేసొచ్చినా... దాని సిగరసెట్టును ఈ గొడ్డలితోనే నిలవునా నరికేసి, తుండ్లు తుండ్లుగా జేసేసి వచ్చినా" అన్నాడు.

అతని మాటల్లో ఏ ఆవేశమూ లేదు. ఏ ఆందోళనా లేదు. అతని చూపుల్లో ఏ

వికారమూ లేదు.

ఆవేళ కిష్టయ్య ఈ ప్రపంచాన్ని, భవబంధాల్ని జయించిన ఒక మహాఋషిలా అనిపించాడు.

సంతోషంతో పొంగిపోయింది కోటమ్మ.

తను ఆ ఊరు వదిలేసిపోయేరోజు, ముసలయ్య బారినుంచి కాపాడి సాయం చేసిన సంఘటన గుర్తుకు వచ్చి ఆమె మనసు కృతజ్ఞతతో నిండిపోయింది.

"మరి మడిసేంది మసిగొట్టుకోనున్నావు?" అన్నాడు సూర్యప్రకాష్ హారతి పళ్ళెం లోపలి పెట్టి వస్తూ...

"బసివినిజేసి ముక్కు పచ్చలారని ఆడబిడ్డల్ని కన్నెరికం పేరుతో మొగోళ్ళు పీల్చి పిప్పి చేసేది ఆ బసివిదాని గుడిసెలోనే గదా. అందుకని ఆ గుడిసెకు అగ్గి పెట్టేసినా. అది పూర్తిగా అంటుకునేదాకా ఎగదోసొచ్చిన... అదే ఈ మసి" నిశ్చలంగా నిలబడి అన్నాడు కిష్టయ్య.

"గొప్పపని చేశావు కిష్టయ్యా..." మెచ్చుకోలుగా అన్నాడు చిన్నపంతులు సూర్యప్రకాష్.

ఉదయకుమార్. అరుణ మౌనంగా నిలబడి చూస్తున్నారు.

"కిష్టయ్యా" అంటూ దగ్గరికి వెళ్ళింది కోటమ్మ.

"నిన్ను ఆరోజు ట్రైనెక్కించిన మరునాటినించే ఆ ముసలయ్యింట్లో పనిమానుకున్నా... ఆ నా కొడుకు సచ్చినబ్బుడు చూడను గూడా పోలే' కసిగా అన్నాడు కిష్టయ్య.

కోటమ్మ నవ్వుతూ అతనివైపు చూడసాగింది.

"కోటా... నేనింతవరకూ పెండ్లి గూడా చేసుకోలా..." అన్నాడు కిష్టయ్య.

"ఎందుకని?" అడిగింది కోటమ్మ.

"నువ్వు ఊరొదిలి పోయింతర్వాత నాకు జీవితంపైనే విరక్తి పుట్టింది. నేను మనసుపడిన నువ్వు ఇట్లయిపోవడానికి కారణమైన ఆ గుడిని కూలగొట్టి, ఆ గుడిసెను కాల్చేసినంత వరకూ నాకు మనశ్శాంతి కలగలేదు. ఇప్పుడు నాకు శ్యానా సంతోషంగా వుండాది" అన్నాడతను.

అరుణమ్మ, ఉదయకుమార్ ఆశ్చర్యంగా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"గుడులు కూల్చేసినంత మాత్రాన, గుడిసెలు కాల్చేసినంత మాత్రాన ఏం ప్రయోజనం. పంచాంగాలు కాల్చేసినంత మాత్రాన నక్షత్రాలు, గతులు మారిపోతాయా? హిందువుగా పుట్టాను. ముస్లిముగా మారాను. ఏ మతమైతేనేం. యెక్కడా ఆడోళ్ళకు మరేదా, విలువ లేనేలేవు" ఓ ప్రవక్తలా చెప్పింది కోటమ్మ.

"అవును కోటమ్మా. నువ్వు చెప్పింది కూడా నిజమే" అన్నాడు కిష్టయ్య.

ఇక ఆగలేకపోయింది కోటమ్మ. అమాంతం వెళ్ళి అతన్ని వాటేసుకుంది.

ఈ హఠాత్సంఘటనకు కిష్టయ్య ఉక్కిరిబిక్కిరైపోయాడు...

సూర్యప్రకాష్ హారతి తేవడానికి మళ్ళీ గర్భగుడిలోకి వెళ్ళాడు. కొంతసేపు మంత్రాలు చదివి వెలుగుతున్న హారతితో వెలుపలికొచ్చాడు. కానీ అక్కడ ఎవరూ లేకపోవడంతో నివ్వెరపోయాడు...

అంతవరకూ అక్కడున్న గుంపు... గుడి ప్రాంగణం దాటుకొని వీధిలోకి వెళుతూ కనిపించారు.

వాళ్ళనీ, వెలుగుతున్న హారతిని మార్చి మార్చి చూశాడు. ఆవేళ హారతి వెలవెలపోయినట్టనిపించి అలాగే నిలబడిపోయాడతను. ✦



# గుడ్డివాడు

ఎన్నికల పోలింగ్ ముమ్మరంగా సాగుతోంది. ఓటర్లు నిప్పులు చెరిగే ఎండను కూడా భరిస్తూ బారులు తీరి నుంచుని ఓట్లు వేస్తున్నారు.

పోలింగ్ ఆఫీసర్ ముకుందరావు పోలింగ్ బూతులో సక్రమంగా జరిగేట్లు చూడటంలో తలమునకలవుతున్నాడు. అతని అదృష్టం కొద్దీ ఛాలెంజ్డ్ ఓట్లు గాని, టెండర్డ్ ఓట్లుగాని ఇంతవరకూ రాలేదు. స్వాతంత్ర్యం వచ్చి ఏభై తొమ్మిది సంవత్సరాలు గతించినా ఇంకా ఓటింగ్ విధానం తెలీని అమాయక జనాన్ని చూసి అతడు లోలోన నవ్వుకొంటున్నాడు. బ్యాలట్ పై గుర్తులమీద కాకుండా తిరగేసి గుద్దేవాడొకడు! బేలట్ మీద కాకుండా అక్కడున్న స్టూల్ పై గుద్దేవాడొకడు!



బూత్‌కు కట్టిన దుప్పటిమీద బొమ్మల కోసం వెదుక్కునే వాడొకడు! బ్యాలట్ బాక్స్‌లో వేయకుండా జేబులో పెట్టుకు పోయేవాడొకడు.

అప్పుడే లోపలకి అడుగుపెట్టాడో గుడ్డి ఓటరు కర్రతో తడుముకుంటూ. అతను ఓటరే అని నిర్ధారించుకున్నాక అతని చేత వేలిముద్ర వేయించుకొని బ్యాలట్ పత్రం ఇచ్చారు పోలింగ్ సిబ్బంది.

"తాతా! నీకు కళ్ళు కనపడవా?" అడిగాడు ముకుందరావు.

"కనపడవు బాబయ్యా" చెప్పాడతను.

"మరి... ఓటు వేయడానికి నీ తరపున ఎవర్నీ తీసుకురాలేదా?"

"లేదు బాబయ్యా. నేను చెప్తాను. మీరే ఏసెయ్యండి"

"సరే. నడువ్" అని అతన్ని తీసుకొని పోలింగ్ బూత్‌లోకి వెళ్ళాడు ముకుందరావు. ఆ ఓటరు ఫలానా అతనికి ఫలానా గుర్తుపై వేయమని చెప్పాడు. అప్పుడే ముకుందరావు బుర్ర పాదరసంలా పనిచేసింది. తనకు దగ్గర బంధువు ఒకాయన ఆ ఎన్నికల్లో పోటీ చేస్తున్నాడు. మనసులో అతనికి తన చేతనైన సాయం చేద్దామని ఉంది. ఇప్పుడా అవకాశం వచ్చింది. ఈ ఒక్క ఓటయినా అతనికి సాయం చేద్దాం అనుకున్నాడు ముకుందరావు. ఈ గుడ్డివాడు చెప్పిన గుర్తుకు వేయకుండా తను అభిమానించే తన బంధువు గుర్తుకు వేస్తే ఈ గుడ్డివాడు చూడొచ్చాడా? అనుకొని అతడు చెప్పిన అభ్యర్థికి కాకుండా తనకు కావలసిన అభ్యర్థికి ఓటువేసి, బ్యాలెట్ బాక్స్‌లో వేశాడు ముకుందరావు. తన అభ్యర్థికి ఆ విధంగా సహాయపడగలిగినందుకు ఆనందించాడు.

అరగంట గడిచింది. బయట పెద్ద కోలాహలం వినిపించింది.

"ఎవడా ఆఫీసరు? రమ్మనండి బయటకి. వాడంతు చూడాలి" ఆవేశంతో ఊగిపోతున్నారు జనం.

ముకుందరావు ఒళ్లంతా చెమటలు. నూటనాలుగు డిగ్రీల జ్వరం వచ్చినట్లయింది. ఓ పెద్ద మనిషి కల్పించుకొని "ఆగండయ్యా ఆగండి అసలేం జరిగిందో చెప్పండి" అడి అడిగితే వాళ్లు అన్నారు. "ఈ ఆఫీసరును పరీచ్ఛ చేద్దామనే మావోడొకడు గుడ్డోడిలా నటిత్తూ ఓటెయ్యడానికెళ్లాడు. ఆడు నిజంగా గుడ్డోడ




నుకున్నాడీ ఆఫీసరు. మావోడు చెప్పిన గుర్తుమీద కాకుండా ఇంకో గుర్తుమీద ముద్ర గుద్దాడంట ఈ ఆఫీసరు. బయటకు రమ్మనండి వాణ్ణి. తోలు వలిచేత్తాం" జనం ఆవేశంతో ఊగిపోతూ పోలింగ్ స్టేషనలోకి తోసుకురాబోయారు. ముకుందరావు బయటకు వచ్చి అందరికీ నమస్కరించి క్షమాపణలు చెప్పి సిగ్గుతో తల వంచుకున్నాడు.

'ఆ ఓటరు గుడ్డివాడు కాదు. అజ్ఞానంతో కళ్లు మూసుకుపోయిన తను గుడ్డివాడు. ఇంకెప్పుడూ అలా ప్రవర్తించకుండా తన కళ్లు తెరిపించాడు' అనుకుని మనసులో లెంపలు వేసుకుని డ్యూటీని సక్రమంగా చేసుకున్నాడు ముకుందరావు.

-ఎస్.ఎన్.మూర్తి గుబ్బల ✦



కందిమళ్ల ప్రతాప రెడ్డి

అణచివేతపై ఎక్కుపెట్టిన 'బందూక్'

# కన్నీటికి విలువెంత?

**తెలంగాణా సాయుధ పోరాటంలో బాల గెరిల్లాగా... కొరియర్‌గా ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవం కందిమళ్ల ప్రతాపరెడ్డి సొంతం. తన జ్ఞాపకాలను, అనుభవాలను కలబోసి ఆయన చిత్రించిన నవల 'బందూక్'! నవల చదవగానే ఎవరికైనా హృదయం చలిస్తుంది. నిజాం పాలనలో ఇక్కడి ప్రజలు అనుభవించిన హింసలు, అణిచివేత, దౌర్జన్యాలు చదువుతుంటే ఆశ్చర్యం కలుగుతుంది. మనిషి తోటిమనిషి పట్ల ఇంత దుర్మార్గంగా ఎలా ప్రవర్తించగలిగాడా అనే ప్రశ్న తలెత్తుతుంది. 'బందూక్' కథ వెనుక కథ రచయిత మాటల్లోనే విందాం.**

## కథ వెనుక కథ

'భారత జాతీయోద్యమంలో భాగంగానే హైదరాబాద్ సంస్థానంలో జరిగిన ప్రజోద్యమం తెలంగాణా సాయుధ పోరాటం. భూమికోసం, భుక్తికోసం, విముక్తి కోసం సంస్థాన ప్రజలు సాగించిన మహోద్యమమిది. నిజాం రాజరిక వ్యవస్థపై తిరుగుబాటు, భూస్వామ్య పీడనపై ప్రతిఘటన, వెట్టి చాకిరీ నిర్మూలన, అత్యధికప్రజల మాతృభాష 'తెలుగు' పరిరక్షణ లక్ష్యాలతో సాగిన ఉద్యమమిది. నాలుగున్నరవేల మంది యోధులు అమరులయ్యారు. ఎందరో నిర్బంధాలను, నిషేధాలను, అరణ్య, అజ్ఞాతవాసాలను అనుభవించారు. అయినా మొక్కవోని ధైర్యంతో సగటు గ్రామీణ ప్రజలు సాహసోపేత కార్యాలు చేశారు. మట్టిమనుషులు మహాకవులుగా, కళాకారులుగా రూపొందారు. సామాన్యులు మాన్యులుగా, మహానాయకులుగా ఎదిగారు.

తెలంగాణా సాయుధ పోరాటానికి దారితీసిన సంస్థాన ప్రజల సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక స్థితిగతులు, అమానుషమైన వెట్టిచాకిరీ, భూస్వాముల దౌర్జన్యాలను చిత్రిస్తూ ఎంతో సాహిత్యం వెలువడింది. పోరాటకాలంలోనూ.. ఆ తర్వాత కూడా కథలు, కవిత్వం, పాటలు, నవలలు, నాటకాలు ఎన్నో వచ్చాయి. ఇంకా వస్తున్నాయి. వీటిలో వట్టికోట ఆళ్వార్ స్వామి, లక్ష్మీకాంత మోహన్, బొల్లిముంత శివరామకృష్ణ, మహీధర రామ్మోహన్‌రావు, దాశరథి రంగాచార్య తదితరుల నవలలు చిరస్మరణీయాలు. నాకు తెలిసిన సంఘటనలూ.. నా అనుభవాలూ.. నేను చూసిన సంఘటనలతో ఏదైనా రాస్తేనో... అన్న ఆలోచన నుంచి వెలువడిందే 'బందూక్'.

## నవలానుభవం లేదు

'బందూక్' నా తొలినవల. అప్పటివరకూ నవలలు రాయలేదు. నవలకు ఉండాల్సిన లక్షణాలు.. శిల్పం, శైలి, నాటకీయత అసలే తెలియదు. ఊహ తెలిసినప్పటి నుంచి నేను చూసిన తెలంగాణా గ్రామీణ జీవితం.. అందులో మా గ్రామం... నేను తిరిగిన ఊళ్లు... అక్కడ జరిగిన సంఘటనలు... అక్కడి జీవితాలు... నా మనసుల్లో నిలిచిపోయాయి. ఆనాటి సాంఘిక పరిస్థితులను నేడు ఊహించలేం. దొరలు, దేశముఖులు, జాగీర్దార్లు, జమీందార్లు, పటేల్ లు, పట్వారీలు, ఆపైన ప్రభుత్వాధికారులు.. వారు చేసేదోపిడి, పెట్టే హింసలు నేటి తరానికి తెలియవు.

వెట్టిచాకిరీ చేయించుకోవడం నాటి సామాజిక న్యాయం. చేయని వారిని శిక్షించడం ఆనాటి రాజనీతి. నిజాం నవాబు పరిపాలనలో ప్రజలందరూ రాజుకు విధేయులుగా, సేవకులుగా ఉండాలి. అతన్ని కీర్తించడం, ప్రార్థించడం, సకల ఐశ్వర్యాలతో, ఆయురారోగ్యాలతో చిరంజీవిగా ప్రభువును కాపాడమని భగవంతుణ్ణి ప్రార్థించడం ప్రజల విధి. దానికి తోడు మూఢవిశ్వాసాలతో కూడిన సాంఘిక కట్టుబాట్లు, అక్షర జ్ఞానం లేని గ్రామీణ ప్రజల అజ్ఞానం, కర్మసిద్ధాంతం నరనరాన వ్యాపించిన ప్రజల ఉదాసీనత- అంతా భగవంతుడి లీలగా భావిస్తూ, కష్టాలను భరిస్తూ, కన్నీళ్లను దిగమింగుతూ బతుకులీడ్చే మూగజీవుల్లాంటి మనుషులు.

ఆంధ్ర మహాసభ ఆవిర్భావం- 'సంఘం' పేరుతో సంస్థానంలోని గ్రామ గ్రామాన క్రియాశీల నాయకుల కార్యక్రమాలు, ప్రజాచైతన్యం, క్రమంగా పోరాట విస్తరణ.. అది ఉద్యమరూపాన్ని ధరించడం.. అందులో నేను సైతం గొంతుకలిపిన రోజు మరువరాని స్మృతి.

అయ్యా! నీ గులాపోల్లమన్నోళ్లు- గుత్పలు పట్టిన తీరు. అయ్యా నీ బాంచలమన్నోళ్లు- బందూకులు గురిపెట్టిన వైనం. ఆ చైతన్యానికి మూలం... ఆ ధైర్యసాహసాలకు ఊతం ఆంధ్రమహాసభ, కమ్యూనిస్ట్‌పార్టీ.



దొరల, దేశముఖుల దౌర్జన్యాలు; రజాకార్ల రాక్షస కృత్యాలు, నిజాం పాలకుల నిర్బంధ శాసనాలు, ఉక్కు చట్రంలో ఇరుక్కుపోయి గిలగిలలాడిన అమాయకుల ఆర్తనాదాలు- వారి హృదయవేదనలు, మనసులోని భావాలు, తిరగబడిన తీరు, పోరాట పరిణామాలు, ఒడిదుడుకులు, జయాపజయాలు మొదలైన అంశాలను జ్ఞాపక చిహ్నాంగా భద్రపర

చాలన్న కోరిక నుంచి రూపొందిందే 'బందూక్'నవల.

నేను చెప్పదలుచుకున్నది సూటిగా ఉండాలి. పాఠకుల మనసుకు హత్తుకుపో వాలన్నది నా ఆకాంక్ష. అది నవలారూ పంలో అయితేనే బావుంటుందని భావిం చాను. కల్పనలు లేకుండా సాధ్యమైన మేర యదార్థ సంఘటనలు, వాస్తవిక అనుభ వాలు వ్యక్తీకరించాలని సంకల్పించాను.

ఒకరోజు నేనూ... మిత్రుడు చలసాని ప్రసాదరావూ మాట్లాడుకుంటున్నప్పుడు విషయం చెప్పాను. వెంటనే నవల పూర్తిచే యమన్నాడు. నేను సందేహించాను. సాహ సించడంలో జాప్యం చేశాను. కానీ ప్రసాద రావు నన్నొదలలేదు. వెంటబడ్డాడు. ఎలా గోలా నవల పూర్తిచేసి ఇచ్చాను. నాలుగు రోజుల్లో చదివి, కొన్ని చిన్న సవరణలు సూచించి, ఫెయిర్ కాపీ రాసివ్వమన్నాడు. అది నవల అవుతుందో కాదోనని సందేహి స్తున్న నన్ను మిత్రవాత్సల్యంతో చలసాని ప్రోత్సహించాడు. ఫెయిర్‌కాపీ రాసిచ్చాను.

కొన్నాళ్లకు నవల చాలా బాగుంది. 'చతు ర'లో సంక్షిప్తనవలగా ప్రచురణకు ఎంపిక య్యిందన్నాడు. అయితే యథాతథంగా అచ్చేయడం సాధ్యం కాదు. సంక్షిప్తీకరించ మని సూచించాడు. ఇతివృత్తానికి భంగం కలుగకుండా సంక్షిప్తప్రతిని సిద్ధంచేసి, చల సాని చేతిలో పెడ్తూ- నా మనసులోని మాట చెప్పాను. 1996 జులై 4న తెలం గాణా పోరాటంలో నేలరాలిన తొలివీరుడు దొడ్డి కొమరయ్య 50వ వర్ధంతి. అందువల్ల జులై సంచికలో వస్తే సంతోషిస్తానన్నాను.

ఆ విధంగానే 'చతుర' 1996 జులై సంచి కలో 'బందూక్' అచ్చయింది. పాఠకులు ఆదరించారు. ప్రశంసిస్తూ ఉత్తరాలురా శారు. చదివిన మిత్రులు, ఆత్మీయులు అభి నందించారు. నేనూ నవల రాయగలనన్న విశ్వాసం కలిగింది. సమగ్ర నవలగా ముద్రించమని తర్వాత చలసాని ప్రసాద రావు చాలాసార్లు చెప్పాడు. అయితే సమయం దొరకక, దొరికినప్పుడు రాసే ఓపి కలేక చాలాకాలం అశ్రద్ధ చేశాను.

ఈలోగా ప్రసాదరావు ఆకస్మికంగా చని పోయాడు. అతనితో నా స్నేహానుబంధం నవలను పూర్తిచేసే బాధ్యతను పెంచింది. ఇంతలో దొడ్డికొమరయ్య 60వ వర్ధంతి రానే వచ్చింది.

జీవితలక్ష్యాల్లో ఒకటిగా పెట్టుకున్న 'బందూక్' నవలను పట్టుదలతో పూర్తిచే శాను. కలంనాది. ప్రేరణ చలసానిది. అందుకే అతనికే నవలను అంకితమిచ్చాను. దీని గుణదోషాలు, మంచిచెడ్డలు తేల్చవలి సింది - సహృదయ పాఠకులు' అంటూ ముగించారు ప్రతాపరెడ్డి.

*సేకరణ: డాక్టర్ ఎస్వీ సత్యనారాయణ* ✦

# ప్రేమ ఓ దీపస్తంభం!

ప్రేమంటే పసిపాప బోసినవ్వు. నిష్కల్మషమైన పిల్లల స్నేహం, యౌవన జలవనంలో విరిసే కలువపువ్వు. అనురాగం, ఆత్మీయత పెనవేసుకున్న ప్రతి అనుబంధంలోనూ ఉండేదే ప్రేమ. పసితనం నుండి పండు ముదుసలితనం వరకు జీవితంలోని అన్ని ఋతువుల్లోనూ ఈ ప్రేమ పుష్పం వికసిస్తుంది. మనతో పాటు పుట్టే ఈ ప్రేమ మరణం అంచుల వరకూ మనకు తోడుగా నిలుస్తుంది.

మనలోనే ఉన్న ఈ ప్రేమను మరి అందరూ ఎందుకు గుర్తించలేక పోతున్నారు? ఎందుకు ప్రేమ కోసం ఈ పరుగులు? అసలు ఇవాళ ప్రేమంటే ఏమిటి అని ఈ విచికిత్స చేసుకోవాల్సిన సందర్భం ఎందుకు వచ్చింది?

ఎందుకంటే ప్రేమ అనేది కళ్లకు కనిపించదు. చెవులకు వినిపించదు. ఆ ప్రేమ గానం మనసుకు మాత్రమే తెలిసే ఓ అనిర్వచనీయ భావన. ఆ భావనను గుర్తించలేని వారు ఎండమావుల వెంట పరుగులు పెడుతున్నారు. మనలోని ప్రేమ భావనని తెలుసుకోగలిగిన వారికి జగమంతా ప్రేమమయమే. ప్రత్యేకించి వెతికి దాన్ని పట్టుకోవాల్సిన పనిలేదు.

"There is more hunger for love and appreciation in this world than for bread" అని సరిగ్గానే చెప్పారు మదర్ థెరిసా ఓ చోట.

ప్రేమ భావన మనలో కలగక ముందు, అంటే, మనం దాన్ని గుర్తించక ముందు ఎవరికి కూడా అదేమిటో తెలియదు. ప్రేమ ఎలా కలుగుతుందో కూడా చెప్పలేం. ఎందుకంటే ప్రేమ మనం ప్రయోగశాలలో కని పెట్టిన వస్తువు కాదు కాబట్టి. మనలో ప్రేమ పుట్టిన తరువాత మనం దాన్ని గుర్తించగలుగుతాం. ఆ ప్రేమ ఎప్పుడు పుడుతుంది? ఎవరిపై ప్రేమ కలుగుతుంది. అన్నది ఏ జ్యోతిశ్శాస్త్ర వేత్త కూడా చెప్పలేదు.




అరవిరిసిన పువ్వుల్లా కనిపించే పసిపిల్లల నవ్వూ ప్రేమే. పిల్లల్లోని నిర్మలమైన స్నేహమూ ప్రేమే. యౌవనోత్సాహంలో స్త్రీ పురుషుల మధ్య పుట్టే ఆకర్షణా ప్రేమే. ఆధిపత్య భావనలు లేకుండా కలిసి జీవితాన్ని పంచుకునే సహచరుల మధ్యవున్న అనుబం

ధమూ ప్రేమ పూరితమైనదే. దేవునిపై కలిగే అనురక్తీ ప్రేమే. బాల్య, కౌమార, యౌవన, వృద్ధాప్య దశలన్నింటిలోనూ ఈ ప్రేమ వుంటుంది. అయితే ఈ ప్రేమ స్వరూపం మారుతుంటుంది. కానీ ఇలా విభిన్న స్థాయిల్లో కలిగే ప్రేమలో అంతఃస్సూత్రం మాత్రం ఒక్కటే. అదే ఏకాత్మభావన.

ఈ ఏకాత్మభావనలో స్వచ్ఛమైన ప్రేమకు తప్ప కల్మషానికి, కుటిలత్వానికి తావులేదు ఈర్ష్యా అసూయలుండవు. ఎక్కువ తక్కువ భావనలుండవు. ఏకాత్మ భావనలోంచి పుట్టేది నిర్మల ప్రేమ.

కానీ స్త్రీ, పురుషుల మధ్య కలిగే ప్రేమే ఇవాళ విస్తృతార్థంలో వాడుకలో ఉంది. ఆ ప్రేమ కోసమే జీవించే వాళ్లున్నారు. ఆ ప్రేమ కోసమే మరణించే వాళ్లూ వున్నారు. ప్రేమలో బోలెడంత బలం ఉంది. దాంతో పాటూ బోలెడంత బలహీనత కూడా ఉంది. పిరికి వాళ్లను ధైర్యవంతులుగా చేస్తుంది. మరణానికి అతి సన్నిహితమైన వారికి ఈ ప్రేమ జీవితం పట్ల ఆశల్ని రేకెత్తిస్తుంది. తమ మీద తమకి ఆత్మవిశ్వాసం కలిగిస్తుంది ఈ ప్రేమ. ప్రేమలో ఓ నమ్మకముంటుంది. ఓ ఆసరా ఉంటుంది. ఓ ఓదార్పు ఉంటుంది. ప్రేమ ఓ దీప స్తంభం. దారి తప్పిన వాళ్లకు తోవ చూపిస్తుంది. కింద పడిపోయిన వాళ్లకు లేచినిలబడే చేయూతని స్తుంది. ప్రపంచంలో అతిశక్తివంతమైనది ఈ ప్రేమ.

ప్రేమంటే చాలామంది మనసు, దానితో పాటు మనకున్నదంతా ఇచ్చేయడం అనుకుం టారు. అందుకనే ఇవాల్టి ప్రేమల్లో ఎక్కువ భాగం ఎదుటి వారి నుంచి ప్రేమంటే ఏమేం పుచ్చుకోగలమని లెక్కలేస్తుంటారు. ప్రేమంటే కేవలం ఇవ్వడమే కాదు తిరిగి ప్రేమను తీసుకోగలగడం కూడా. ఎంతమంది నుంచి మనం ప్రేమను పొందగలుగుతామో అంతకు రెట్టింపు మందికి మనం తిరిగి ఆ ప్రేమను పంచి ఇవ్వగలుగుతాం. మదర్‌థె రిసా చేసింది అదే. నిజమైన ప్రేమకు నిలు వెత్తు నిర్వచనం ఆమె. ఇస్తే తరిగిపోయేది కాదు. తీసుకుంటే రుణపడిపోయేది కాదు ప్రేమ అని ఆమె తన జీవితం ద్వారా నిరూ పించారు. ప్రేమను అందించినా, పొందినా దాని విలువ మరింత పెరుగుతుంది. ఆ ప్రేమ భావన మనల్ని, మన మనస్సుల్ని మరింత విశాలం చేస్తుంది.

ప్రేమంటే ఒకరి పట్ల మాత్రమే కలుగు తుందన్న భావన ఊహాజనితమైన ఆలోచనే తప్ప వాస్తవం కాదు. ఏకకాలంలో పసిపి ల్లల్ని ప్రేమిస్తాం. స్నేహితులను ప్రేమి స్తాం. జీవన సహచరుల్ని ప్రేమిస్తాం. తల్లి తండ్రుల్ని ప్రేమిస్తాం. ప్రేమ విశాలమైంది. ఒక్కరిపట్ల మాత్రమే కట్టిపడవేసే సంకుచిత భావన కాదు. కాబట్టే ప్రేమ అన్న భావనను మనసు నిండా నింపుకొని ఈ ప్రపంచాన్ని చూసినప్పుడు రోగార్తుల్ని, బాధితుల్ని, పతి తుల్ని, భ్రష్టుల్ని కూడా ప్రేమతో ఆదరించగ లుగుతాం. తమని తాము ప్రేమించుకోగలి గిన వారే ఇతరుల్ని కూడా ప్రేమించగలుగు తారు. సో, ముందు ఎవరికి వారు తమని తాము ప్రేమించుకోవాలి. ఎవరికి వారు తమను గౌరవించుకోవాలి. ఎవరితలోనైతే స్వీయాత్మ గౌరవం, స్వీయాత్మ ప్రేమ ఉంటాయో వాళ్లు ఎదుటి వ్యక్తుల్లోని తప్పొ ప్పులను, బలహీనతలల్ని ఎంచకుండా వారి లోని సుగుణాలను ప్రేమించగలుగుతారు. 'నిన్ను నువ్వు ప్రేమించుకో, ఇతరులనూ ప్రేమించగలవు'.

జీవితంలో అసలు ప్రేమ భావన పొంద నివారు ఎవరూ ఉండరు. ఎవరో ఒకరి ప్రేమను పొందే ఉంటారు. ఎవరో ఒకరికి ప్రేమను పంచి ఇచ్చే ఉంటారు.

మరి ప్రేమ ఇంత ఉదాత్తమైనదైతే ఇవాల్టి ప్రేమలన్నీ ఎక్కువగా 'యూజ్ అండ్ త్రో'గా ఎందుకు మారుతున్నాయి? కాలేజీ ప్రేమలు గొడ్డళ్లతో నరకటాలు, మొహం మీద యాసిడ్ పోయడాలతో రక్తపాతాలుగా ఎందుకు మారుతున్నాయి? అన్ని అనుబంధాల్లో కూడా డబ్బే ప్రేమగా

ఎందుకు చెలామణి అవుతోంది? విజయశిఖరాన్ని తొందర తొందరగా అధిరోహించాలన్న తాపత్రయంలో తాము ఎక్కి వచ్చిన నిచ్చెన మెట్లను తామే ఎందుకు తోసేస్తోంది ఇవాళ్టి తరం?

ఈ తరంలోని వాళ్లకు పసితనం నుంచి సరైన ప్రేమ అందడం లేదు కాబట్టి వాళ్లు ఎవరికీ ప్రేమను పంచివ్వలేకపోతున్నారు. ఊహ రెక్క విప్పుకున్న క్షణం నుండీ మనం బోధిస్తోంది ఎక్కువ మార్కులు తెచ్చుకోమని. పోటీ ప్రపంచంలో పరుగుల పందెంలో ఎలా ఫస్ట్ రావాలో కోచింగ్ లిప్పిస్తున్నాం. అమెరికా దేశ ఔన్నత్యం గురించి ఆరేళ్ల నుంచే అష్టాదశ వర్ణనలతో చెపుతున్నాం. తెలుగులో మాట్లాడటం ఇప్పటి తరంలో ఆత్మన్యూనతా భావానికి సింబల్ అయింది. కమ్యూనికేషన్ స్కిల్స్ నేర్చుకున్న యువత అమ్మానాన్నతో కూడా సెల్‌ఫోన్లలోనే ముచ్చటిస్తున్నారు. యువతరం ప్రేమలు ఎస్ఎంఎస్‌లకు, ఇ-మెయిల్స్‌కు పరిమితమయ్యాయి. ముఖపరిచయం లేకపోయినా అపర ప్రేమికులైపోతున్నారు. చెరొక దేశంలో ఉండి ఫోన్ల ద్వారా పెళ్లిళ్లు చేసుకోగలుగుతున్నారు. కంప్యూటర్‌లో ఫైల్ ఓపెన్ చేసి క్లోజ్ చేసినంత తేలికగా అనుబంధాల్ని ఏర్పరచుకోవడం, తుంచేసుకోవడం చేస్తున్నారు.

ఈ ఆన్ అండ్ ఆఫ్ పరుగు పందెంలో వాళ్లు ఏం కోల్పోతున్నారో వాళ్లకు తెలియడం లేదు. వాళ్లు పోగొట్టుకుంటున్నది నిజమైన ప్రేమ, ఆప్యాయతల్ని, మానవసంబంధాల్లోని మానవీయ విలువల్ని వాళ్లు కోల్పోతున్నారు. సక్సెస్ ఇచ్చే ఆనందం తాత్కాలికమైనది. ఆ క్షణికమైన సుఖసంతోషాలకు, భోగభాగ్యాలకు వాళ్లు కోల్పోతున్నది వారి విలువైన వ్యక్తిగత జీవితాలను. అంతేకాకుండా తీవ్రమైన మానసిక, శరీరక ఒత్తిడులకు గురవుతున్నారు. ఈ ఒత్తిళ్ల నుంచి జీవితమనే పుష్పానికి ప్రేమ తేనె లాంటిదన్న సత్యాన్ని ఈ తరం గుర్తిస్తే ఎంత బావుంటుంది! జీవితంలో అతిముఖ్యమైన వాటిని తమ దగ్గరే దాచుకోవడం కన్నా వాటిని ఎవర్కైనా ఇస్తేనే వాటి విలువ మరింత పెరుగుతుంది. ఓ గులాబీ, ఓ ముద్దు... ఓ ప్రేమ! ప్రేమకు ప్రధాన సూత్రం. ఎదుటి వారిలోని లోపాల్ని అదేపనిగా లెక్కించకపోవడం. If you judge people, you don't have no time to love them.



ప్రేమను పొందటానికి, ప్రేమను పంచి ఇవ్వడానికే కాదు ప్రేమను నిలబెట్టుకోవడానికి కూడా బోలెడంత సంయమనం కావాలి. ఆ సంయమనంతో ఇవాళ్టి పరుగుల ప్రపంచంలో నిజమైన ప్రేమను నవతరం నిలబెట్టుకోగలిగితే వారిలో నుంచి ఓ మహాత్మాగాంధీ, ఓ మదర్‌థెరిసా పుట్టుకువస్తారు!

ఏ సమాజానికైనా వాళ్లే కదా ఆదర్శప్రాయులు!

– కల్పనా రెంటాల



నాటి చతుర

నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# అహం

—చెల్లూరి సీతారాజేశ్వరరావు

సంపుటి : 2 సంచిక : 11 డిసెంబరు 1979

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. 1979వ సంవత్సరం డిసెంబరు నెల **'చతుర'**లో చెల్లూరి సీతారాజేశ్వరరావు నవల **'అహం'** ప్రచురితమైంది. ఆ నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

మేధావులు, అభ్యుదయవాదులు, స్త్రీ వాద సంఘాల ప్రతినిధులు ఎంత పురోగతి సాధించామనుకుంటున్నా నూటికి నూరు పాళ్ళు స్త్రీ అభ్యున్నతి జరగలేదనేది వాస్తవం. ఇప్పటికీ స్త్రీ ద్వితీయశ్రేణి పౌరురాలి స్థాయిలోనే ఉంది. ఎంత పెద్ద చదువులు చదువుకున్నా ఉన్నతోద్యోగాలు చేసినా, పదవు లేలినా మగవారి అహంకారానికి ఎప్పుడో, ఎక్కడో, ఎంతో కొంత బలవుతూనే ఉంది. మోతాదులలోనే తేడా! ఒకరు ఎక్కువ పీడ నకు గురైతే మరొకరు కొంచెం తక్కువ అంతే!

ఈ ఇతివృత్తాన్నే కథావస్తువుగా తీసుకుని అద్భుతమైన కథా కథనంతో 'అహం' నవ లను నడిపించారు చెల్లూరి సీతారాజేశ్వర రావు.

విశాఖపట్నానికి వచ్చిన సారథి ఆరోజు ఆఫీసులో జాయినింగ్ రిపోర్ట్ ఇచ్చి తన సీటు వద్దకు వస్తుండగా సామ్రాజ్యం కన్పి స్తుంది. ఆమెను పలకరించబోతే ఆమె మాట్లాడదు. అతడు గతంలోకి జారు కుంటాడు.

సామ్రాజ్యం, సారథి పక్క పక్క ఇళ్ళవాళ్ళే. చిన్నప్పుడందరూ వీళ్ళని మొగుడూ పెళ్ళాలనే వారు. వాళ్ళూ అలాంటి ఆటలే ఆడుకునే వారు. సామ్రాజ్యం తండ్రి రాఘవయ్య, సారథి తండ్రి దయానందం స్నేహితులు. రాఘవయ్య దయానందానికి కాంట్రాక్టులి ప్పించి ఎంతో ఉపకారం చేస్తాడు. కారణాంత రాలవలన రాఘవయ్య తన కుటుంబంతో సహా హైదరాబాద్ వెళ్లిపోతాడు.

తరువాత సామ్రాజ్యం సారథిల పెళ్ళి నిశ్చ యిస్తారు. పెళ్ళికి బంధువులంతా వస్తారు. కట్నం డబ్బు పదివేలు మాట్లాడుకుంటారు. సమయానికి కొంత డబ్బు అందలేదని అది తరువాత ఇస్తానని రాఘవయ్య అంటాడు.

దయానందం పెళ్ళి రద్దు చేస్తాడు. దయానందం భార్య దమయంతి, కొడుకు సారథి ఇందుకు వ్యతిరేకించినా ఫలితం ఉండదు. ఇది జరిగిన ఆరేడు నెలలకు విశాఖపట్నంకు ట్రాన్స్‌ఫర్ అయి వస్తాడు సారథి. సామ్రాజ్యాన్ని కలుసుకుని "నా మాట నమ్ము సామ్రాజ్యం, జరిగిన దానికి నేను కుమిలిపోని క్షణం లేదు" అంటాడు.

"మీరు అంత బాధపడవలసిన అవసరమేముంది? కబురు పెడితే వేలు లక్షలు కట్నాలతో అమ్మాయిలు పెళ్ళికి సిద్ధమవుతారు" అంటుంది. ఆమె తనను లక్ష్యం చేయక తిరస్కారంగా మాట్లాడటంతో సారథి అశాంతికి గురవుతాడు. సారథి కనిపించిన విషయం తల్లిదండ్రులకు చెబుతుంది సామ్రాజ్యం. వాళ్ళకింకా సారథిపై ఆశ పోలేదని గ్రహిస్తుంది సామ్రాజ్యం.

దయానందం కొడుకు దగ్గరికి వచ్చి నలభై వేల కట్నంతో పెళ్ళి కూతుర్ని చూశాను పెళ్ళి చూపులకు రమ్మంటాడు. సారథి తనకు పెళ్ళే వద్దనటంతో కోపంగా నిష్క్రమిస్తాడు దయానందం. తన మీదగల ప్రేమతో సారథి తండ్రితో సంబంధాన్ని తెగదెంపులు చేసుకున్నాడని వింటుంది సామ్రాజ్యం. ఆఫీసు డబ్బు ఐదువేలు పోగొడతాడు సారథి. తన సేవింగ్స్‌లో నుండి తీసి ఆ డబ్బు చెల్లిస్తుంది సామ్రాజ్యం. ఆమె డబ్బు సర్దిన వైనం తల్లికి చెబుతాడు సారథి. తల్లి తన రెండు గొలుసులు సారథికిచ్చి "ఇవి ఎనిమిది వేలు చేస్తాయి. అమ్మి సామ్రాజ్యం అప్పు తీర్చెయ్" అంటుంది. ఆ నగలను యథాతథంగా సామ్రాజ్యం మెడలో వేస్తాడు సారథి.

"నా వల్ల తండ్రి కొడుకులు శాశ్వతంగా శత్రువులై పోతారేమో" అంటుంది సామ్రాజ్యం.

"మా నాన్నకు డబ్బు కావాలి. నేను కాదు. మమతలు తెలియవు" అంటాడు సారథి. సామ్రాజ్యం ఇంటికి వచ్చి ఆమె తల్లిదండ్రులతో మాట్లాడతాడు. సింహాచలం ఆలయంలో పెళ్లి నిశ్చయిస్తారు. తల్లిని రహస్యంగా తీసుకురమ్మని తన స్నేహితుడు బాలాజీని పంపిస్తాడు సారథి. పెళ్లికి ఆమె వస్తుంది. పెళ్ళి నిరాటంకంగా జరుగుతుంది. ఇంటికి వెళ్తూ కొడుకూ కోడల్ని తమ ఇంటికి ఆహ్వానిస్తుంది దమయంతి. వాళ్ళొచ్చేవేళకు భర్తను మరో ఊరు పంపిస్తుంది. కానీ మర్నాడు భర్త వస్తాడు. కొడుకూ, కోడలిని చూసి చిందులు దొక్కుతాడు. పెళ్ళి పెద్దగా వెళ్ళి పెళ్ళి జరిపించినందుకు భార్యనూ తిడతాడు. రాఘవయ్యను తిడతాడు. సామ్రాజ్యం, సారథి సూట్‌కేస్ సర్దుకుని పయనమవుతారు.

సారథి, సామ్రాజ్యం అద్దెకు ఇల్లు తీసుకుని కాపురం పెడతారు. సారథి ఆఫీసర్ సూర్యభగవాన్ ఓ పెళ్ళిలో కన్పించేసరికి అతడి చేతిలో డబ్బు పెట్టి "మా వాడి ఉద్యోగం ఎలాగైనా ఊడగొట్టాలి" అంటాడు దయానందం. ఉద్యోగం పోతే తన కాళ్ళ దగ్గరికి కొడుకు వచ్చేస్తాడనుకుంటాడాయన. సారథి కోర్టుకెక్కి తను నిర్దోషని రుజువు చేసుకోగా తిరిగి ఉద్యోగం లభిస్తుంది. కానీ మరో ఊరికి బదిలీ అవుతుంది. ఓ రోజు దయానందం సామ్రాజ్యం ఆఫీసుకు వస్తాడు. తమ ఇంటికి ఆహ్వానిస్తాడు. ఆమె బయల్దేరగా "హోటల్ గదిలో నా సామానుంది. తెచ్చుకుందాం పద" అని ఆమెను వెంటబెట్టుకెళ్తాడు. కుట్ర పన్ని తన ఊరి కుర్రాడిని సామ్రాజ్యం ఒడిలో పడుకునేటట్లు నటింపచేస్తాడు. ఆ ఫొటోను కొడుకుకు పంపగా సారథి భార్యను అనుమానిస్తాడు. దయానందం దగ్గరికి రాఘవయ్య, సీతమ్మ, సామ్రాజ్యం, బాలాజీ వెళ్తారు. "పెళ్ళి చెడగొట్టాలని చూశావు. నీ తరం కాలేదు. కొడుకు ఉద్యోగం పీకించాలనుకున్నావు. అదీ కాలేదు. సారథికి అనుమానం కలగచేసి నా కూతురు జీవితంలో నిప్పులు పోయాలని చూస్తావా? కొడుకుకు కట్నం పెళ్లి చేసేదాక నిద్ర పట్టదా" అని సీతమ్మ నిలదీస్తుంది. దయా

నందం కోడలి చేతులు పట్టుకుని క్షమాపణ అడుగుతుండగా బాలాజీ ఫోటో తీసి సారథికి ఉత్తరం రాయమంటాడు బాలాజీ చెప్పినట్లుగా రాసి తన తప్పు అంగీకరిస్తాడు దయానందం. దాంతో సారథి నిజం తెలుసుకుంటాడు. కాపురం కుదుటపడుతుంది. ఓ అబ్బాయి, అమ్మాయి పుడతారు.

ఆఫీసులో డిపార్ట్‌మెంటల్ పరీక్షలు కడుతుంది సామ్రాజ్యం. సారథిని కూడా చదవమంటుంది. అతడు తనకు కుదరదంటాడు. నాటకాల్లో వేషాలు వేస్తుంటాడు. సామ్రాజ్యం పరీక్షలు పాసవుతుంది. అదే ఆఫీసులో ఆమెకు ఆఫీసరుగా ప్రమోషన్ వస్తుంది. భార్యాభర్తలకు తగవులు. పెట్టి వినోదించాలని స్టాఫ్ ప్రయత్నించి విజయం సాధిస్తారు. "నీ భార్యకు గర్వం, నిన్ను లెక్క చెయ్యదు, నాకు రెకమెండ్ చెయ్యి" వంటి మాటలు అంటూ సారథి మనసును కలుషితం చేస్తారు. మొదట్లో పట్టించుకోకపోయినా ఆ తరువాత సారథి సామ్రాజ్యం పై ద్వేషాన్ని పెంచుకొంటాడు. ప్రతి దానికీ "ఆఫీసర్నయ్యానని అహంకారమా? నా చెప్పు చేతుల్లో ఉండాల్సిందే! నువ్వు నా భార్యవే" అని తిడుతుంటాడు. ఆ తరువాత కొట్టటమూ ప్రారంభిస్తాడు. ఆమెను సాధించాలని, బాధించాలని ఇంటికి వెళ్లటం మానేసి హోటళ్లలోనో, స్నేహితులిళ్లలోనో మకాం వేస్తాడు. పేకాట, తాగుడు, ఉంపుడుగత్తెల ప్రలోభానికి లొంగి వాటికి బానిసై అప్పులు చేస్తాడు. ఆ అప్పులు సామ్రాజ్యం తీరుస్తుంది. తనకు తోడుగా తల్లిని తనతో ఉండమంటుంది సామ్రాజ్యం. ఇంటికి వచ్చి భార్యతో గొడవపడి అత్తగారిని ఇంట్లో నుండి తరివేస్తాడు సారథి. భర్త సాధింపులను, వెటకారాలను సహించి కాపురం నిలబెట్టుకోవాలనుకుంటుంది సామ్రాజ్యం. ఇంక్రిమెంట్లు ఆగిపోయినవారు, ఇతర పనులున్న వారి వద్ద తను లంచాలు పుచ్చుకొని వారి పనులు చేయమని సామ్రాజ్యాన్ని బలవంతపెడతాడు సారథి. ఆమె నిరాకరిస్తుంది.

సారథి తండ్రి దయానందం చనిపోతాడు. సారథి ఇంటిపట్టునే ఉండి పాడీపంటా చూసుకుంటాననటంతో తల్లి సంతోషిస్తుంది. వడ్డీ వ్యాపారం ప్రారంభిస్తాడు. లారీలు కొంటాడు. వ్యవసాయం చూసుకొంటాడు. దమయంతి తమ్ముడు శరభయ్య మేనల్లుడికీ,




అతని భార్యకూ సఖ్యత లేదని గమనించి వారిని విడగొట్టి సారథికి తన కూతురు శకుంతలనిస్తే సుఖపడుతుందనుకుంటాడు. ఆ దిశగా ప్రయత్నాలు సాగిస్తాడు. సారథితో ఒంటరిగా శకుంతలను నగరానికి పంపిస్తాడు. శకుంతల ప్రకాశాన్ని ప్రేమిస్తుంది. తన ప్రేమ ఉదంతాన్ని సామ్రాజ్యంతో చెబుతుంది. సారథి శకుంతలను పెళ్లాడాలని నిర్ణయించుకున్నాడు. సామ్రాజ్యానికి అమలాపురం ట్రాన్స్‌ఫరవుతుంది. ఇంటి ఓనర్‌కు ఆమెనో కంట కనిపెట్టమని చెబుతాడు సారథి. శరభయ్యను పంపి ప్రతినెలా మొదటి తారీఖున ఆమె జీతం తెప్పించుకుంటూ ఉంటాడు. డబ్బుకు సామ్రాజ్యం

ఇబ్బంది పడుతుంటుంది.

శరభయ్య సారథితో, శకుంతల పెళ్లికి ముహూర్తం పెడతాడు. సారథి శుభలేఖ సామ్రాజ్యానికిచ్చి తన పెళ్లికి రమ్మంటాడు. శకుంతల రహస్యంగా సామ్రాజ్యాన్ని కలుసుకుని తనకు ప్రకాశంతో పెళ్లి జరిపించమని ఏడుస్తుంది. తండ్రి నిర్వహించే పెళ్లి పనులలో చురుగ్గా పాల్గొన్న శకుంతల పెళ్లి ముహూర్తానికి చివరి ఘట్టంలో వీరి కన్నుగప్పి కోవెలకు వెళ్తుంది. అక్కడ ప్రకాశంతో పెళ్లి జరిపిస్తుంది సామ్రాజ్యం. పెళ్లవగానే దంపతులు హైదరాబాద్‌కు వెళ్లిపోతారు. ప్రకాశం- శకుంతల మర్నాడు పెళ్లి ఫొటోల్ని సామ్రాజ్యం రిజిస్టర్ పోస్టులో సారథికి, శరభయ్యకు పంపుతుంది. పారిజాతం అనే వంట మనిషితో అక్రమ సంబంధం పెట్టుకుంటాడు సారథి. పారిజాతం సారథి పిల్లల్ని హింసించటంతో వాళ్లు బస్సెక్కి తల్లి దగ్గరకి వెళ్లిపోతారు. ఇంట్లో ఎవరూ లేనిది చూసి పారిజాతం డబ్బు, దస్కం పోగేసుకుని ఉడాయించేస్తుంది. దమయంతి యాత్రల నుండి తిరిగి వచ్చి జరిగింది విని సారథిని కోప్పడుతుంది. సామ్రాజ్యం పిల్లల్ని తీసుకుని వస్తుంది. "వీళ్లు మీకు చెప్పకుండా నా దగ్గరికొచ్చారు. మీరు కంగారు పడతారేమోనని తీసుకొచ్చా"నంటున్న కోడలితో, "వాడికి బుద్ధొచ్చేవరకు నేనూ నీతోనే ఉంటాను పద" అంటుంది దమయంతి. సారథికి పశ్చాత్తాపం కలుగుతుంది. అయినా ఆ మాట ఒప్పుకోవడానికి అహం అడ్డువస్తుంది.

తను చేసిన పని దుర్మార్గమని, అన్యాయమని తెలిసినా అంగీకరించడానికి అహం అడ్డు రావటంతో కరగకుండా ఉండేందుకు ప్రయత్నించే పురుషజాతికి ప్రతీక సారథి. పౌరుషానికి పోతే కాపురం కూలిపోతుంది. గనుక సహనంతో భర్తను దార్లోకి తెచ్చుకోవాలని ప్రయత్నించి విసిగి వేసారిపోయిన భార్యలకు ప్రతీక సామ్యాజ్యం.

'అహం'కారమనే పొరలు కరిగిపోతే సంసారం స్వర్గతుల్యమవుతుందనే సందేశాన్నిచ్చారు ఈ నవలలో చెల్లూరి సీతారాజేశ్వరరావుగారు.






## నిలువుటద్దాలు

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

పల్లెలను వదలి పట్నాలకు వలస పక్షుల్లా వెళ్లిపోతున్న ఈ తరం ప్రజానీకానికి జయ కాంతన్ తమిళ నవల 'అనుబంధాలు' కొంత అడ్డుగోడలాంటిది. పల్లెసీమల మట్టి వాసన లోని రుచిని ఆస్వాదించడానికి ముందు ముందు పల్లెల్లో మనుషులు కరువైనా ఆశ్చర్య పోనక్కర్లేదు. పల్లెల్లోని మనుషులు వారి ప్రేమానురాగాలు, కొత్తవారి పట్ల వారు చూపే ఆదరణ కొత్త తరహాలో విశ్లేషించి చూపారు జయకాంతన్. ఇక కథలో హెన్రీకి తండ్రి తన ఊరి గురించి, తన మనుషుల గురించి చెప్పిన దానికన్నా ఎక్కువ ఆత్మీ యత కనపరచారు ఆ ఊరి ప్రజలు. చదువు లేకపోయినా దొరస్వామి పాత్ర అమోఘం. చదువు సంస్కారం నేర్పదు అన్న నానుడిని నిజం చేశాడు దొరస్వామి. ఎన్నో సంవత్సరాల నుంచి అనుభవిస్తున్న ఆస్తిని ఆకస్మికంగా వచ్చిన వ్యక్తికి ధారపో యడమంటే మాటలు కాదు. పల్లెటూరి మనుషుల స్వచ్ఛతని నిలువుటద్దంలో చూపించారు రచయిత. పల్లెల్లో దేవ రాజులు లాంటి స్నేహితులు లేకపోలేదు. ఇక మారుటి తల్లి చేసిన పొరపాటును ఎటువంటి పరిస్థితులలోను ఆ ఊరి జనా లకి చెప్పకుండా దాటవేయడం హెన్రీ ఔన్న త్యానికి నిదర్శనం. చివరిలో పిచ్చిదాని పాత్ర కొంత గందరగోళంలో పడేసినా ఆ పాత్రని మరల హెన్రీ జీవితం నుండి పంపి వేయడం బాగాలేదేమో అనిపించింది. ఏది ఏమైనా పల్లెటూరి ప్రజల మనోభావాలు, వారి మంచితనం కళ్ళకు కట్టినట్లు వివరిం చాడు రచయిత. అనువదించిన బాలాజీగా రికి అభివందనలు.

–పి.వి.ఎన్.ప్రసాద్, నవులూరు.

## అసలైన అనుబంధాలు (రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

మనిషిని మనిషే నమ్మలేని ఈ రోజుల్లో దేవరాజులు హెన్రీ భాగవతార్‌కి అతిథ్యమి వ్వడం ఆశ్చర్యపరుస్తుంది. కానీ ఆ రోజులు వేరు. అక్కమ్మ ఆదరణ కూడా ఆదర్శ ప్రాయం. దేవరాజు భార్య కథనం, హెన్రీ ఆత్మ మథనం, పంచాయితీ తీరు, ప్రలోభ పడకుండా దొరస్వామి తన అన్న కొడుక్కి ఆస్తి ఇచ్చేయటం, హెన్రీ తిరిగి దాన్ని పిన తండ్రినే ఉంచుకోమనడం, ఒక్క ఇల్లు మాత్రం అడగటం వగైరాలతో కథను చక్కగా నడిపించారు. ఈ వ్యక్తులందరిపీ ఒకరికొకరు తీసిపోని మనస్తత్వాలు. అల నాటి సంసారానికి సోదాహరణలు. మున పటి 'మోడల్' మార్చకుండా ఇల్లు బాగుచే యడం, అందర్నీ ఆహ్వానించడం, 'బేబీ' చేత నట్టింట్లో దీపం పెట్టించడం, కథలో పరా కాష్ఠ. అయితే ఈ బేబీ ఎవరో, ఎక్కడ్నుంచి వచ్చిందో, అలాగే వెళ్లిపోయి, కేవలం హెన్రీ బాగుకోసం వాళ్లమ్మే ఇలా వచ్చిందేమోనన్న భ్రమ కల్గించడం, ఎవరెలా ఊహించుకుంటే

అలాగు అన్వయించుకోగలడంలో నవలాకారుని నైపుణ్యం దాక్కొని ఉంది!

అప్పటి కాలమాన పరిస్థితులను బట్టి ఆయా పాత్రలు, వ్యక్తులు, వ్యవహారాలు, కలుషితం కాని ప్రకృతి శోభ, అలాగే మనుషుల మనస్సులు, కళ్లకు కట్టినట్లుగ నవలలో చిత్రీకరించారు. ఇవే అసలు సిసలయిన "అనుబంధాలు" దేవుడికీ, మతానికీ ఏమిటి సంబంధం అన్న అక్షర లక్షలను అందరూ సవ్యంగా అర్థం చేసుకుంటే ఈ దేశం ఇలా ఉండేది కాదేమో!

–వి. లలితాంబ, పర్లాకిమిడి

## కమనీయ కథనం (మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

**పాత** చింతకాయ పచ్చడికి పర్యాయపదంలా 'సెంటిమెంట్' అనే ఓ ఆంగ్లపదాన్ని ఊతపదం కింద వ్యంగ్యంగా ఉపయోగిస్తుంటారు నేడు చాలామంది. కానీ పాతదైనా, కొత్తదైనా చింతకాయ పచ్చడిలోని కమ్మదనాన్ని కమనీయమైన కథనంతో రుచి చూపించిందీ నవల. సహజత్వాన్ని సంతరించుకున్న గ్రామీణ నేపథ్యంతో ఔన్నత్యాన్ని అలంకరించిన పాత్రలతో అసభ్యతకు చోటివ్వకుండా రాగ ద్వేషాలకు అతీతంగా ఎంతో కులాసాగా సాగిపోయే పెద్ద కథ ఈ నవల.

అర్ధరాత్రి తన భార్య ఓ మంగలివాడితో పారిపోవటాన్ని చూసి 'నొప్పించక తానొవ్వక' అన్న రీతిలో తాను కూడా ఊరిని విడిచిపెట్టి తన వంశ గౌరవాన్ని కాపాడుకుంటాడు భాగవతార్. సంక్లిష్ట పరిస్థితులలో పెంపుడు తండ్రి వదలిపెట్టిన స్థిరాస్తులకు హక్కుదారైనప్పటికీ అవేవీ తనకవసరం లేదనీ తండ్రి యొక్క గతం జ్ఞాపకాలతో ముడిపడి ఉన్న పాడుబడిన ఇల్లు మాత్రం కావాలనీ, అదీ లేకపోతే తండ్రి నివసించిన ఊరు చాలనీ అంటాడు హెన్రీ. ఎలాంటి రక్తసంబంధం లేకపోయినా తన అన్నచేత పెంచబడ్డాడన్న మధురోహతో తన జాతి, మతం దృష్ట్యా సందేహించదగిన వ్యక్తిని కన్నకొడుకులా భావించి, ఆప్యాయంగా ఆదరిస్తాడు దొరస్వామి. భర్త అభిప్రాయాల్నే మనస్ఫూర్తిగా ఆచరిస్తుంది ఈయన భార్య. పరిచయం పాతబడితేనే అది స్నేహంగా మారనక్కర్లేదని, మంచి మనసు కలిగిన ఎవరైనా స్నేహంతోనే పరిచయం చేసుకోవచ్చుననే విషయాన్ని నిగూఢంగా బోధపరుస్తూ, విభిన్నమైన సంస్కృతి, అలవాట్లను కలిగిన ఒక అపరిచితుడికి తన స్నేహ హస్తం అందించి అతడికి శాశ్వత మిత్రుడిగా ఉండిపోతాడు దేవరాజులు. ఇలాగే మున్సిఫ్, అక్కమ్మ, పాండు మొదలైన పాత్రలన్నీ కూడా మంచి వ్యక్తిత్వం సంతరించుకొని ప్రవర్తిస్తాయి. ప్రతికూల ఆలోచనలకు తావే లేనటువంటి ఈ పాత్రలన్నీ కూడా పాఠకుల మనస్సుతో అనుబంధాలను పెనవేసుకుపోతాయి.

ఇలాంటి ఉత్తమ రచనలు జయకాంతన్ గారి కలం చలవే. అదే తమిళ సాహిత్యానికి మరొక జ్ఞానపీఠాన్ని అందించగలిగిందనడంలో అతిశయోక్తి లేదనిపిస్తుంది.

– ఎస్.వి. గోపాల్, కరీంనగర్.

## ఆలోచనాత్మకం (నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

జయకాంతన్ లబ్ధప్రతిష్ఠుడయిన నవలాకారుడని మాత్రమే తెలిసిన (నాబోటి) వాళ్ళకు, ఆయన ఎందుకు లబ్ధప్రతిష్ఠుడో 'అనుబంధాలు' నవల ద్వారా తెలిసొస్తుంది. ఈ నవల విశ్లేషణకు ఒకటి రెండు పేజీలు చాలవు. కేవలం కొన్ని ముఖ్యాంశాలు చెప్పు

కోవచ్చు

ఉదాత్తమయిన పాత్రలను సామాన్యమయిన నేపథ్యంపైన చిత్రించటం వల్ల, వాటిని స్ఫుటంగా, సజీవంగా నిలపటంలో రచయిత ప్రతిభ స్పష్టంగా కనిపిస్తుంది. ఈ రచయిత సామాన్య రచయిత కాదు!

ఆర్భాటాలూ, తళుకులూ, మెరుపులూ కథలోనూ, కథనంలోనూ రచయిత ప్రయత్నపూర్వకంగా పరిహరించి, చక్కని నవలా శిల్పాన్ని ఆవిష్కరించారు. పాలరాతి బొమ్మకు రంగు పూతలు నప్పవుకదా.

కథనం నదీ ప్రవాహంలా, సుగమంగా, నిరాటంకంగా సాగింది. ఆలోచనాత్మకంగానూ ఉంది. సన్నివేశాలు నిర్మించిన విధానం (ఉదాహరణకు ఆస్తి పంచాయితీ ఘట్టం), హృదయంగమంగా ఉంది. చిన్న పొరపాటుకు పెద్ద శిక్ష విధించుకొన్న 'మున్సిఫ్' (మునసబు అని అనువదిస్తే సముచితంగా ఉండేది) పాత్రలాంటి చిన్న పాత్రల చిత్రీకరణ కూడా పఠితను ఆకట్టుకొంటుంది.

నవల చిన్నదయినా, అనవసరమైన పాత్రలతో, సంఘటనలతో పక్కదారులు తొక్కకుండా, సీదాగా కథ చెప్పడం వల్ల రచయిత కథావస్తువుకు న్యాయం జరిపి, పాత్ర చిత్రణలో సమగ్రత సాధించగలిగారు. అయినా కూడా, కథ కొన్నిచోట్ల సంక్షిప్తంగా అనిపిస్తుంది. మరికొంత నిడివి ఉంటే, మరింత రస స్ఫోరకంగా ఉండేది.

నవల అనువాదం కూడా సరళంగా, హుందాగా ఉంది.

*– యం. హనుమంతరావు, హైదరాబాద్*

## చదివించే గుణం (ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

ఆంగ్లంలో చెప్పినట్లు "మాన్ ఈజ్ ది సోషల్ ఎనిమల్" ప్రకృతి సిద్ధంగా మానవుడు సంఘజీవి. ఇతరులతో సంబంధ బాంధవ్యాలు లేకుండా జీవించలేడు. ఆ సంబంధ బాంధవ్యాలు ఎప్పుడు ఎవరితో, ఎట్లా ఏర్పడ్తాయో అన్నది అనూహ్యం. ఈ నవలలో అలాంటి బాంధవ్య తోరణాన్ని చక్కగా వర్ణించారు. విశ్వనాథం దొరైస్వామి, దేవరాజులు, హెన్రీ ముఖ్యపాత్రలు-టీ కొట్టు యజమాని, మున్సబు, అక్కమ్మ, కరిపిగాడు, పాండు, పిచ్చిది. ఉప పాత్రలు- పిచ్చిది అతిథిపాత్ర- ఏనాడో ఊరు వదిలి వెళ్ళిపోయిన విశ్వనాథం దత్తత పుచ్చుకున్న కొడుకు హెన్రీ ఊరికి తిరిగివస్తాడు. తన తండ్రి కాని తండ్రి ఇల్లు బాగుచేయించుకొని అక్కడే స్థిరపడిపోతాడు. ప్రతి పాత్ర కుళ్ళు కుతంత్రం లేకుండా ఉండటం విశేషం. పిచ్చిదాని పాత్ర ఉద్దేశం అర్థం కాదు. ఇక హెన్రీని విశ్వనాథం దత్తత తీసుకోవడం, హెన్రీ అందరితో కలివిడిగా ఉంటూ వారిలో ఒకడుగా ఉండిపోవటం అనూహ్యం. చివరి దాకా చదివించే గుణం ఉన్న సాదాసీదా నవల.

*– కె. రామారావు,*
*హైదరాబాద్*

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net



## పరిగెత్తే పక్షి

ఎగరడమంటే ఈ పక్షిరాజా (జియోకోసిక్స, కాలిఫోర్నియానస్) వారికి మా పెద్ద చిరాకు. భూమ్మీద ఎంచక్కా పరిగెత్తడం లోనే ఆనందం ఉంటుందనుకునే ఈ రోడ్ రన్నర్ దాదాపు 23 అంగుళాల పొడవుంటుంది. పొడవాటి కాళ్లు, తోక, పొదలాంటి తురాయి కలిగి ఉండే ఈ పక్షి ప్రమాదం ఎదురవుతోందనుకున్నప్పుడు అతి వేగంగా పక్కకు తప్పుకుంటుంది తప్ప పరిగెత్తదు. అమెరికా, మెక్సికోలలో కనిపించే ఈ పక్షి కోకిల జాతికి చెందినది. చిన్న చిన్న పాముల్ని, పురుగుల్ని, బల్లుల్ని అప్పుడప్పుడు ఇతర పిట్టల పిల్లల్ని ఆరగించే ఈ రోడ్ రన్నర్ పన్నెండు అడుగులకంటే తక్కువ ఎత్తులోనే గూడు కట్టుకుంటుంది.